## నవ్యవీక్లి-తురగా ఫౌండేషన్ సంయుక్త నిర్వహణలో



### తురగా జానకీరాణి కథల పోటీ

| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. | 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. | 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. | 7,000 |

5 విశేష బహుమతులు

కథ ఒక్కింటికి : రూ. 5,000

### తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీ



| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. | 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. | 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. | 7,000 |

5 విశేష బహుమతులు

కథ ఒక్కింటికి : రూ. 5,000

### కథ/హాస్యకథ: నిబంధనలు

- కథ తెలుగు వారి జీవితాన్ని ప్రతిబింబించేలా ఉండాలి.
- ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.
- కథలు అరటావు సైజులో 10 పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది 6 పేజీలకు మించరాదు.
- కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జతపరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మేగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద **'తురగా జానకీరాణి కథల పోటీకి'** అని స్పష్టంగా పేర్కొనాలి. పోటీకి హాస్యకథ పంపుతున్నట్టయితే కవర్ మీద **'తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీకి'** అని పేర్కొనాలి.
- విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ (navyaweekly@andhrajyothy)కి పంపగలరు.
- బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.
- పోటీ గడువు తేదీ పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లి' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.
- కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలు తిప్పి పంపడం సాధ్యం కాదు.

### కథలు పంపవలసిన చిరునామా

నవ్య వీక్లి
ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్
ప్లాట్ నెం. 76
రోడ్ నెం 70
అశ్వనీ లే అవుట్
హుడా హైట్స్
జూబ్లీహిల్స్
హైదరాబాద్-500033

## కథలు, హాస్యకథలు చేరవలసిన ఆఖరు తేది

# 30 జూన్ 2017

* నిబంధనలు వర్తిస్తాయి





## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



*ముఖచిత్రం:* విద్యాబాలన్


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**

*నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33.* email: navyaweekly@andhrajyothy.com





### అమెరికా

**టీచర్:** రాగిణీ! అదిగో ఆ మ్యాప్‌లో అమెరికా ఎక్కడున్నదో చెప్పు.

**రాగిణి** మ్యాప్‌లో అమెరికాను గుర్తించి, 'ఇదిగో! ఇక్కడ' అని చూపించి, చెప్పింది.

**టీచర్:** గుడ్! పిల్లలూ ఇప్పుడు చెప్పండి, అమెరికాను ఎవరు కనిపెట్టారు.

**స్టూడెంట్స్:** రాగిణి

### ఎక్కడున్నావు?

**భర్త**కు ఫోన్ చేసింది భార్య. ఆందోళనగా చెప్పిందిలా.

**భార్య:** ఏమండీ కారు పని చెయ్యడంలేదు. పాడైనట్టుంది.

**భర్త:** పాడైందా? అదేం లేదే! మొన్ననేగా సర్వీస్ చేయించి పెట్టాను. సరే, ప్రాబ్లం ఏంటి?

**భార్య:** కార్బొరేటర్లో నీరు చేరినట్టుంది.

**భర్త:** అవునా! ముందీ సంగతి చెప్పు, నువ్విప్పుడు ఎక్కడ ఉన్నావు?

**భార్య:** మన ఇంటిపక్క చెరువు ఉందా? అందులో ఉన్నాను.

### యాష్‌ట్రే

గర్ల్‌ఫ్రెండింటికి అతను రావడం అది మొదటి సారి. అతన్ని ఫ్రంట్‌రూంలో కూర్చోబెట్టి, కాసేపు కబుర్లాడిందామె. తర్వాత కాఫీ కలుపుకుని వస్తానని కిచెన్ రూంలోనికి వెళ్ళింది. ఆమె వచ్చేంతవరకు ఏం చెయ్యాలి? ఊసుపోవాలి కదా? అందుకని బోయ్ సిగరెట్ ముట్టించాడు. ముట్టించి, అటుగా డైనింగ్‌టేబుల్ కేసి చూశాడు. టేబుల్ మీద చిన్న పాత్ర ఉంది. మూత పెట్టి ఉంది. పనికొస్తుందని తెచ్చి ఫ్రంట్‌రూంలో పెట్టాడు. అంతలో అక్కడికి కాఫీతో వచ్చింది గర్ల్.

"ఈ పాత్రేంటి? మూత కూడా పెట్టి ఉంచారు." అడిగాడు బోయ్.

"అదా! అది మా డాడీ యాషెస్." అంది గర్ల్.

"అవునా" అని ఒక అడుగు వెనక్కి వేశాడు బోయ్. భయపడ్డాడు.

"పొరపాటున తీసుకొచ్చానిక్కడికి" అన్నాడు.

"పొరపాటేమీ లేదందులో. మాడాడీ మహా బద్ధకిస్టు. అంతేకాదు, ఎక్కడ కూర్చుంటే అక్కడే సిగరెట్ తాగడం ఆయనకు అలవాటు. అది ఆయన యాష్‌ట్రే." చెప్పింది గర్ల్.

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 15

14-6-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



# మొదటి పేజి

## జంతికల జానకమ్మ

ముప్పయి అయిదేళ్ళ నాటి మాట. భర్తను పోగొట్టుకుని, చిన్నపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలతో జానకి ఏడుస్తోంటే...ఏడవకే! నీకూ మంచిది కాదు, పిల్లలకీ మంచిది కాదు. బతుకంటే భయపడిపోతారు. నా మాట విను! ఇదిగో! ఈ అయిదువందలూ ఉంచుకో! చావోరేవో వీటితో తేల్చుకో! అన్నగా నా తాహతు ఇంతే! ఇంకేమీ చెయ్యలేను, క్షమించు అన్నాడు అన్నయ్య. అని, కన్నీరుపెట్టుకుని వెళ్ళిపోయాడు. పుట్టెడుదుఃఖంలో ఉన్న తననీ, పిల్లల్నీ అక్కున చేర్చుకుంటాడనీ, పుట్టింటికి తీసుకుపోతాడనీ ఎన్నెన్నో అనుకున్నది జానకి. అన్నిటినీ రేవులో తొక్కిపెట్టి, పడవెక్కి, తల వంచుకుని మరీ వెళ్ళిపోయాడు అన్నయ్య. అలా వెళ్ళిపోతున్న అన్నయ్యను కనుమరుగయ్యేవరకూ చూసి, తర్వాత చేతిలోని అయిదువందలనోటు చూసింది జానకి. ఈ అయిదువందలే భవిష్యత్తు. ఈ అయిదువందలే పెట్టుబడి అనుకున్నది. ఎక్కడైతే అన్నయ్య తన చేతిలో డబ్బుపెట్టాడో అక్కడే పొయ్యిపెట్టి, మర్నాటి నుంచి బతుకుతెరువు వెతుక్కుంది జానకి. జంతికలు చేయడం ప్రారంభించింది. చిన్నజంతికలు, పెద్దజంతికలు, కారంజంతికలు, గారంజంతికలంటూ నాలుగురకాలు జంతికలు చేసి అమ్మజూపింది. పొద్దున ఏడుగంటలకి పొయ్యిపెడితే, రాత్రి ఏడెనిమిదిగంటలవరకూ వ్యాపారమే! పొద్దునపడవెక్కి, అవతలొడ్డున బడులకు వెళ్ళే పిల్లల దగ్గరనుంచీ రాత్రివేళ పడవదిగి, ఇంటికి చేరే పెద్దలవరకూ అందరూ జంతికలు కొనాల్సిందే! తినాల్సిందే! జానకమ్మ జంతికలు రెండు తిని, రెండు దోసిళ్ళు నీరు తాగితే చాలు! కడుపునిండిపోతుంది అనే వారంతా.

అగ్రహారం ఆలయంలోని శివుణ్ణి దర్శించుకుంటే పెళ్ళికానివారికి పెళ్ళి అవుతుంది, వీసా రానివారికి వీసా వస్తుందని ఎంత ప్రచారం జరిగిందో అంతే ప్రచారం జానకమ్మ జంతికలకు కూడా జరిగింది. అమ్మాయికి వేవిళ్ళు. నీ జంతికలే కావాలంటోంది. ఓ పాతిక కట్టు అనే తల్లులు ఎంతమందో లెక్కలేదు. అలాగే ఆలయంలోని శివుడికి జానకమ్మ వేడివేడి జంతికలు నైవేద్యం చేశారెవరో! అలవాటు పడితే ఊరుకుంటాడా? అవే కావాలంటున్నాడు భోళాశంకరుడు. జంతికిచ్చి చూడు, అడిగింది ఇవ్వకపోతే చూడు అంటున్నాడు.



జంతికలు అమ్మే జానకమ్మ ఇల్లు కట్టింది. జంతికలు అమ్మే జానకమ్మ పిల్లలకు పెళ్ళిళ్ళు చేసింది. జంతికలు అమ్మే జానకమ్మ, శివుడికి బంగారుకళ్ళు చేయించింది. జంతికలు అమ్మే జానకమ్మ అగ్రహారంలో పెద్దపెళ్ళిమంటపం నిర్మించింది. జంతికల జానకమ్మంటే దిక్కూమొక్కూలేని ఆడది కాదు, ఊరూవాడకి పెద్దదిక్కు అన్నంతగా ఎదిగిపోయింది.

ఆమధ్య ఏం జరిగిందో తెలుసా? అగ్రహారంలోని చాలామంది మగాళ్ళు దీక్షతీసుకుని, అక్కడెక్కడో కొండమీది జ్యోతిని చూడ్డానికి వెళ్ళారు. జ్యోతి చూసేటప్పుడు తొక్కిసలాట జరిగింది. ఆ తొక్కిసలాటలో ఒకరిద్దరు మినహా వెళ్ళిన అగ్రహారం మగాళ్ళంతా పోయారు. మిగిలిన ఆ ఒకరిద్దరూ దివ్యాంగులయ్యారు. ఆడవారికన్నీటితో అగ్రహారంలోని నదికి వరద వచ్చినట్టయిందప్పుడు. పోషించే మనిషిలేడు. ఉన్నా పోషించేస్థితిలో లేడు. స్త్రీలంతా ఒకటే రోదన! చంటిపిల్లల్ని పెట్టుకుని, గుండెలుబాదుకుంటుంటే జానకమ్మ వారించింది వారిని. ఓదార్చింది. పెద్దదిక్కుని నేనున్నాను, భయపడకండి అన్నది. దినాలైన మరుక్షణం నుంచీ వారిని పనిలో నిమగ్నులను చేసింది. తాను జంతికలను చేసే విధానం నేర్పింది. సెనగ పిండి, వరిపిండి, తెల్లనువ్వులు, వాము, కారం, ఉప్పూ తగినంత వేసి, చేసిన జంతిక రుచిగా ఉండాలి. తిన్నవారు క్షేమంగా ఉండాలని కోరుకోమన్నది. తొలివాయిలోని జంతికొకటితీసి, శివయ్యకు నైవేద్యం పెట్టమన్నది. అంతే! బతుకు బంగారం అవుతుందన్నది. జానకమ్మ చెప్పినట్టే చేశారంతా. ఆమె చెప్పినట్టుగానే వారి బతుకులు బంగారాలయ్యాయి. ఊరికొక్కరిగా విడిపోయి పేరు పేరునా జంతికలను ప్రసిద్ధిచేశారంతా. దాంతో జానకమ్మ జంతిక అమెరికా, లండన్, దుబాయ్... విదేశాలకు వెళ్ళిపోయింది. విందు చేసింది.

తనకే కాదు, నలుగురికీ బతుకుతెరువు చూపించిన జంతికను విష్ణుచక్రం అనేదట జానకమ్మ. దానిముందు చేతులొగ్గి నిలబడాలనేదట! కడవరకూ అలాగే ఉన్నది జానకమ్మ. మొన్ననే పోయింది. తను పోయినా తన జ్ఞాపకంగా జంతికను మిగిల్చింది. దానినే కథగా చెబుతారంతా. ఆ కథనే మీరిప్పుడు విన్నారు.




## నో రిటైర్‌మెంట్

రిటైర్‌మెంట్‌కి దగ్గరపడుతున్న ప్రభుత్వ ఉద్యోగి అయినా, ప్రైవేట్ ఉద్యోగి అయినా ఆ తరువాత ఏంటి పరిస్థితి? అని ఆలోచిస్తుంటారు. రిటైరయ్యాక ఏ పనీ లేక ఖాళీగా కూర్చోవడం చాలా మందికి ఇబ్బందిగా ఉంటుంది. కొందరేమో ఏవేవో పనులు కల్పించుకొని చేస్తూ తమ ఖాళీసమయాన్ని గడిపేస్తుంటారు. అయితే రిటైర్‌మెంట్ తర్వాత కూడా ఆసక్తి, అవసరం ఉన్నవారికి మేము ఉద్యోగ అవకాశాలు కల్పిస్తాం అంటోంది నాట్‌రిటైర్డ్ డాట్ ఇన్.

సీనియర్ సిటిజన్స్ కోసం జాబ్ పోర్టల్ ప్రారంభించి వినూత్న ప్రయోగానికి తెర తీశారు ప్రతాప్ కుంద. హైదరాబాద్ కేంద్రంగా మొదలైన ఈ స్టార్టప్ ఇప్పుడు సీనియర్ సిటిజన్లకు కొత్త జీవితం అందిస్తోంది. పదవీ విరమణ పొందిన ఉద్యోగులు సెకండరీ సిటిజన్స్‌గా సమాజంలో చిన్నచూపు చూడబడుతున్నారనే బాధ నుంచి పుట్టిన ఆలోచనే నాట్‌రిటైర్డ్ డాట్ ఇన్. ఇటు ఉద్యోగార్థులను, అటు కంపెనీలను ఒకే వేదిక మీదకు తెచ్చే ఈ స్టార్టప్ దేశవ్యాప్తంగా అన్ని ప్రధాన నగరాల్లోనూ తన సేవలందిస్తోంది. జాబ్ నుంచి రిటైర్ అయిన వాళ్లకి, త్వరలో రిటైర్ కాబోయే వారికి కూడా ఉపాధి అవకాశాలను కల్పిస్తోంది. విభిన్న రంగాల్లో అధికారులుగా పని చేసి సుదీర్ఘ అనుభవాన్ని సంపాదించిన వారు తమ సేవల్ని పదవీ విరమణ తరువాత కూడా అందించేందుకు ఈ స్టార్టప్ దోహదపడుతోంది.



ఉద్యోగ విరమణ తర్వాత కనీసం పది పన్నెండేళ్లు యాక్టివ్‌గా పని చేసేందుకు ఇంట్రస్టు చూపించే వాళ్లున్నారు. వారి అనుభవం ఇతర రంగాల్లో కూడా ఉపయోగించుకుంటే ఇక చెప్పేదేముంది. హైదరాబాద్ కేంద్రంగా కార్యకలాపాలు సాగిస్తున్న నాట్‌రిటైర్డ్ డాట్ ఇన్ 300కు పైగా కంపెనీలతో ఒప్పందం కుదుర్చుకుంది. పదవీ విరమణ తరువాత కూడా ఉద్యోగం చేయాలనుకునేవారు ఈ వెబ్‌సైట్‌లో అకౌంట్ క్రియేట్ చేసుకొని వివరాలు నమోదు చేస్తే చాలు. కంపెనీలు సైతం నేరుగా తమకు ఎలాంటి ఉద్యోగులు కావాలో వివరాలు నేరుగా పోస్ట్ చేయవచ్చు. ఇటు ఉద్యోగులకు, అటు కంపెనీలకు వేదికగా వ్యవహరిస్తుంది ఈ స్టార్టప్. ఉద్యోగాలతో పాటు, పార్ట్ టైం, అడ్వైజరీ, కన్సల్టెంట్, వర్క్ ఫ్రం హోమ్... ఎలాంటి ఉద్యోగం కావాలన్నా నాట్‌రిటైర్డ్‌లో సెర్చ్ చేసుకోవచ్చు. బాగుంది కదా ఆలోచన.




# మెయిల్ బాక్స్

### సకుటుంబ వారపత్రిక

'మాతృదేవతలకు అమృతలత అపురూప పురస్కారాలు' ఐటెమ్ చదివాను. చాలా బాగుంది. ప్రతివారం ఇటువంటి కవరేజ్ వార్తలను ప్రత్యక్షంగా ప్రచురిస్తున్న నవ్య వారపత్రికకు ధన్యవాదాలు. వీక్లీలో కథలన్నీ వాస్తవాలనే ప్రతిబింబిస్తున్నాయి. సంపూర్ణ సకుటుంబ వారపత్రికగా నవ్యను తీర్చిదిద్దుతున్న తరుణంలో కొత్త ఫీచర్లు ఉంటే బాగుంటుంది.

*–దుర్గ్గ మహాన్తిమోహనరావు, హైదరాబాద్–62*

### యుద్ధమే పరిష్కారమేమో !

జాదవ్‌ను ఉరితీయాలని పాకిస్థాన్ భావించడం అన్యాయం. ఆ దేశం ఎవరిమాటా వినదు. అది పాఠం నేర్చుకోలేదు. ఇక యుద్ధమే పరిష్కారం కావచ్చు. హరివంశం సీరియల్ ఉత్సుకతతో సాగుతోంది. పజిల్స్ బాగున్నాయి. మొదటిపేజీ తులశమ్మకథ బాగుంది.

*–వాస్తు రామచంద్ర, నెల్లూరు*

### ఈ మధ్య ఇలాంటి సీరియల్ చదవలేదు

ప్రభాకర్‌జైనిగారి సినీవాలి సీరియల్ అద్భుతంగా ఉంది. ఈ మధ్యకాలంలో ఇలాంటి సీరియల్ చదవలేదు. సినిమా అంటేనే చెప్పలేనంత ఆకర్షణ. సినిమా నిర్మాణం గురించి ఎవరికీ తెలియని, ఎన్నో విషయాలు, ఒక చిత్రరాజం తయారుకావడానికి ఎంత యజ్ఞం చెయ్యాలో, ఎంత యుద్ధం చెయ్యాలో, ఎంత ఒత్తిడికి గురికావాలో ఎంతో వివరంగా ఈ సీరియల్‌లో రాశారు. ప్రతి మనిషినీ గౌరవంగా చూస్తూ, వారిలో ఉండే గొప్పతనాన్ని గుర్తించే ఒక చక్కని వ్యక్తిత్వం, ధైర్యం, నిజాయితీ, కలబోసిన అరుదైన హీరోపాత్రను సీరియల్ మొత్తంలో ఎన్నో కోణాల్లోంచి చూపించిన జైనిగారికి హృదయపూర్వక అభినందనలు.

*–ఎల్.ప్రఫుల్లచంద్ర, ధర్మవరం*

### బాలి సీరియల్ బాగుంది

కొత్త సీరియల్ బాలిగారి ప్రయాణం చాలా బాగుంది. ఒక ఆడపిల్ల కథ ఆరంభమే ఆకట్టుకుంది. పెళ్ళి, పిచ్చుక కథలు చాలా బాగున్నాయి. మనమీదే నర్రోయ్ కార్టూన్‌లో రైలులో సంభాషణతో నవ్వించారు. హర్ష ఋతువు కథ చివరివరకు చాలా ఆసక్తికరంగా సాగింది. వెట్టి సీరియల్ వారం వారం సరికొత్త మలుపులు తిరుగుతూ ఆకట్టుకుంటోంది. ఆరోగ్యమే మహాభాగ్యం ఫీచర్‌లో సైకిల్ తొక్కడం వల్ల కలిగే లాభాలు వివరించారు. తీన్మార్ కార్టూన్లు సరికొత్తగా ఉంటున్నాయి.

*–శ్రీదేవి, డోర్నకల్*

### కథలు బాగున్నాయి

సరసి కథ మనిషి–పశువు' మూగజీవాల్ని హింసించకూడదనే నీతిని బోధించింది. 'చరిత్రలు అడగవద్దు' కథా రచయిత చదువరిని ఇన్‌వాల్వ్ చెయ్యడమనే టెక్నిక్‌ని చక్కగా ఉపయోగించారు. యాదగిరి బతుకు తెరువు వివరాలు రాబట్టిన విధానం ఆసక్తి పెంచింది. జర్నీ కథ సంభాషణలు కొత్తరూపాన్నిచ్చాయి. పర్యాటక ప్రాంతాలు దర్శిస్తే ఆ మానసిక ఉల్లాసమే వేరు. అటువంటి ఉత్సాహం వెల్లివిరిసింది మాతృదేవోభవ, మగవారు వర్సెస్ ఆడవారు, ప్రాణాలు రక్షించే రహస్యం శీర్షికలతో.

*–టి.సాయిసంతోషిణీరీతిక, అనకాపల్లి*

### మొదటిపేజీ అంటే మోటివేషన్

నవ్య వీక్లీ 'మొదటిపేజీ' కోసమే ప్రతివారం కొంటాను. మూడు వారాలుగా దుమ్ముదులిపేస్తోంది. రాయుడుబాబునది, అమ్మా!రాములమ్మా, వేణువై వచ్చాను...మూడూ మూడు ఆణిముత్యాలు. శిథిలమైన రామాలయాన్నీ, గుర్రపుడెక్క

**మొదటి పేజి**

మొలిచిన నదినీ బాగుచేసేందుకు ఆస్తిమొత్తం ఖర్చుచేసిన రాయుడుబాబు ప్రజల్లో మిగిలిపోయాడు. ఊరికి ఎంతో కొంత తిరిగివ్వాలి. ఆ మోటివేషన్ అందరిలో రావాలి. అగ్రహారం వేలుపు రాములమ్మ హెచ్చరిక ఒక ముందు జాగ్రత్త. మన నమ్మకమే జీవితాన్ని సరైన మార్గంలో నడిపిస్తుంది. బతుకులో ఆశ నింపుతుంది. వేణువు ఊదటం శ్వాసకోశవ్యాధులకు చికిత్స అని చక్కగా చెప్పారు. ఒకసారి మొదటి పేజి చదివితే వారమంతా ఇన్‌స్పైర్ చేస్తుంది.

*–కె.కొండయ్య, రిటైర్డ్ టీచర్, ఏలూరు*

#### బతుకు పాఠం

ఉన్న ఊరు కన్నతల్లి ఒక్కటే. పుట్టినూరు వదిలివెళ్ళినవాడు ఎప్పటికో తిరిగొచ్చాక ఊరు బాగుపడితే సంతోషిస్తాడు. వెనకబడితే బాధపడతాడు. కానీ రాయుడుబాబు తన ఊరి రామాలయాన్ని, నదీ ప్రవాహాన్ని కాపాడుకోవడానికి ఆస్తిమొత్తం ఖర్చుపెట్టి ఊరుకు ఆదర్శమయ్యాడు. మొదటిపేజి మనిషిని ముందుకు నడిపించే ఒక టానిక్ అని చెప్పడం అతిశయోక్తికాదు. 'వేణువై వచ్చావు' జీవితంలో ఉండే సున్నితమైన విలువల్ని మనకు నేర్పుతుంది. ప్రతి విద్యార్థీ, అన్ని వయసులవారు ఇవన్నీ చదవాలి, నేర్చుకోవాలి. జీవితంమీద ఆశపుట్టించే బతుకుపాఠాలు ఇవన్నీ.

*–పెళ్ళూరి ప్రవీణ్, సాలగ్రామం, చెన్నై–93*

### హిట్‌మూవీ అవుతుంది

హాజీమస్తాన్ జీవితం గురించి చదివి ఆశ్చర్యపోయాం. అంతకుముందు ఇతడిగురించి తెలుసుగానీ, ఒక కొత్త కోణంలో ఆ డాన్ జీవితం ఆవిష్కరించారు. ఇది చదివాక రజనీకాంత్ తప్పనిసరిగా దీన్ని మంచి సినిమాగా తీస్తే బాగుంటుందనిపించింది. తప్పనిసరిగా అదొక సూపర్‌హిట్ మూవీ అవుతుందనిపిస్తోంది. రచయిత్రికి ధన్యవాదాలు.

*–వల్లీపద్మావతి, హైదరాబాద్*

## వైరస్‌లను అణచడం హోమియోకే సాధ్యం

**హెపటైటిస్ :** ఈ వైరస్ మూలంగా అనేక మంది తీవ్రమైన కాలేయ వ్యాధి బారినపడి ప్రాణాలు కోల్పోతున్నారు. వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం, తల్లి నుంచి శిశువుకు కూడా సంక్రమించే అవకాశం ఉంది. లైంగిక సంబంధాల ద్వారా కూడా వ్యాపిస్తుంది. ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. లో గ్రేడ్ ఫీవర్, పొట్ట పైభాగంలో నొప్పి, జాండిస్ వంటి లక్షణాలు కనిపిస్తాయి.

**హెచ్ఐవి :** ఈ వ్యాధి పేరు చెబితేనే ప్రతీ ఒక్కరూ భయపడిపోతారు. చికిత్స లేని వ్యాధిగా హెచ్ఐవికి పేరుంది. నిజానికి హోమియోలో హెచ్ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, చిన్న చిన్న వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటి పొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది

**హోమియో చికిత్స :** హెపటైటిస్, హెచ్ఐవి, హెర్పిస్ వంటి వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూల కారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. హోమియో చికిత్స అనంతరం వ్యాధులు మళ్లీ తిరగబెట్టడం ఉండదు.

## కీళ్లనొప్పులతో కదలడమే కష్టమైతే!

కీళ్లనొప్పులను ఆర్థరైటిస్ అని అంటారు. కీళ్లు గట్టిపడటం, కీళ్ల వాపుతోపాటు నొప్పి ఏర్పడటాన్ని ఆర్థరైటిస్‌గా పేర్కొంటాం.

**ఆస్టియో ఆర్థరైటిస్ :** ఎక్కువ మందిని బాధ పెట్టే సమస్య ఇది. వయసు పెరుగుతున్న కొద్దీ జాయింట్లలో ఉన్న కార్టిలేజ్ అరిగిపోవడం వల్ల ఈ సమస్య తలెత్తుతుంది. ఎముకల చివరన ఉన్న కార్టిలేజ్ బాగా అరిగిపోయి, ఎముకలు రెండూ ఒకదానికి ఒకటి రాసుకుపోయి ఆ భాగాన నొప్పి, వాపు వంటివి కనిపిస్తాయి. ఈ వ్యాధి మోకాళ్లలో కనిపిస్తుంది. వృత్తిరీత్యా ఎక్కువ సేపు నిలబడటం, ఎక్కువగా కూర్చోవడం, క్రీడల్లో పాల్గొనే వారిలో ఇలాంటి సమస్య త్వరగా వచ్చే అవకాశముంది. మొదట కూర్చొని, లేచేటపుడు జాయింట్లు పట్టినట్లుగా ఉండి తీవ్ర నొప్పిని కలగజేస్తుంది. జాయింట్లలో టకటకమనే శబ్దం వస్తుంది.

**రుమటాయిడ్ ఆర్థరైటిస్ :** ఈ వ్యాధి శరీరంలోని అన్ని రకాల కీళ్లపై ప్రభావం చూపిస్తుంది. దీన్ని ఆటో ఇమ్యూనో డిజార్డర్‌గా గుర్తిస్తారు. ఈ సమస్య పురుషుల్లో కన్నా స్త్రీలలో ఎక్కువగా కనిపిస్తుంది. ఈ వ్యాధి చలికాలంలో తీవ్రమైన బాధకు గురిచేస్తుంది. ఈ వ్యాధి శరీరంలో చేతివేళ్లకు, మోకాళ్లకు, మణికట్టు కీలుకు, కాలివేళ్లకు ఎక్కువగా వ్యాపిస్తుంది. ఉదయం పూట నొప్పి ఎక్కువగా ఉండి కదలలేని పరిస్థితి ఎక్కువగా ఉంటుంది.

**హోమియో చికిత్స :** కీళ్లనొప్పులు శాశ్వతంగా దూరం కావాలంటే హోమియో ఒక్కటే మార్గం. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. దీనివల్ల ఫలితం బాగుంటుంది. హోమియో మందులతో ఎలాంటి సైడ్‌ఎఫెక్ట్స్ ఉండవు. వ్యాధి మళ్లీ తిరగబెట్టే అవకాశం కూడా తగ్గిపోతుంది.


**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106




V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.

## బీజాలనొప్పిని ఎలా భరిస్తారు?

వీర్యకణాల ఉత్పత్తి, టెస్టోస్టిరాన్ హార్మోన్ తయారీలో వృషణాల(టెస్టికల్స్) పాత్ర చాలా కీలకం. వృషణాలు దెబ్బతింటే సంతానలేమి సమస్య ఎదురవుతుంది. కొన్నిసార్లు కొంతమందిలో వృషణాల నొప్పి చాలా బాధిస్తుంది. వృషణాల్లో నొప్పి రావడానికి చాలా కారణాలుంటాయి. నొప్పి, వృషణాల్లో వాపు, ముట్టుకుంటే భరించలేనంత నొప్పి వంటి లక్షణాలుంటాయి. కొన్నిసార్లు రెండు వృషణాల్లో నొప్పి ఉంటే కొన్నిసార్లు ఒకే వృషణంలో ఉంటుంది.

### కారణాలు అనేకం

అపరిచితులతో శృంగారం జరపడం వల్ల సుఖవ్యాధులు వచ్చే అవకాశం ఉంటుంది. అలా సుఖవ్యాధులు సోకినపుడు బ్యాక్టీరియా వల్ల వృషణాల్లో వాపు, నొప్పి రావచ్చు. కొన్నిసార్లు దెబ్బతగలడం వల్ల కణజాలం దెబ్బతిని వాపు, నొప్పి రావచ్చు. మూత్రపిండాల్లో రాళ్ల ఉన్నప్పుడు కూడా వృషణాల నొప్పి వచ్చే అవకాశం ఉంటుంది. వృషణాల్లో ఏర్పడే ట్యూమర్స్ కూడా వాపు, నొప్పికి కారణమవుతుండవచ్చు. ఇంగ్వినల్ హెర్నియా వల్ల కూడా వృషణాల్లో నొప్పి వస్తుండవచ్చు. వైరల్ ఇన్‌ఫెక్షన్ల వల్ల కూడా వృషణాల్లో నొప్పి వస్తుండవచ్చు. కాబట్టి ముందుగా కారణం తెలుసుకుని చికిత్స అందించాలి. కారణం తెలుసుకోవడం కోసం రక్తపరీక్షలు, స్కానింగ్, సీటీస్కాన్ వంటి పరీక్షలు అవసరమవుతాయి.

### హోమియో చికిత్స

హోమియో మందులు మూల కారణాన్ని తొలగిస్తాయి. ఫలితంగా సమస్య శాశ్వతంగా తొలగిపోతుంది. శారీరక లక్షణాలు, మానసిక లక్షణాలు, వ్యాధిని పరిశీలించి చికిత్స అందిస్తే ఫలితాలు బాగుంటాయి. ఎలాంటి సైడ్‌ఎఫెక్ట్‌లు ఉండవు.

## నడుంనొప్పి ఉంటే సుఖమెక్కడిది?

నడుము నొప్పి మూలంగా ఏ పనీ చేసుకోలేకపోతారు. ఉదయం వేళ నొప్పి తీవ్రంగా ఉంటుంది. నొప్పి క్రమంగా నడుము నుంచి కాళ్లలోకి విస్తరిస్తుంది. అరుదుగా మూత్రవిసర్జనపై నియంత్రణ కోల్పోవడం జరుగుతుంది. లుంబార్ స్పాండిలోసిస్‌తో దీర్ఘకాలంగా బాధపడే వారిలో శృంగార సమస్యలు కూడా ఎదురవుతాయి. సరియైన భంగిమలో కూర్చోకుండా పని చేసే వారిలోనూ, గంటల తరబడి కూర్చుని పనిచేసే వారిలోనూ ఈ సమస్య వస్తుంది. కొందరిలో నొప్పి నడుం నుంచి మోకాళ్లు, పిక్కల ద్వారా అరికాళ్లు, కాలివేళ్ల దాకా వ్యాపిస్తుంది. దీన్ని సయాటికా అంటారు. వెన్నులో ప్రతి రెండు వెన్నుపూసల మధ్య కొంత ఖాళీ ప్రదేశం, ఒక సయాటిక్ నరం, పూసలను బంధించి ఉంచే కొన్ని కండరాలు ఉంటాయి. మన దైనందిన పనుల్లోని కొన్ని లోపాల వల్ల కొందరిలో ఈ పూసలను బంధించి ఉంచే కండరాలు బలహీనమవుతాయి. ఫలితంగా పూసల మధ్య సహజంగా ఉండవలసిన ఖాళీ తగ్గిపోతుంది. దీనివల్ల పూసల మధ్య ఉండే సయాటికా నరం ఒత్తిడికి లోనవుతుంది. దీనివల్ల ఆ నరం శరీరంలో ఎంత దూరం వెళితే అంత దూరం నొప్పి వస్తూనే ఉంటుంది.

**లక్షణాలు ఇలా ఉంటాయి :** చాలా మందిలో కుడి వైపు నొప్పి ఎక్కువగా వస్తుంది. నడుము నొప్పి రావడం, కొద్దిగా శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగడం, మొదట నడుము భాగంలో మొదలై క్రమేణా తొడ వెనక భాగానికి పాకుతుంది. తరువాత మోకాళ్లు, పాదాల చివరకు, పిక్కలు, మడమలకు వ్యాపిస్తుంది. కరెంట్ షాక్ కొట్టినట్లు నొప్పి వస్తుంది. ఒక్కోసారి తిమ్మిర్లు, మంట వంటి లక్షణాలు ఉంటాయి.

**హోమియో చికిత్స :** నొప్పి ఏదైనా సమూలంగా తగ్గాలంటే హోమియో చికిత్స ఒక్కటే మార్గం. లుంబార్ స్పాండిలోసిస్, సయాటికా సమస్యలకు హోమియో వైద్య విధానంలో అద్భుతమైన చికిత్స అందుబాటులో ఉంది.



# ఆనందమే జీవితమకరందం

## జూన్ 11న నేషనల్ మేకింగ్ లైఫ్ బ్యూటిఫుల్ డే సందర్భంగా

**జీవితం ఒక ఆట, ఆడి గెలువు! జీవితం ఒక యుద్ధం, పోరాడు! జీవితం ఒక బహుమతి, స్వీకరించు! జీవితం ఒక ప్రయాణం, కొనసాగించు! జీవితం ఒక రహస్యం, పరిశోధించు! జీవితం ఒక సాహసం, ధైర్యంగా ఎదుర్కో! జీవితమంటే ప్రేమ, ఆస్వాదించు! జీవితం కష్టాల కడలి, ఈదుతూ తీరాన్నిచేరు!**

జీవితంలో హాయిగా ఉండటం ముఖ్యం. సంతోషంగా గడపడం ప్రధానం. జీవితాన్ని సంతోషంగా, అందంగా తీర్చిదిద్దుకోవడం అవసరం. వీటన్నింటికీ మూలం ఆనందం. ఆనందమే జీవనసూత్రం అన్నది ఆధునిక జీవిత నైజం. హాయిగా, ఆనందంగా ఉండాలనుకోవడం తప్పుకాదు. అదే సమయాన ఇతరులకు నొప్పి కలిగించకుండా హాయిగా ఉండాలన్న తత్వం అవసరం. సంతోషం సగం బలం అన్నారు పెద్దలు. దృఢమైన శరీరంలోనే దృఢమైన మనసు ఉంటుందన్నారు. మనిషి మానసికంగా, శారీరకంగా ఆరోగ్యంగా ఉంటే ఆనందంగా ఉండగలడు. ఆనందంగా ఉండేవారు ఆరోగ్యంగా, హాయిగా ఉంటారు. ఇవి పరస్పర పూరకాలు. ఒకదాని మీద ఒకటి ఆధారపడి ఉంటాయి. మానవ మనస్తత్వానికి సంబంధించిన అధ్యయనాలు కూడా ఇదే విషయాన్ని చెబుతున్నాయి.

### ఆనందం ఒక మానసిక స్థితి

ఉన్నంతలో తృప్తిగా బతకడంలోనే ఆనందం ఉంటుందని భారతీయ తత్వవేత్తలు చెబుతారు. అందుకని ఆశలు, ఆశయాలు ఉండక్కర్లేదని కాదు. వాస్తవికంగా ఉండాలి. తమ బలాలు, బలహీనతల పట్ల స్పష్టత ఉండాలి. సంతృప్తిలోని సంతోషం ఏమిటో గ్రహించాలి. అందుకే మన మానసిక స్థితి ఆనందానికి అనువుగా ఉండాలి. ఏది జరిగినా మన మంచికే అనే స్వభావం మనిషిని మరింత ఆనందంగా ఉంచుతుంది. దీనివల్ల సానుకూలంగా స్పందిస్తూ వ్యవహారాల్ని చక్కబెట్టే నేర్పు అలవడుతుంది. తద్వారా ఫలితాలు కూడా సానుకూలంగా ఉంటాయి. దీనితో సహజంగానే ఆనందంగా ఉంటారు. వయసు మీద పడుతున్నకొద్దీ ఈ స్వభావం చేకూరితే ఆనందంగా, హాయిగా ఉండటం సాధ్యం.

### జీవితమంటే మారథాన్ కాదు, నడక లాంటిది

కొండల్లో ఎత్తుపల్లాలు ఎంత సహజమో, జీవితంలో ఒడిదుడుకులూ అంతే సహజం. ఏదయినా సమస్య వచ్చినప్పుడు కంగారుపడిపోవడం మానవ నైజం. సమస్యను సమస్యలా చూడకుండా జీవితంలో ఇవన్నీ మామూలే అనుకుని, ప్రశాంతంగా సమస్య లోతుల్లోకి వెళ్ళి పరిష్కారం దిశగా అడుగులేయడం వల్ల మనస్సు దృఢమవుతుంది. ధైర్యంగా ఎదుర్కొనే స్థైర్యాన్ని, మనోనిబ్బరాన్ని ఇస్తుంది. మారథాన్‌లా సమస్యతోపాటు పరుగులు పెడితే, సమస్య మరింత జటిలం అయ్యే అవకాశం ఉంటుంది. కాబట్టి ఏదయినా నిర్ణయం తీసుకునే ముందు పూర్వాపరాలు, మంచి చెడులు అన్నీ ఆలోచించి నెమ్మదిగా నడవటం మేలు.

### ఆనందాన్ని దూరం చేసే వ్యాకులత

ఆధునిక జీవితంలో చికాకులు, ఒత్తిళ్ళు అనేకం. మనకు సంబంధం లేకున్నా మనల్ని ఆందోళనకు గురిచేసే అనుభవాలు ఎదురవుతాయి. ఆనందంగా ఉండే సందర్భాల్ని చెదరగొడతాయి. ఇలాంటి పరిస్థితుల్లో దృఢమైన మనస్తత్వం, స్థితప్రజ్ఞత మాత్రమే మనుషుల్ని గట్టెక్కిస్తాయి. ఏ విషయంలోనూ అతిగా ఆలోచించవద్దు. జీవితాన్ని యథాతథంగా తీసుకుంటూ సంతోషంగా గడిపేవారికి మాత్రమే ఇది సాధ్యం. కానీ నిత్యం వ్యాకులతకు లోనయ్యేవారు పసిపాప చిరునవ్వుల్లోని మురిపాన్ని కూడా ఆస్వాదించలేరు. ఉదయపు నడకలోని హాయిని అనుభవించలేరు. ఒత్తిడితో, వ్యాకులతతో, ఆందోళనతో గడపడం అలవాటయిపోవడమే దీనికి మూలం. ఈ వ్యాకులచిత్తం సహజమైన ఆనంద సందర్భాల్ని సానుకూలంగా స్వీకరించలేని విపరీత మనస్తత్వానికి దారితీస్తుంది. మంచిలో కూడా చెడును చూసే ధోరణి పెరుగుతుంటుంది.

### ఉద్వేగాలపరంగా...

ఆనందంగా ఉండేవారిలో సానుకూల ధోరణి ఎక్కువ. ప్రతికూల పరిస్థితులలోనూ సానుకూలంగా వ్యవహరిస్తారు. మానసిక దృఢత్వం గలవారిలో వివేచన ఎక్కువ. అందుకని సంయమనంతో వ్యవహరి

స్తారు. ఉద్రేకాలకు లొంగిపోరు. ఎవరో రెచ్చగొడితే అంత త్వరగా రెచ్చిపోరు. అనుకోని సమస్యలు తటస్థించినా కుంగిపోరు. తెలివిగా నడుచుకుంటారు.

ఉద్వేగాల పట్ల ప్రతికూలంగా స్పందించేవారు సంతోషంగా ఉండలేరు. నింపాదితనం కొరవడుతుంది. దీనితో ఆందోళన చెందుతూ అధిక రక్తపోటు, గుండె జబ్బుల వంటి సమస్యల బారిన పడతారు. సామాజికంగా, కుటుంబపరంగా, వృత్తిపరంగా ప్రతి అంశాన్ని ప్రతికూలంగా చూసే దృష్టికోణం వల్ల సంతోషంగా, సౌఖ్యంగా ఉండలేరు. ఒక ప్రశంసని కూడా మన స్ఫూర్తిగా స్వీకరించలేరు.

## అంతులేని సంతృప్తి

డబ్బే సర్వస్వం కాదు. అనుకోకుండా కోటి రూపాయలు వచ్చినా ఆనందంగా ఉండలేరు. కానీ దైనందిన జీవితంలో చిన్నచిన్న మార్పులు చేసుకుంటే జీవితం నవనవోన్మేషంగా ఉంటుంది. జీవనశైలిలో ఎప్పటికప్పుడు కొత్తదనం కోసం ప్రయత్నించాలి. ఒక్కోసారి చిన్న చిన్న విషయాలు కూడా వ్యక్తిగత జీవితంలో ఆనంద తరంగాలుగా మారతాయి. అవే మానసిక చైతన్యానికి నిలువెత్తు నిదర్శనాలుగా ఉంటాయి. అవి ఉత్తరాలు రాయడం, మీకిష్టమైన సంగీతం నేర్చుకోవడం ఏదయినా కావచ్చు. కానీ అవే మీకు జీవితంలో అంతులేని సంతృప్తిని, జీవితానందాన్ని కలిగిస్తాయి. మీలో ఆనందాన్ని రెట్టింపు చేసి ఆనందంగా ఉండటం అలవాటు చేస్తాయి.

## సహాయపడటంలోనూ....

ఇతరులకు తోడ్పాటు అందించడంలోనూ ఆనందం ఉంటుంది. రోడ్డు దాటడానికి అవస్థపడే పెద్దవాళ్ళను భద్రంగా రోడ్డు దాటించండి. మీ పొరుగింట్లో అనారోగ్యంతో బాధపడేవారి దగ్గరకి వెళ్ళి పరామర్శించి డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళండి. చిన్న చిన్న సహాయాలు చేసేవారికి కూడా థాంక్స్ చెప్పడం అలవరుచుకోండి. ఇవన్నీ మీలో సానుకూల శక్తిని పెంపొందిస్తాయి. ఇతరుల కోసం కొంత సమయాన్ని వెచ్చించామన్న ఆత్మ సంతృప్తి, నా చుట్టూ నా మనుషులు ఇంతమంది ఉన్నారన్న ధైర్యం లభిస్తుంది. మనసు ఊరట చెంది ఆనందానికి నిలయమవుతుంది. ఇలాంటి చిన్నచిన్న ఆనందాలు, మనః సంతృప్తి, సంఘటనలే ఆనందకరమైన జీవన విధానానికి ఆదరవుగా నిలుస్తాయని ప్రముఖ రచయిత్రి ఎలిజబెత్ గిల్బర్ట్ అంటారు.

## సంతోషం సగం బలం

మానసిక బలం గలవారు త్వరగా కుంగిపోరు. తమ జీవనశైలిని పకడ్బందీగా మలచుకుంటారు. వయసు మీదపడుతున్నా అనుభవాలు అందించే గుణపాఠాల వల్ల సానుకూలంగా స్పందిస్తారు. పెరుగుతున్న వయసుకు అనుగుణంగా జీవనశైలిని మార్చుకుంటారు. ఆనందంగా ఉండటం అలవడితే శారీరకమైన రుగ్మతల్ని అధిగమించేలా వ్యాయామానికి ప్రాధాన్యం ఇస్తారు. వయసు పెరుగుతుందని కదలక మెదలక ముసుగు తన్ని పడుకునే వారికన్నా త్వరగా లేచి నాలుగడుగులు వేస్తూ నడిచేవారిలో వయసుతో వచ్చే సమస్యలు తగ్గుముఖం పడతాయి. ఆరోగ్యంగా ఉంటారు. ఆనందంగా గడుపుతారు.

## మానసిక స్వేచ్ఛతోనే ఆనందం

ఎవరి జీవితానికి వారే బాధ్యులు. తమ ఆనందాలకీ, విషాదాలకీ తమదే బాధ్యత అని తెలుసుకోగలగాలి. హాయిగా ఆనందంగా ఉండటానికి వేరే వారిమీదనో, పరిస్థితుల మీదనో ఆధారపడకూడదు. హాయిగా ఉండగలగడం ఎలాగో తెలుసుకోవాలి. అప్పుడే ఆత్మగౌరవంతో, స్థిరచిత్తంతో ఉండటం సాధ్యం. అప్పుడే తమ జీవితానికి సంబంధించిన నిర్ణయాల్ని తామే తీసుకోగలరు. వేరొకరి నిర్ణయాలకు తలొగ్గితే బతుకంతా బాధపడాల్సి వస్తుంది. ఆ తలొగ్గడానికి అంతూపొంతూ ఉండదు. కనుక తమ ఆలోచనలకీ, ఆచరణకీ తమదే బాధ్యత అనుకోవాలి. అప్పుడే మానసికంగా స్వేచ్ఛగా ప్రవర్తించగలుగుతారు. తద్వారా జీవితాన్ని తమ ఇచ్ఛకు అనువుగా మలచుకోగలరు. ఆనందంగా, హాయిగా ఉండాలంటే ఈ స్వేచ్ఛ తప్పనిసరి.

## హాయిగా ఉండడం ఒక కళ

మనకు ఏం కావాలో మనకు తెలిసివుంటే హాయిగా ఉండడం తెలుస్తుంది. కానీ సమాజం, తల్లిదండ్రులు, కుటుంబసభ్యులు మనుషుల మీద ఒత్తిడి పెంచుతారు. వారికి అవసరమైన నమూనాలు వారిమీద రుద్దుతారు. వారి ఇష్టాయిష్టాల్ని గమనించకుండా వారు ఏం కావాలో చెబుతుంటారు. వారు తమవైన ఇష్టాలు తెలుసుకునేలోపే ఇరవై, పాతికేళ్ళు గడిచిపోతాయి. ఆ తర్వాత డబ్బు సంపాదనే ధ్యేయమన్నట్టుగా మాట్లాడతారు. కనుక తమ ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా ఎంత ఎక్కువ సంపాదిస్తే అంత గొప్ప అన్నట్టు వ్యవహరిస్తుంటారు. సంపాదన కోసం పరుగులు పెడుతుంటారు. ఈ క్రమాన హాయిగా ఉండడమే మరిచిపోతారు. యాంత్రికంగా రోజులు గడిపేస్తుంటారు. జీవితంలో ఇంతకన్నా దైన్యం ఉండదు. కనుకనే తాము హాయిగా, ఆనందంగా ఉండడం ఎలా సాధ్యమో తమకు తాముగా తెలుసుకోవాలి. జరిగిన పొరబాట్లనుంచి గుణపాఠాలు నేర్చుకుని హాయిగా ఆనందంగా జీవించడం అలవరుచుకోవాలి. హాయిగా ఉండడం కన్నా మించింది బతుకులో ఏమీ లేదు. తమ ఆనందం, సంతోషం, సుఖం, సౌఖ్యం వేటివల్ల లభిస్తాయో గ్రహించాలి. ఈ ఎరుక ఉండగానే సరిపోదు. సాధనతో హాయిగా ఉండే కళని అభ్యసించాలి. అప్పుడే మనిషి తన జీవిత ప్రయాణాన్ని తృప్తికరంగా సంతోషమయంగా సాగిస్తాడు.

—లక్ష్మీనర్మద

## యద్భావం తద్భవతి



మన మనసులో మంచిభావం ఉన్నప్పుడు తెలిసిన వ్యక్తి ఎవరైనా ఎదురయ్యారనుకోండి, వారితో ప్రేమతో, ఆప్యాయతతో మాట్లాడుతాం. అలాకాకుండా ఎదుటి వ్యక్తిపై ద్వేషభావం ఉన్నప్పుడు వాళ్ళకు దూరంగా వెళ్ళిపోవడం గానీ దూషించడం గానీ చేస్తాం. మన భావాన్ని బట్టి అక్కడ ఉన్న స్థితి మారిపోతుంది. అందుచేత ఎప్పుడూ కూడా సద్భావనతో ఉండాలి. ఎవరు ఏ భావంతో ఉంటే ఆ భావంతోనే ఎదుటివారు కనిపిస్తారు.

ఒకసారి శ్రీకృష్ణుడు దుర్యోధనుడితో "నీ రాజ్యంలో మంచివాళ్ళెవరైనా ఉంటే వెంటనే తీసుకొచ్చి నా ముందుంచు, నీకు నేను అమూల్యమైన వరాలనిస్తాను" అన్నాడట. దుర్యోధనుడు సాయంత్రం వరకు వెతికి వెతికి ఒక్కరు కూడా మంచివాళ్ళు కనిపించక నిరాశతో వెనుదిరిగి కృష్ణుని వద్దకొచ్చి "రోజంతా వెతికినా ఒక్కరంటే ఒక్కరు కూడా మంచివాళ్ళు కనిపించలేదు" అంటూ పెదవి విరుస్తాడు. కృష్ణుడు ధర్మరాజును పిలిచి, నీ రాజ్యంలో చెడ్డవాళ్ళెవరైనా ఉంటే వారిని వెంటనే నాముందుకు తీసుకునిరా, నీకు వరాలిస్తాను" అన్నాడు.

ధర్మరాజు సాయంత్రం వరకు వెదికి వెదికి తన రాజ్యంలో ఒక్క చెడ్డవాడు కూడా లేడన్న సంతృప్తితో కృష్ణుని వద్దకెళ్ళి, చేతులు కట్టుకుని "బావా, ఎంత వెదికినా నాకు ఒక్క చెడ్డవాడు కూడా కనిపించలేదు" అన్నాడు. దుర్యోధన ధర్మరాజుల మధ్య ఉన్న వ్యత్యాసం అది. అంటే యద్భావం తద్భవతి అన్నట్టు మనం మంచివాళ్ళమయితే అందరూ మంచివాళ్లలానే కనిపిస్తారు, చెడ్డవాళ్ళమయితే అందరూ చెడుగానే కనిపిస్తారన్నమాట.





# నానమ్మకు ప్రేమతో

పి.వి.శేషారత్నం

**"డాక్టర్‌గారూ! డాక్టర్ కావాలనుకున్న పిల్లాడి శరీరం ఇప్పుడు మీ చేతిలో ఉంది సార్?"**

**మగవాడిని గనుక అంతవరకు లోలోపలే ఏడ్చి ఏడ్చి అంతకంటే ఎక్కువ మాట్లాడలేక పోయిన నా నిస్సహాయతని డాక్టర్‌గారు అర్థం చేసుకున్నట్టున్నారు నా భుజం తట్టారు.**

**'మా ప్రయత్నాలు మేం చేస్తున్నాం. ఆపైన ఆ దేవుడి దయ'**

నా భార్య అరుంధతి ఇంకా గుండెలవిసేలా ఏడుస్తూనే ఉంది.

స్కూలుకు సంబంధించి ఒకరిద్దరు లేడీ టీచర్లు ఆమెను ఓదార్చేందుకు ప్రయత్నిస్తున్నారు.

కానీ ఒక కన్నతల్లి గుండెమంట చల్లార్చే శక్తి ఎవరికుంటుంది?

ఆసుపత్రి బయట విద్యార్థుల నినాదాలు విని పిస్తున్నాయి.

'స్కూలు యాజమాన్యం నిరంకుశత్వం నశించాలి. వశిష్ఠకి న్యాయం జరగాలి'.

ఎందరో మా వశిష్ఠ బ్రతకాలని కోరుకుంటున్నారు. జరిగినదానికి మానవహక్కుల సంఘాల వాళ్ళు వారం రోజులుగా పెద్ద ఊరేగింపులు జరుపుతూనే ఉన్నారు.

అంతేకాదు. మావాడి ఈ దుస్థితికి కారణమైన టీచర్లను స్కూలు ప్రిన్సిపల్‌ను పట్టుకుని ఎవరి ఇన్‌ఫ్లుయన్స్‌కీ లొంగకుండా శిక్షించాలని కలెక్టరాఫీసుముందు, పోలీసుస్టేషను ముందు కూడా ధర్నాలు చేస్తున్నారు.

అయితే అప్పటికే బాగా పండిపోయిన నాకేమీ ఈ వ్యవస్థ మీద నమ్మకం లేదు.

ఎందుకంటే?

నాలుగురోజులు గొడవలు జరిగినా సెన్సేషనల్‌గా ఉన్నా చివరికి ఎలాంటి కేసులైనా డబ్బుతో మూతపడిపోతాయి. న్యాయం జరిగేది ఆ నేరస్థుడి కుల మత ఆర్థిక బలాబలాన్ని బట్టే.

రోజూ పేపర్లలో ఎన్ని చదవడంలేదు? జనం మర్చిపోయేదాకా ఊరుకుని సద్దుమణిగించేస్తున్న ఎన్ని కేసుల గురించి వినడం లేదు. మళ్ళీ శిక్ష పడిందన్న వార్తలెక్కడ... ఏ పేదవాడో అభాగ్యుడో అయితే తప్ప?

డబ్బుకి లోకం దాసోహం.

వశిష్ఠను చూడకుండా ఉండలేక, ఐసియు బయటనుంచి వాణ్ణిచూసి తట్టుకోలేక మా కుటుంబం తల్లడిల్లిపోతోంది.

అసలు నేనేం పాపం చేశానని నాకీ శిక్ష?

ఈనాటి కాంపాక్టు కుటుంబాల్లాగే నాకూ ఒక్కగానొక్క కొడుకు, ఒకే ఒక్క కూతురు. కాలు నేలమీద పెట్టనీయకుండా అల్లారుముద్దుగా పెంచుకుంటున్నాం. వాళ్ళకోసం ప్రాణాలివ్వడానికి కూడా తల్లిదండ్రులుగా మేం ఎప్పుడూ సిద్ధమే.

అసలు వశిష్ఠను, శర్మిష్ఠను ఏణ్ణర్థానికే స్కూల్లో వేసినప్పట్నుంచీ నాకెప్పుడూ గాభరా గాభరా.. గాభరా...

మాకు ఎంతో మంచి స్నేహితులైన డాక్టర్

గారు ఓసారి నన్ను హెచ్చరించారు, 'మీరు దేనికో టెన్షన పడిపోతున్నట్టున్నారు, ముందు అది తగ్గించు కోండి. నీరసం, వికారం, కళ్ళు తిరగడం, గుండెదడ అన్నీ మాయమవుతాయి. లేదా ఒత్తిడి ఎక్కువైతే షుగర్, బీపీ వగైరాలకు దారి తీస్తుంది'

పిల్లలిద్దరూ ఒక్కో క్లాసు దాటుతున్నకొద్దీ నాకు నేను ఎంత సర్ది చెప్పుకున్నా ఏదో ఆలోచన. పిల్లలు ఎంతో కష్టపడి చదువుకుంటున్నారు...ఫలించకపోతే?

నిరాశతో పిల్లలేమవుతారో? వాళ్ళ భవిష్యత్తు ఎలా ఉంటుందో?

అసలు నేను పెట్టేతిండి పిల్లలకు బలాన్నిస్తోందా? ఇస్తోంటే మరి అలా చిక్కిపోతున్నారేం? అడపాదడపా పడకేస్తున్నారేం?

పిల్లలకీ అటు స్కూల్లోను ఇటు ప్రైవేటులోను రెండురకాల హోంవర్కులూ ఎక్కువే. ఎవరి హోంవర్కు చేయకపోయినా పనిష్మెంటిస్తారు. వినేందుకేతప్ప చదివేందుకు టైము ఉండడం లేదు. రోజులు నిమిషాల్లా ఆవిరైపోతున్నాయి. అందుకే కాబోలు ఆమధ్య పేపర్లో ప్రస్తుత విద్యా విధానాన్ని చాలా చక్కగా విశ్లేషించారు ఓ జర్నలిస్ట్.

"గతంలో హైస్కూల్ స్థాయిలోగానీ, ఇంటర్‌లో గానీ టాప్ స్కోరు 75 శాతానికి పరిమితమై ఉండేది. ఇప్పుడు 99.93 శాతానికి చేరింది. అంటే విద్యార్థుల తెలివితేటలు అంతగా పెరిగాయా లేక పరీక్ష విధానం మారిందా? కోచింగ్ సెంటర్లు మెరిట్ ఫ్యాక్టరీలుగా తయారయ్యాయి.

మోడల్‌పేపర్లను పదేపదే ప్రాక్టీసు చేయించడం, వారం వారం పరీక్షలూ...వగైరా. అంతెందుకు? హైస్కూల్ స్థాయిలో టాప్‌ర్యాంకర్‌గా వచ్చిన వాడు ఇంటర్‌లో ఆ స్థాయిని కొనసాగించలేకపోతున్నాడు."

ఇలాంటి ప్రతి అభిప్రాయం ముందుగా నాకే పాఠంలా ఉండేది. అందుకే వశిష్ఠ, శర్మిష్ఠ నిరాశ పడకుండా పేపర్లో స్ఫూర్తిదాయకమైన వ్యాసాలు, జీవిత విశేషాలు వాళ్ళకి వివరించేవాణ్ణి.

అన్ని అవయవాలు ఉండీ చదువుకి బద్దకించే పిల్లలున్న ఈకాలంలో, ప్రమాదంలో అరిచేతులు. కాళ్లు నుజ్జయినా మెదడుకు మరింత పదునుపెట్టి స్టేట్ ఫస్ట్ తెచ్చుకున్న ర్యాంకర్లు ఉన్నారు. కటిక పేదరికంలో పుట్టి తినడానికి తిండి, కట్టుకోవడానికి సరైన బట్టా, పుస్తకాలూ లేకపోయినా లైబ్రరీల సాయంతో మాస్టార్ల సహకారంతో ర్యాంకులు సాధించినవారున్నారు. ఉత్తమ విద్యాసంస్కారాలు పొందినవారు, ఉత్తమ కేడర్ సాధించినవారు, అవార్డులు పొందినవారు తాము కోరుకున్న కోర్సును సాధించడానికి ఎలాంటి కఠోరమైన దినచర్య అవలంబించారో, ఎన్ని అవస్థలు పడ్డారో, రోజుకు ఎన్ని గంటలు కష్టపడ్డారో మా పిల్లలిద్దరికీ చదివి వినిపించేవాణ్ణి.

మాపిల్లలకళ్ళు ఆనందంతో ఆశ్చర్యంతో మెరిసేవి. అద్భుతం చూస్తున్న అనుభూతి పొందేవి.

అత్యున్నతస్థానంలో ఉన్న ప్రతిభామూర్తులు కొందరు మేధావులు అయిన దేశనాయకులు చిన్నప్పుడెంతటి కష్టాలనుభవించారో వింటున్నప్పుడు వాళ్ళ కళ్ళల్లో మెచ్చుకోలు కనిపించేది. అలాంటి నా బంగారు తండ్రి ఆత్మహత్యా ప్రయత్నం చేయడమేంటి?

నా బంగారుతల్లి శర్మిష్ఠ ఒళ్ళూ కళ్ళూ వాచిపోయేలా అన్నయ్యకోసం అలమటించిపోడమేంటి?

సమయానికి వశిష్ఠ టీచరు శర్వాణి గుర్తించబట్టి స్కూలువాళ్ళు తాత్సారం చేసినా అందరికీ తెలిసిపోయిందన్న భయంతో ఆఖరి నిమిషంలో ఆసుపత్రికి తరలించబట్టి ఇంకా ప్రాణాలతో అయినా నా వశిష్ఠ నాకళ్ళముందు ఉన్నాడు. వాణ్ణి మానసికంగా అంతగా హింసించినవాళ్ళెవరు?

వాళ్ళమీద చర్య తీసుకోకుండా ప్రిన్సిపల్ ఏం చేస్తున్నాడు?

'కోటేశ్వర్రావుగారూ! ఇదిగో ఈ మందులు కావాలన్నారు డాక్టరుగారు. అర్జంటుగా రావాలి'

నా ఆలోచనలు తెగిపోయాయి.

నా చేతిలో మందులచీటీ పెట్టి నర్సు లోపలికి పరిగెత్తింది. నేను మందుల కోసం పరుగెత్తాను. దూరంగా మావాడి స్కూలుటీచరు శర్వాణి భుజం మీద ఓదార్పు పొందుతోంది అరుంధతి. నేను మందులతో వచ్చేసరికి హాస్పిటల్‌లో హడావిడి ఎక్కువగా ఉంది. ఎవరెవరో రాజకీయపెద్దలు, సంఘాల వాళ్ళు వచ్చి మా వశిష్ఠనుచూసి మా ఆవిడను

**చదువు మానిపించారని ఇంట్లోంచి పారిపోయి ప్రయోజకుడయ్యాడతను. కన్నతల్లి నీడ తన పిల్లలపై పడనివ్వలేదు. పిల్లలిద్దర్నీ డాక్టరు, ఇంజనీరు చదివించేందుకు అపారమైన శ్రద్ధ వహించాడు. తాహతుకుమించి ఖర్చు చేశాడు. వర్తమానంలోకి తొంగిచూస్తే, అతని కొడుకిప్పుడు సుదీర్ఘ నిద్రలో ఉన్నాడు. తన కొడుకు ఎప్పుడు లేస్తాడా అని ఆత్రంగా ఎదురుచూస్తున్నాడతను. ఎందుకలా? అసలేంజరిగిందని?**

ఓదార్చి వెళుతున్నారు. వాళ్ళు ఉన్నంతసేపు టీవీల వాళ్ళ హడావిడి కూడా ఎక్కువగానే ఉంటుంది.

నేను కనిపించగానే మీడియా నన్ను చుట్టుముట్టింది.

ఇదంతా నేను కోరుకున్నదే, కానీ ఇలాగా? కానేకాదు.

అసలు నేను ఏం కోరుకున్నాను? ఇక్కడ జరుగుతున్నదేమిటి?

నాకృషి ఫలించి నాపిల్లలు టెన్త్‌లో స్టేట్ ఫస్ట్ వస్తే వాళ్ళని అన్ని టీవీలవాళ్ళు పేపర్లవాళ్ళు ఇంటర్వ్యూలు చేస్తారనీ, 'మా విజయానికి కారణం మా డాడీ' అని వాళ్ళు చెబుతుంటే పల్లెలో ఉన్న నా కన్నతల్లి తలదించుకోవాలని, నేను గర్వంగా భుజాలెగరేయాలని ఆశపడ్డాను.

నాతోటి ఉద్యోగులు నన్ను చుట్టుముట్టేసి అభినందనల వర్షం కురిపించేస్తుంటే వాళ్ళ పిల్లలకు నాచేత అభివృద్ధి పాఠాలు చెప్పిస్తూంటే స్నేహితుల్లో బంధువుల్లో నాకో ప్రత్యేకత ఏర్పడాలని కోరుకున్నది నిజమే.

అలాగే నేను విజయశిఖరాన నిలబడి ఇన్నేళ్ళ కసితో నా కన్నతల్లిని నిలదీయాలని కూడా కోరుకున్నాను.

'చూశావా?' పట్టుబట్టి నా చదువు ఆపేయకుంటే నీకూ ఇలాంటి ప్రశంసలు లభించేవి' అని. మా ఊరంతా వినిపించేలా ఎలుగెత్తి అరవాలనుకున్నాను. కానీ...ఇదేంటి ఇలా జరిగింది? అక్కడ అంతా సద్దుమణిగేసరికి నేను, శర్మిష్ఠ, దమయంతి, టీచరు శర్వాణి మాత్రం మిగిలాం. కాసేపయ్యాక శర్వాణి అటూ ఇటూ ఎవరూ లేకుండా చూసి చటుక్కున నాచేతిలో ఓ పుస్తకం, ఓ కాగితం పెట్టింది.

"కోటేశ్వర్రావుగారూ! ఇది మీ వశిష్ఠ స్కూలు బ్యాగులో దొరికింది. రహస్యంగా మీకు అందించాలనే ఇంతసేపు ఎదురుచూశాను'.

శర్వాణి నాచేతిలోపెట్టిన ఉత్తరంవైపు నిర్వికారంగా చూశాను.

లోపల నా కొడుకు చావుబ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడుతున్నాడు.

అది నా కొడుకు వశిష్ఠ ఆత్మహత్య చేసుకోబోయే ముందు రాసిన ఉత్తరం. దానిని విప్పి చదవ



డానికి నాకు ధైర్యం ఉండదు. అది భయంకరమైన పాములపుట్టలోంచి బయటపడిన విషసర్పం. అది ఏ భయంకర సత్యాల విషాన్ని వెలిగక్కుతుందో? అంతలోనే నాకు ఒక్కసారిగా ఆగ్రహం వచ్చింది.

ఏమిటి ఈ అమ్మాయి ఉద్దేశం? ఇంతసేపూ మీడియా వాళ్ళ ముందు దీనిని బయటపెట్ట కుండా ఇప్పుడు నాచేతికివ్వడంలో ఆంతర్యం ఏమిటి? ఓహో స్కూలు యాజమాన్యం ఈవిడ చేత నాతో రాయబారం చేయించడానికి ఇక్కడ ఉంచి ఉంటుంది.

నా గుప్పిళ్ళు బిగుసుకున్నాయి.

'నా వశిష్ఠ ఈ దుస్థితికి కారణమైనవాళ్ళని మాత్రం బతకనివ్వను. ఎంత ఖర్చైనా అప్పులు చేసైనా ఇల్లు అమ్మేసి అయినా పోరాడతానుగానీ శిక్షార్హులను వదిలిపెట్టను. వాళ్ళకి ధనబలం, అధి కారబలం ఉంటే నాకు జనబలం ఉంది.

'ముందు ఉత్తరం చదవండి కోటేశ్వర్రావు గారూ" శర్వాణి కళ్ళు దయను వర్షిస్తున్నాయి. కాని తీక్షణంగా కూడా ఉన్నాయి

నా చేతులు వణికిపోతోంటే వశిష్ఠ ఉత్తరం చదివి అక్కడే నేను కుప్పకూలిపోయాను. ఎందు కంటే దానిని నేను జీర్ణించుకోలేకపోతున్నాను



పదవతరగతి పూర్తికాకుండానే చదువు ఆపేసి స్వయంశక్తితో ఎదిగిన నాకు చదవంటే ఎప్పుడూ ఓ ఆకాశహర్మ్యం. అందని ఓ ద్రాక్షపండే. మధ్యలోనే మెలకువ వచ్చేసిన సుందరస్వ ప్నమే. చదువంటే నాకు అంతు లేని దాహం. ఆ దాహం తీర్చగ లిగే బంగారంలాంటి చెరువు దగ్గర గానే ఉన్నప్పటికీ కూడా నన్ను చదువుకోనీయలేదని అమ్మపై నాకు కోపం. నా చదువాగిపోయిన మర్నాడే నా కన్నతల్లిని వదిలేసి ఆ కోపంతోనే ఊళ్ళు పట్టి పోయాను. నేను జీవితంలో సెటిల య్యాక కాకతాళీయంగా బజారులో ఎదురుపడిన మా ఊరు వాళ్ళు నాకు కసాయి కొడుకు అని పేరు పెట్టారు. అయినా నాకు బాధ కలగలేదు. నాన్నకు జబ్బు చేసినప్పుడు కూడా నేను మా ఊరు వెళ్ళ లేదు. నా కలల్ని కాలరా సిన వాళ్ళను నేనెందుకు పట్టించుకోవాలి?

అయినాగానీ ఆ ఊళ్ళో కూడా నాకు గుర్తు తెచ్చుకోవాల్సిన మధురస్వప్నాలేమీ లేవు. నాకోసం ఏడుస్తూ కబురం పిన నా తల్లిదండ్రులకు మధ్యవర్తులద్వారానే నేను అదే విషయం స్పష్టం చేశాను.

ఆఖరికి నాకు తగిన అమ్మాయిని నేనే వెతు క్కుని నా పెళ్ళి కూడా నేనే చేసుకున్నాను. తొలి నాడే నాకలలేమిటో అరుంధతికి వివరించాను.

ఆనాటినుండీ మేం ఏంతిన్నామో ఎలాంటి బ్రతుకు బ్రతికామో తెలియకుండానే మా ఇద్దరు పిల్లల్నీ చదువుల సరస్వతులను చేసేందుకే జీవి తాన్ని ధారపోస్తున్నాం. మా వశిష్ఠ పెన్సిల్ కావా లంటే నేను కలర్ పెన్సిల్స్ కూడా కొనిచ్చాను. శర్మిష్ఠ ఒక్క స్కూలు డ్రెస్సు చాలు డాడీ అంటే నేను వినకుండా నాలుగు డ్రెస్సులు కొనేవాణ్ణి.

మేం తినడంకోసం కంటే వాళ్ళిద్దరి చదువు కోసం పెట్టిన ఖర్చు నా తాహతుకు మించినదే అయినా నేను ఎన్నడూ బాధపడలేదు.

ఐదవతరగతి పరీక్షలు అవగానే వశిష్ఠ మొహం వెలిగిపోతోంటే ఒక్కటే కోరాడు, "ఫుట్‌బాల్ కోర్సుకు వెళ్తానుడాడీ! నాఫ్రెండ్స్ అంతా నేనెంతో బాగా ఆడుతున్నానన్నారు "ఈ సెలవుల్లో ప్రాక్టీసు చేస్తుంటే త్వరలోనే పెద్ద ప్లేయర్ అయి పోతాను"

ఆరోజు వాణ్ణి మొట్టమొదటిసారిగా చెంప మీద కొట్టాను.

'వశిష్ఠా ఈదెబ్బ మరెప్పుడూ కొట్టే పరిస్థితి తెచ్చుకోవద్దు. ఇక మీదట నీకు ఏకైక లక్ష్యం డాక్టరు కావడమే'!

నామీద గౌరవం వాణ్ణి నోరెత్తనివ్వలేదు. కాని గ్రుడ్లలో నీళ్ళు కుక్కున్నాడు. వాణ్ణి చూసి నా కూతురు శర్మిష్ఠకు తను అడగాలనుకున్న మాట కూడా నోట్లోనే ఉండిపోయినట్టుంది. అయినా నేను బాధ పడలేదు. నాకు కావలసింది నా పిల్లల చ దువు మాత్రమే, నాకొడుకు డాక్టరు, నా కూతురు ఇంజనీరు కావాల్సిందే.

అంతవరకు వాళ్ళ దృష్టి ఆటలవైపుగానీ వినో దాలవైపుగానీ మళ్ళడానికి వీల్లేదు.

అందుకు నేను రాత్రింబవళ్లు ఇంకా ఇంకా కష్టపడతాను.

మా అరుంధతికి టీవీ అంటే ప్రాణం. కానీ పిల్లలు ఆరవతరగతిలోకి ప్రవేశించే ముందే టీవీని అమ్మేశాను.

అరుంధతి చిన్న నిట్టూర్పు కూడా విడవలేదు.

తాహతుకు మించినదే అయినా డొనేషను

## కొత్తగా కనిపిస్తుందట!

ఈ మాట చెబుతోంది మిల్కీ బ్యూటీ తమన్నా. అయితే ఈ అవకాశం టాలీవుడ్ ప్రేక్షకులకు కాదు. కేవలం కోలీవుడ్ తంబీలకు మాత్రమే! టాలీవుడ్‌ని ఏలినన్ని రోజులూ ఏలేసి ఇప్పుడు కోలీవుడ్‌కి టర్న్ అయింది తమన్నా. అక్కడ వరుసగా రెండు మూడు సినిమాలకు సైన్ చేసింది కూడా! విక్రమ్ సరసన చేస్తున్న సినిమాలో తను కొత్తగా కనిపిస్తానని చెబుతోంది తమన్నా. కొత్త తమన్నాను చూస్తారని అంటోందే తప్ప ఎలా ఉండబోతోంది? అన్న విషయంలో మాత్రం స్పష్టత ఇవ్వడంలేదు.

## షారూఖ్‌కి నో చెప్పిన ఆలియా!

***బాలీవుడ్‌***లో *ఆలియాభట్‌కి మంచి ఆదరణే ఉంది. తండ్రి బ్యాక్‌గ్రౌండ్‌ని ఏ మాత్రం ఉపయోగించుకోకుండా స్టార్ హీరోయిన్ రేంజ్‌కి ఎదిగిన నటిగా ఆమె గురించి అందరూ చెప్పుకుంటారు. ఇంత మంచి పేరున్న ఆలియా ఒక్కసారిగా చెడ్డదానిగా మారిపోయింది. అందరి దృష్టిలో పొగరుమోతుగా ముద్ర పడిపోయింది. దానికి కారణం ఉంది. షారూఖ్ సినిమాలో ఆలియాకు అవకాశం వచ్చింది. మామూలుగా అయితే అంత మంచి అవకాశం వస్తే మరో హీరోయిన్ అయితే ఎగిరి గంతేసి ఒప్పుకునేది. కానీ ఆలియా మాత్రం సింపుల్‌గా డేట్లు లేవని ఆ సినిమా చేయనని చెప్పేసిందట! ప్రస్తుతానికి అయితే ఆలియా చేతిలో పెద్దగా సినిమాలేవీ లేవు. కానీ ఎందుకు నో చెప్పిందో ఎవరికీ అర్థం కావడం లేదట! బహుశా షారూఖ్ లాంటి సీనియర్‌తో చేయడం ఇష్టం లేకనే ఆ సినిమాకి డేట్లు లేవంటూ కహానీలు వినిపిస్తోందని అంటున్నారు.*



కట్టి మరీ పిల్లలిద్దరినీ కార్పొరేట్ స్కూల్లో చేర్పించాను.

వాళ్ళ జనరల్ నాలెడ్జి కోసం లైబ్రరీఫీజు కట్టాను. వార్తాపత్రికలు తెప్పించాను. వాళ్ళు ఒక్క పుస్తకం అడిగితే ఎంత ఖరీదైనా సరే రెఫరెన్సు పుస్తకాలు కూడా కొన్నాను. ఒకసారి నా కూతురు నోటు పుస్తకంలో నానమ్మ ఒడిమీద రాసిన కవిత చూసి కోపంతో చెలరేగిపోయేసరికి అది బెదిరిపోయింది. అరుంధతి అడ్డుకోకపోతే ఆడపిల్ల అని కూడా చూసేవాణ్ణి కాదేమో! అదేరోజున అసలు దానికి నానమ్మ ఉందని చెప్పిన అరుంధతికి కూడా రెండు తగిలాయి నాచేత్తో.

మళ్ళీ ఎప్పుడూ శర్మిష్ఠ అటువంటి పిచ్చి పనులు చెయ్యలేదు.

ఇద్దరూ స్కూలునుంచి రాగానే పెట్టింది తినడం, చదువుకోవడం, ప్రైవేటుకి వెళ్ళడం, రాత్రి భోజనం తర్వాత చదువుకోవడం, పడుకోవడం మళ్ళీ తెల్లవారుజామున లేచి చదువుకోవడం..

రాత్రి డ్యూటీలు చేసి నేను అలసిపోయినాసరే నేను కూడా వాళ్ళతోపాటే తెల్లారుజామున లేచి వాళ్ళ పక్కనే కూర్చునేవాణ్ణి.

వాళ్ళకు జాలేసి 'డాడీ మేం చదువుకుంటాం గానీ డబుల్ డ్యూటీ కూడా చేసి వచ్చారు కదా పడుకోండి. ఆరోగ్యం పాడవుతుంది' అనేవారు.

'పరవాలేదమ్మా! అన్నయ్య డాక్టరవుతాడుగా వాడే చూస్తాడులే. కాకపోయినా ఇంక ఈ శరీర యంత్రం వీక్ అయితే ఇంజనీరువి నువ్వు ఉన్నావుగా బోల్టులు మార్చడానికి' అని నవ్వేవాణ్ణి.

నానవ్వుతో వాళ్ళు నిశ్శబ్దమైపోయేవారు.

నేను మంచి మూడ్‌లో ఉన్నప్పుడు ఒకసారి మాత్రం శర్మిష్ఠ ధైర్యం చేసి అడిగింది, 'డాడీ! మనింట్లో ఒక డాక్టరు ఒక ఇంజనీరు ఉండాలి అంతేగా. అన్నయ్యకి లెక్కలంటే ఇష్టం, నాకు సైన్సు అంటే ప్రాణం, మార్చుకుంటాం డాడీ!'

"అదెలా కుదురుతుంది తల్లీ! ఒకసారి కన్యాకుమారికి రైలు టిక్కెట్టు తీసేశాక కాశ్మీరు వెళ్ళగలమా చెప్పు. ఆడపిల్లవు చక్కగా ఏ కంప్యూటరు ఇంజనీరువో అయితే ముద్దుగా ఉంటుందమ్మా! అన్నయ్య మెడలో స్టెత్ వేసుకుని వెళుతుంటే, పేషెంట్లు దణ్ణాలు పెడుతుంటే, ఆసుపత్రిలో వాడు రౌండ్లు వేస్తూంటే ఎంత దర్జాగా ఉంటుందో ఊహించుకో మరి. ఏం అరుంధతీ నేను చెప్పింది రైటేనా?"

అరుంధతి ఏదో అనబోయి నా ముఖం చూసి ఆగిపోయింది. అది నేను పెద్దగా పట్టించుకోలేదు.

"అబ్బే ఎంతైనా నువ్వు నువ్వే డాడీ!" అని తేలికగ నవ్వేసింది శర్మిష్ఠ.

అప్పటి నుంచి ఇద్దరికీ సైన్సులోనూ లెక్కల్లోనూ ఇంకో గంట ట్యూషను పొడిగించాను

ఇద్దరూ నైన్త్, టెన్త్‌లోకి వచ్చారు.

ఆ సెలవుల్లో అరుంధతి చేత టైమ్ ప్రకారం వాళ్ళకి మరింత పోషకాలతో కూడిన వంటకాలు చేయించాను, బీరువాల నిండా బిస్కెట్లు, ఫ్రిజ్‌లో పండ్లకు కొదవేలేదు. ఇద్దరూ కాస్త ఒళ్ళు చేశారు కూడా.

నేను అదేమాట అంటే అరుంధతి 'నా బిడ్డలకు మీ దిష్టే తగిలేలా ఉంది సుమండీ!' అంది.

నా ఎదుటే ఇద్దరికీ దిష్టి తీస్తుంటే "తల్లి దృష్టి భూదేవి దృష్టి తగలకూడదుగానీ తండ్రి దిష్టి అనలేదుగా మన పెద్దవాళ్ళు?" అన్నాను. అంతా మనసారా నవ్వుకున్నాం.

నా ధోరణి, నా మనసు నా పిల్లలకు బాగానే అర్థమైపోయింది.

ఆ ఏడాది వశిష్ఠను హాస్టల్‌లో వేసేశాను. వచ్చే ఏడాది శర్మిష్ఠను వేస్తాను. ఎంత కాదనుకున్నా వయసు వస్తోంది కదా వాళ్ళకి ఇంట్లో ఉంటే దృష్టి మళ్ళించే ఆటంకాలు ఎన్నో ఎదురై చదువు కుంటుపడొచ్చు.

మళ్ళీ అరుంధతి కళ్ళల్లో ఏదో బాధ అయినా నోరు విప్పలేదు.

'కోటేశ్వర్రావుగారూ, ఒక తండ్రిగా మీ పిల్లల కోసం మీరు ఎంతో చేశారని అనుకోవచ్చు'.

ఆ నిశీధిలో ఆస్పత్రి ఆవరణలోని చెట్టుకింది బెంచీలమీద కూర్చున్న మేమంతా నీడల్లా ఉన్నాం.

శర్వాణి కంఠం మృదువుగా వినిపిస్తోంది.

"బ్రతుకు తెరువుకోసం ఈ కార్పొరేట్ స్కూల్లో మనసు చంపుకుని పనిచేస్తున్న నేను నిజానికి మానసిక శాస్త్రం చదువుకున్నాను రావుగారూ! మీ తల్లిదండ్రులు పిల్లల్ని ఏ సాఫ్ట్‌వేర్ ఇంజనీరో, డాక్టరో కావాలని కోరుకున్నారుతప్ప, కవి కావాలనో, సత్యాన్వేషి కావాలనో అగాధ జీవిత రహస్యాలను అన్వేషించే తపశ్శాలి కావాలనో కోరుకోవడం లేదు. ఇంకా చెప్పాలంటే మీరు మీ జీవితంలో ఏ భౌతిక విజయాలు సాధించలేకపోయారో ఆ విజయాల్ని మీ పిల్లలు సాధించాలని కోరుకుంటున్నారు. తల్లిదండ్రులుగా ఆ ఆకాంక్షలు ఎంత మూర్ఖంగా ఉన్నా తప్పుపట్టలేకపోయారు. మీ సామాజిక పాత్రలో సంఘానికి ఇస్తున్నదేమిటి? మీ పిల్లల విషయంలో తల్లిదండ్రులు వ్యక్తులు

గానే గాక సంఘంగా కూడా బాధ్యతారహితంగా వ్యవహరిస్తున్నారని ఆలోచిస్తే మీకే అర్థమవుతుంది.

తల్లిదండ్రులెంత ఆరాటపడినా, ఎంతడబ్బు గుప్పించినా, ఎంత శిక్షణ ఇచ్చినా అది ఇరవైశాతం మాత్రమే పనిచేస్తుంది. సహజంగా పిల్లల్లో ఉండే తెలివితేటలు, చుట్టూ వాతావరణం, వాళ్ళ ఆసక్తి ఆ తర్వాత కృషి మరికొంత శాతం మార్కులు తెస్తాయి. ఇది గుర్తించని మీలాంటి తల్లిదండ్రులు, అన్ని సదుపాయాలూ ఉన్న ఫలానా పెద్దస్కూల్లో వేస్తే నూటికి నూరు శాతం మార్కులు వచ్చేస్తాయని భ్రమపడతారు.

ప్రస్తుత విద్యార్థి ఇటు తల్లిదండ్రులకు అటు విద్యాసంస్థలకు ఇంకోవైపు ఉపాధ్యాయులకు అందరికీ లక్ష్యం అయిపోయాడు.

అంతేతప్ప విద్యార్థికి 'తన ఇష్టం', 'అభిరుచి' అనే పదాలకు ప్రాధాన్యం లేకుండా పోయింది.

వశిష్ఠను నేను చాలా దగ్గరగా పరిశీలించాను.

మీవాడికి సైన్సు అంటే అస్సలు ఇష్టం లేదు. కేవలం మీకోసమే మీ భయంతోనే చదువుతున్నాడు. ఇష్టంలేనిదెప్పుడూ కష్టమే. మరోవైపు కార్పొరేట్‌వాళ్ళకు సంస్థ రేటింగులతోనే తప్ప విద్యార్థుల మనసులతో పనిలేదు. ఎంట్రన్స్ పాసవ్వాలంటే కఠిన నియమాలు పాటించాల్సిందే. క్షణంకూడా బుర్ర ఎత్తడానికి వీల్లేదు. సమయం వృథా చేస్తే అవమానకరమైన మాటలతో కుళ్లబొడిచేస్తారు. వాళ్ళకు కావలసిందల్లా ఎక్కువమంది సెలక్ట్ కావడం, డబ్బు, కీర్తి...

అందుకే వశిష్ఠ బాగా నలిగిపోయాడు.

ముందుకెళ్ళడానికి అవకాశం లేదు. వెనక్కి వెళ్తే మీరు?

వాడికి ఎక్కడా ఓదార్పు దొరకలేదు. ఓదార్పు దొరికే నానమ్మ దగ్గరకు మీరు వెళ్ళనివ్వలేదు"

శర్వాణి ఊపిరి తీసుకునేందుకు ఒక్కక్షణం ఆగింది.

ఆమె మాటల్లో మా అమ్మ ప్రస్తావనకు నేను ఉలికిపడ్డాను.

"అవును రావుగారూ! మీకు తెలుసో తెలియదో గానీ వశిష్ఠకి చిన్నప్పటినుంచీ నానమ్మంటే ఎంత ఇష్టమో వాడి పుస్తకంలో రాసుకున్నాడు. మీ బాల్యంలో మీ అన్నయ్య దూరపు ఊళ్ళో చదువుతున్నప్పుడు ఫుట్‌బాల్ ఆడుతూ బలంగా తలకి దెబ్బతగిలి చనిపోయిన కారణంగానే మిమ్మల్ని కూడా చదువు పేరుతో పోగొట్టుకోలేక మీ అమ్మగారు అంటే తన నానమ్మ మిమ్మల్ని చదివించలేదు తప్ప మీ మీద ప్రేమలేక కాదని ఆవిడ ఏడుస్తూ చెప్పిన విషయాలు కూడా రాసుకున్నాడు. మీ భయంతో మీరు ఇంట్లో లేనప్పుడు మీ అమ్మగారు చాటుగా వచ్చి మనవల్ని చూసివెళ్ళేవారని ఆవిడంటే మీకు కోపమని ఎంత కుమిలిపోయాడో ఇదిగో తన డైరీ చదివితే మీకే అర్థమవుతుంది. అన్ని విధాలా నిస్సహాయులైపోయిన వశిష్ఠవంటి కుర్రాళ్ళు అనుకున్నది దొరక్కపోతే చావే దిక్కనే భ్రమలో పడిపోతారు. ఎక్కడా సరైన కౌన్సెలింగ్ ఇచ్చేవారు లేకపోవడం, ఓదార్పు, ధైర్యం చెప్పే వాళ్ళు కరువవడం 'తీవ్రమైన ఒత్తిడి...ఇలా ఆత్మహత్యను ప్రేరేపించే కారణాలు ఎన్నో. నిజంగా ఒక తండ్రిగా మీరు మీ పిల్లల్ని ప్రేమిస్తున్నారా లేక మిమ్మల్ని మీరే ప్రేమించుకుంటున్నారా?

మమకారం వేరు ప్రేమించడం వేరు. మీ పిల్లల్ని 'మీ నమూనాలు'గా తీర్చిదిద్దడానికి ప్రయత్నించడం అంటే, ఎప్పటికీ దాన్ని ప్రేమ అనరు.




పిల్లలు మానసికంగా స్వేచ్ఛాపరులు కావాలని కోరుకోవడమే నిజమైన ప్రేమ అనిపించుకుంటుంది.

జీవితంలో చదువు అంటే ఏదో ముక్కున పెట్టుకునిపోవడం కానే కాదు. జీవితంలో ఎదురయ్యే కష్టసుఖాలు ఎదుర్కోవడం పదుగురుతో కలిసిపోయేలా మాట్లాడడం..ఇవే బ్రతుకుతెరువుకు ఎంతో ఉపయోగపడతాయి. ఎంతసేపూ మూగగా చదువుకుపోయేవాళ్ళు తమ బాధగానీ, సంతోషంగానీ స్వేచ్ఛగా ఇతరులతో పంచుకోలేకపోతున్నారు.

జీవన విధానంలో ఇదే లోపంగా మారింది. భవిష్యత్తుకు అవరోధమవుతోంది. ఇంక మీ వశిష్ఠ విషయంలో శిక్షార్హులెవరో మీరే నిర్ణయించుకోండి"

ఆ తర్వాత శర్వాణి మమ్మల్ని ఆ నిశీధిలో వదిలి నిష్క్రమించింది.

అరుంధతి ఆ రాతి బెంచీమీద శర్మిష్ఠ ఒడిలో పడుకుని ఏడుస్తూనే ఉంది. దూరంగా తలపై ముసుగు కప్పుకున్న ఓ వృద్ధ స్త్రీమూర్తి అడుగులు తడబడుతుండగా మావైపు నడిచిరావడం గమనించి బావురుమన్నాను. చిన్నప్పుడే పోలియో బారినపడిన మా అమ్మ నడకను ఎన్నేళ్ళ తర్వాతైనా నేను గుర్తించగలను.

నా కొడుకు ఉత్తరం నా మనసును ఊచకోత కోసేస్తుంటే అమ్మ ఒడిలో పడుకుని బావురుమన్నాను.

'ప్రియమైన నానమ్మా!'

నువ్వంటే నాకెంతో ఎంతెంతో ఇష్టం. నీతో ఎన్నో చెప్పుకోవాలని తపించిపోతున్నాను. కానీ..!?

నానమ్మా! ఈ చదువు నావల్ల కావడం లేదు. స్కూల్లో అవమానాలు తట్టుకోలేకపోతున్నాను. డాడీకి నా బాధ అర్థం కాదు. అర్థమైనా అమ్మ ఏంచేయలేదు. అందుకే పోతున్నాను. చచ్చిపోయే ముందు ఒక్కసారి ఎలాగైనా నన్నెంతో లాలించే నీ ఒడిలో తలపెట్టుకుని కరువుతీరా ఏడవాలనుంది నానమ్మా! నాకీ జన్మకి ఆ అదృష్టం ఉందనుకోను.. పాపం చెల్లి!

ప్రేమతో...'వశిష్ఠ'

కాలం పాదరసంలాంటిది పట్టుకునేలోగా జారిపోతుంది

అయితే..

నిన్నమొన్నటి జ్ఞాపకాలు నేడు అనుభవాలు అవుతూ

నేటి అనుభవాలు భవిష్యత్తుకి మార్గాలు వేస్తూ

నిరంతరం తరం తరం అలా సాగిపోతూ ఉంటేనే జీవితాలకి అర్థమూ పరమార్థమూనూ.

ఈ కసురుకోవడాలు. ఓదార్పులు అర్థం చేసుకుని అన్నీ మరిచిపోవడాలు.

ఇది నిరంతరం తరం తరంగా సాగే ప్రవాహం.

ఏతరంలో అయినా పిల్లల కసుర్లలోని అలసటను తల్లీతండ్రీ అర్థం చేసుకోవడం, వారి మనసునెరిగి పిల్లలు ప్రవర్తించడం..ఇదే భారతీయ కుటుంబ సంస్కృతిలోని అపురూప చిత్రం!!

ఈ సత్యాన్ని గ్రహించడానికి నాకు ఒక జీవిత కాలం పట్టింది.

ఈలోగా నాకు తల్లి ప్రేమ, నా పిల్లలకు అందమైన బాల్యం కరిగిపోయాయి. ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకుంటే ఏముంది అక్కడ? నన్ను నిలువునా కాల్చేసే గతం..మా అమ్మను జీవచ్ఛవం చేసిన పరిస్థితులు. నా అరుంధతి పెదాలపై జీవం లేని నవ్వు..రెండేళ్లుగా కోమాలో ఉన్న వశిష్ఠ ఎప్పుడు లేచి తన ప్రియమైన నానమ్మ ఒళ్లో సేద దీరుతాడా అని ఇప్పటికీ, ప్రతిరోజూ వాడి ముఖంలోకి ఆశగా చూస్తూనే ఉన్నాను. ఎందుకంటే ఎదురుదెబ్బలెన్ని తగిలినా మనిషి ఆశాజీవి కదా!?!

**సెల్: 9848218762**

## సరదాగా....

### అలా ఎలా?

అవివేక్ తన భార్యతో ఓ ఫంక్షన్‌కు అటెండై కారులో తిరిగి వస్తున్నాడు.

ఇంకో పదినిమిషాల్లో ఇల్లు చేరతారనగా ట్రాఫిక్ కానిస్టేబుల్ కారు ఆపాడు.

కారు చుట్టూ తిరిగి వచ్చి, మీరు లైట్లు ఎందుకు వేయలేదు? అని అడిగాడు. దానికి అవివేక్ "అసలేం జరిగిందంటే సార్... ఇప్పుడే దార్లో వస్తుంటే బండికి యాక్సిడెంట్ అయింది. లైట్లు పగిలిపోయాయి" అని చెప్పాడు.

సరేకానీ, లైసెన్స్, ఇన్స్యూరెన్స్, పొల్యూషన్ అన్నీ బయటకు తీయమన్నాడు.

"లైసెన్స్ ఇంకా చేయించుకోలేదు సార్. రేప్పొద్దునే డ్రైవింగ్ టెస్ట్ ఉంది. వెళ్ళాలి" అని చెప్పాడు అవివేక్.

దానికా ట్రాఫిక్ కానిస్టేబుల్ లైసెన్స్ లేదు, కారుకి లైట్లు లేవు...యాక్సిడెంట్ అయ్యిందంటున్నావు. కాబట్టి ఇన్ని తప్పులకుగాను ముందు నిన్ను అరెస్ట్ చేస్తున్నాను అన్నాడు.

వెంటనే పక్కనే కూర్చున్న అవివేక్ భార్య "కానిస్టేబుల్ గారూ! ఈయన చెప్పిన మాటలు అస్సలు నమ్మకండి. ఒట్టి అబద్ధాల కోరు. ఎక్కువగా తాగినప్పుడే ఇటువంటి మాటలు మాట్లాడతారు" అంటూ నాలుక్కరుచుకుంది.

### ఒక ప్రశ్న?

ఇంటి బాధ్యతలు, ఉద్యోగ బాధ్యతలతో విసుగెత్తిపోయాడు నితేష్. ఒక్కడే ఎటయినా వెళ్ళిరావాలనుకున్నాడు. ఓ ట్రావెల్ ఏజెన్సీని సంప్రదించి స్విట్జర్లాండ్ వెళ్లాడు. అక్కడి వింతలు విశేషాలు అన్నీ చూశాడు. స్కీయింగ్, ట్రెక్కింగ్ సరదాలన్నీ తీర్చుకున్నాడు. అక్కడి ఫుడ్ రుచి చూశాడు. తనకిష్టమైనట్టుగా తనకిష్టమైనవన్నీ చేశాడు. ఇక ఒకే ఒక్క ప్రదేశం మిగిలిపోయింది. స్విట్జర్లాండ్ రాజధాని నగరమైన బెర్న్‌లో ఓ కాలనీ ఉంది, అది చాలా వింతగా ఉంటుందని గైడ్ చెప్పాడు. దాంతో ఆ కాలనీని ఎప్పుడెప్పుడు చూద్దామా అని ఎదురుచూడసాగాడు. ఆరోజు రానేవచ్చింది. గైడ్‌ని తీసుకుని ఆ కాలనీకి వెళ్ళాడు. కాలనీలో ఉన్న మొదటి భవంతిని చూశాడు. రెండో భవంతిని చూశాడు. అలా వరుసగా చూస్తూ వెళుతున్నాడు. మొత్తం వంద భవనాలున్నాయి. అయితే ఇక్కడ విశేషమేమంటే...ఆ భవనాలకు పేర్లకు బదులుగా నంబర్లు ఉన్నాయి. నం.1, నం.2, నం.3....ఇలా వరుసగా వంద భవనాలకు వంద నంబర్లు. ఒక్కో భవంతి ఒక్కో వినూత్నమైన ఆర్కిటెక్చర్‌తో చూడముచ్చటగా ఉంది. వాటిని చూస్తూ నడుస్తుంటే ఏదో ఊహాలోకంలో విహరిస్తున్నట్టుంది నితేష్‌కి. వరుసగా చూస్తూ వెళుతున్న నితేష్‌కి 62వ భవనం కనిపించలేదు. ఆ తరువాత తెలిసింది ఏమంటే, ఆ భవనం ఒక్కదానికే నంబర్‌కు బదులుగా వేరే పేరు ఉందని! ఆ పేరు కూడా నంబర్ రిలేటెడే అని! మరి ఆ భవనం పేరు పేరు ఏమిటో మీరేమైనా తెలుసుకోగలరేమో ప్రయత్నించి చూడండి.

### సమాధానం

ఒక నిమిషం భవనం! మామూలుగా ఆ భవనానికి 'సిక్స్టీ సెకండ్' అని పేరుండాలి. కానీ సిక్స్టీ సెకండ్స్ అంటే ఒక నిమిషం కాబట్టి ఆ భవనం 'ఒక నిమిషం భవనం' అయింది.

## తీన్ మార్

ప్రతి ఏడాది.. నా పనులతో నీ పుట్టిన రోజు మరచిపోయేవాడిని యిప్పుడు నిజంగానే మతిమరపు వచ్చిందే!! వచ్చే ఏడాది నేనుంటే తప్పకుండా గుర్తెట్టుకుంటాలే!!

ఆని బిల్లు ఎగ్గొడితే పప్పు రుబ్బిస్తారనుకున్నాగానీ.. ఎండాకాలం నీళ్ళు లేవని యిలా ప్లేట్లు క్లీన్ చేయిస్తారనుకోలేదురా!!





# లాకర్ నెం. 369



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

(కొత్త సీరియల్ ప్రారంభం)

**చిమ్మ చీకటి.**

**కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి.**

**నేను తీస్తున్న గాఢమైన శ్వాస, ఉచ్ఛ్వాస నిశ్వాసల ధ్వని రాను రానూ పెరుగుతూ, చెవులు చిల్లులు పడేంత భీకర మైన చప్పుడుగా మారి నాకే వినిపిస్తోంది.**

**మనసంతా ఉద్వేగంగా ఉంది.**

**నా సిక్స్త్ సెన్స్ చెబుతోంది.**

**నేను వేటాడబోయే జంతువు, నా 'ప్రే', నా వలలో చిక్కబోతుందని. అందుకే ఉత్సాహంగా ఉంది. ఒకింత ఆందోళనగా కూడా ఉంది.**



మనం వల పన్నాము.

దానికి మరో గత్యంతరం లేదు.

మృగం, పాశానికి చిక్కాల్సిందే.

కానీ, వలలో పడినప్పుడు దాని కళ్ళల్లో కనిపించే అదో రకమైన విస్మయం... అది భయం కాదు, విభ్రాంతి. దాన్ని చూసి తీరాల్సిందే.

తనంతటి మహావీరుణ్ణి, నక్కజిత్తుల వాణ్ణి గెలిచిన మొనగాడెవ్వడా అని ఆ జంతువు నన్ను చూసినప్పుడు, నా ముఖం మీద చిరునవ్వు మొలకెత్తాల్సిందే.

నా మానసిక పరిస్థితికి తగ్గట్టుగానే, ఎవరో కర్ఫ్యూ విధించినట్టుగా, చీమ చిటుక్కుమన్నా వినిపించేంత, నిశ్శబ్దంగా ఉంది వాతావరణం. చెట్ల ఆకులు కూడా గలగలలాడడం లేదు. గాలి స్తంభించిపోయి, ఏం జరుగుతుందా అని వేయి కళ్ళతో నా వంకే చూస్తున్నట్టుగా అనిపించింది నాకు.

చిమ్మ చీకటిలోనూ నా కళ్ళు తెరుచుకునే ఉన్నాను. ఏం కనబడటం లేదు. అయినా నాకు తెలుసు, ఎక్కడ ఎవరెవరున్నారో? ఏం చేస్తున్నారో? ఎందుకోసం ఉన్నారో? ఎవరికోసం ఉన్నారో? ఎందుకంటే వాళ్ళకు ఆ ఆజ్ఞలు ఇచ్చింది నేనే కాబట్టి.

నేనయితే, గత 96 గంటల్లో కనురెప్ప వాల్చిన క్షణం లేదు. అయినా నా కంటికి కునుకు రావడం లేదు.

వేటగాడి కనురెప్పే వాలితే,

వేటాడి ఏం ప్రయోజనం?

***

'బెంగుళూరు'

ప్రపంచపటాన్ని మార్చగలిగే మోస్ట్ డైనమిక్ పట్టణాల్లో మొదటి స్థానంలో నిలిచిన పట్టణం బెంగుళూరు. పారిస్, లండన్, అమెరికా దేశాలలోని ఏ నగరమూ ఈ పోటీలో బెంగుళూరును తట్టుకుని నిలబడలేదు. ఐదవ స్థానంలో హైదరాబాద్ ఉంది. అందుకే, బెంగుళూరు అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతూ భారతదేశ చైతన్యానికి ఆయువుపట్టు లాంటి నగరంగా రూపుదిద్దుకుంది.

ఎవడో కూసినట్టు, "దక్షిణ భారతదేశ ప్రజలతో 'పాపం' అని సహజీవనం చేస్తున్నామన్న" జాత్యహంకార ధోరణికి ధిక్కార ప్రతీక బెంగుళూరు. దేశం నుండే కాక విదేశాల నుంచి పొట్ట పోసుకోవడానికి ఈ నగరానికి వస్తుంటారు అనేక మంది విద్యావంతులు.

బెంగుళూరు నగరానికి తలమానికం వైట్‌ఫీల్డ్ ప్రాంతం. అందులో ఒక గేటెడ్ కమ్యూనిటీ. అన్నీ ఆకాశాన్ని అందుకునేంత ఎత్తులో ఉన్న హై రైజ్ బిల్డింగులే. ప్రపంచం మునిగిపోతుంది అన్నట్టు పరిగెడుతున్న పట్టణపు రణగొణ ధ్వనులు కూడా అక్కడి సెక్యూరిటీ స్టేషన్ దాటి లోపలికి ప్రవేశించడానికి సంశయిస్తుంటాయి. ప్రాంగణం లోపల కారు హారన్లు నిషిద్ధం.

గాలి కూడా కంట్రోల్డ్‌గా వీస్తుందా అన్నట్టుగా ఉంటుంది. పచ్చని చెట్లు, ల్యాండ్‌స్కేప్ చేసిన గార్డెన్స్, ఫౌంటెన్లు, స్విమ్మింగ్ పూళ్ళు, సౌనా రూములు, జిమ్ములు వంటివి అతి సాధారణ వసతులు. అక్కడి రోడ్ల మీద కార్లు మృదువుగా జారిపోతుంటాయి.

అక్కడి నిశ్శబ్దం కూడా వీనుల విందుగా ఉంటుంది.

ఇక ముప్పై ఆరవ అంతస్తులో నేనున్న ఒకే ఒక డూప్లెక్స్ అపార్ట్‌మెంట్ అయితే, మయుడు ప్రత్యేకంగా రూపొందించిన అభినవ మయసభలా ఉంటుంది.

ఫ్లోర్ టూ సీలింగ్ కిటికీలు చుట్టూ ఉన్న ప్రకృతిలో నేను మమేకమయిన ఫీలింగ్ కలిగిస్తాయి. విశాలమైన బాల్కనీలు, పడక గదులు, ఓపెన్ మాడ్యులార్ వంటగది, హోం థియేటర్, వెల్‌నెస్ రూం, డ్రింక్స్ రూంలతో స్పిక్ అండ్ స్పాన్‌గా అత్యాధునిక ఫర్నీషింగ్స్ తోనూ, ఫర్నీచర్ తోనూ తళతళలాడుతూ ఉంటుంది.

అందుకే, నా బాల్కనీలో నిలబడి చూస్తుంటే, బెంగుళూరు నగరం, నా పాదాక్రాంతమైనట్టుగా అనిపిస్తుంది.

నాకు ఆరోగ్యం పట్ల శ్రద్ధ ఎక్కువ. నేను హైజీనిక్ ఫ్రీక్‌ని. అంటే శరీర శుభ్రత నాకు చాలా ముఖ్యం. నేను డ్రింక్స్ తీసుకోను. ఎవరైనా హై వాల్యూడ్ కస్టమర్లతో డిన్నర్ చేసినప్పుడు, డ్రింక్స్ తీసుకోకపోవడం అమర్యాదగా భావిస్తారని, ఎటికెట్ (Etiquette) మేనేజర్ చెబితే రెడ్ వైన్ సిప్



చేస్తున్నట్టు నటిస్తాను. నో స్మోకింగ్, నో డ్రగ్స్. చాలా ఏళ్ళ నుంచీ కాపాడుకుంటూ వస్తున్న అల వాట్లు అవి.

అందుకే నా శరీరం చెక్కిన గ్రీకు శిల్పంలా ఉంటుంది.

అలా ఉంచడానికి, మెయింటెయిన్ చేయడా నికి, నా బాడీ నుండి, నేను కనీసం రెండు గంటల పాటు చెమటలు కక్కిస్తాను. నా ఫ్లాట్ పైభాగంలో ఉన్న వెల్‌నెస్ రూమ్ దానికి వేదిక.

నా డూప్లెక్స్ ఫ్లాట్‌లో ఇంకో స్పెషల్ పడక గది ఉంది. రెండు విశాలమైన రూములను కలిపి ఒక్క బెడ్ రూముగా మార్చాను. అది మామూలు పడక గది కాదు. అది కామసూత్రాలను పరిశోధించే ప్రయోగ శాల. నేను చాలా కష్టపడి, రీసెర్చ్ చేసి దేశ విదే శాల నుండి తెప్పించుకున్న అనేక వస్తువులు దాంట్లోనే అమర్చాను. ఆ పడక గది, నా కోరికలు తీర్చుకోవడానికి, నేనంటే పడిచచ్చి నా కోసం వచ్చిన వాళ్ళ కోరికలు తీర్చడానికి రూపొందించిన శయన మందిరం. అక్కడికి రావాలని రతీమన్మథులు కూడా ఉవ్విళ్ళూరుతుంటారు.

సమయం ఉదయం ఆరు కావస్తోంది.

నేను అప్పటికే యాపిల్ సెడార్ జ్యూస్ తాగి అరగంట అయింది. అది నా శరీరంలో గత ఇరవై నాలుగు గంటల్లో పేరుకు పోయిన కొవ్వు కణాలే మైనా ఉంటే, వాటిని చీల్చి చెండాడుతుంది. అలా కరిగిన కొవ్వు కణాలను నా వెల్‌నెస్ రూములో, నేను స్వేద రూపంలో బయటకు పంపిస్తాను.

యోగా మ్యాట్ మీద పద్మాసనంలో కూర్చుని 'అనులోమ విలోమ' ప్రాణాయామం చేయడం ప్రారంభించాను. ఈ ప్రాణాయామం వల్ల 'ఇడ, పింగళ నాడులు ఉత్తేజితమై నాడీశుద్ధి జరుగు తుంది.

నేను చేసే ఉద్యోగానికి మెరుపు వేగంతో ఆలో చించే కుశాగ్ర బుద్ధి ఉండాలి. నాకు నాడీశుద్ధి, ఆ శక్తిని ఇస్తుంది.

27 సార్లు ప్రాణాయామం చేస్తే ఒక సెట్టు. ఒక సెట్టుకు సుమారుగా 27 నిమిషాలు పడుతుంది. నేను సాధారణంగా రెండు సెట్లు చేస్తాను. కానీ, రాత్రి పడుకోవడం ఆలస్యమైనందువల్ల, చేయాల్సిన పనులు చాలా ఉండడం వల్ల ఒక్క సెట్టుతో ముగించాను.

నేను కళ్ళు తెరిచేసరికి నా ఎదురుగా నిలబడి నన్నే చూస్తోంది, పద్మిని. 'ఔను, ఆ అమ్మాయి పేరు పద్మినే అనుకుంటా.'

ఒంటి మీద చిన్న టవల్ తప్ప మరేమీ లేదు.

పద్మాసనంలో కూర్చున్న నన్ను చూసి నవ్వి,

"నిన్ను చూసి ఒక్క క్షణం బుద్ధుడివేమోనని అనుకున్నాను" అని కన్నడంలో అన్నది.

నేను నవ్వి ఊరుకున్నాను.

"రాత్రి మనం పడుకునే సరికి ఎంతయింది?"

"రెండు" అన్నాను.

"మరి ఇదేమిటి? ఇంత పొద్దున్నే?" అంది ఆవ లిస్తూ. జారిపోతున్న జుట్టు ముడి సవరించుకోవ డానికి రెండు చేతులు ఎత్తింది. ఆమె మెడలోని సన్నటి గొలుసు మెరుస్తూ ఎక్కడెక్కడికో జారి పోతోంది. టవల్ స్థానభ్రంశం చెందుతోంది. ఆ వగలన్నీ నాకు కరతలామలకమే. కానీ, నాకు నచ్చనివి.

"ఇది ఇంతే!" అన్నాను నేను నిశ్చయంగా.

ఆ సమయంలో నిజంగా నేను బుద్ధుణ్ణే. నా బెడ్ రూము దాటి బయటకు అడుగు పెడితే నన్ను ఏదీ అంత తొందరగా కదిలించలేదు. ప్రపంచ సుందరి వచ్చి నగ్నంగా నా ముందు నిలబడ్డా నేను చలించను. మొండివాణ్ణి. నా దగ్గరకు వచ్చే వాళ్ళందరికీ నా సంగతి తెలుసు. వాళ్ళ సరసాలన్నీ ఆ గది తలుపుల లోపలే. బయట ఇష్టమొచ్చినట్టు, చనువుగా మాట్లాడటం నాకు నచ్చదు. పద్మిని ఆ లిస్టులో కొత్తగా చేరింది. అందుకే అలా చనువుగా మాట్లాడింది.

నేను కటువుగా మాట్లాడేసరికి, ముఖం మాడ్చుకుంది. విసవిసా నడుచుకుంటూ బెడ్ రూములోకి వెళ్ళి తలుపేసుకుంది.

నేను 'తాడాసనం' వేస్తున్న సమయానికి ఫ్రెషప్ అయి నా ముందుకు వచ్చి "వెళ్తున్నాను" అని చెప్పి విసురుగా వెళ్తూ 'కాల్ ద డ్రైవర్ అన్నది.

నేను రిమోట్‌తో ఇంటి ముఖద్వారం తాళం తెరిచాను. పద్మిని నా ఇంటికి రావడం ఇదే ఆఖరు సారి. ఆ తాళం మళ్ళీ ఎప్పటికీ, ఆమె కోసం, తెరు చుకోదు.

****

**సెక్యూరిటీ కన్సల్టెన్సీలో అతడో మిడిల్ మేనేజ్‌మెంట్ అధికారి. కంప్యూటర్స్, లాజిస్టిక్స్, పోలీసింగ్ అతడి ఇష్టమైన సబ్జెక్టులు. కేసు టేకప్ చేస్తే మొదటిరోజే ఫైల్ చివరి పేజీలో సక్సెస్ అని రాసు కోవచ్చు. ఎన్నో వైట్ కాలర్ నేరాలను ఛేదించిన పరిశోధకుడతను. అలాంటిదే మరో మిస్టరీ కేసు అతడి టేబుల్ మీద కొచ్చింది. అసలెవరతను? డిటెక్టివా? పోలీసా? అతడిదగ్గరకొచ్చిన కేసు పూర్వా పరాలు ఏమిటి?**

నేను ఇంకో అరగంట నా వెల్‌నెస్ రూములో గడిపి, సరిగ్గా ఏడింటికి స్నానం చేసి, రెండు ఎగ్ వైట్స్‌తో ఆమ్లెట్ వేసుకుని తిని ఆఫీసుకు బయ ల్దేరాను.

****

బెంగుళూరు నగరానికి శాపమేదైనా ఉందంటే అది 'ట్రాఫిక్' మాత్రమే. ట్రాఫిక్ ఈ నగరానికి, దేశానికి పట్టుకున్న అవినీతి లాంటి, ఒకే ఒక జాడ్యం. ఉదయం ఎనిమిది దాటితే బంపర్ టూ బంపర్ కార్ ట్రాఫిక్. అందుకే, నేను ఉదయం 7.45 కల్లా కిందికి దిగుతాను. పద్మినో, రాగిణో... ఆమె పేరు కూడా సరిగ్గా గుర్తు లేదు నాకు. ఆమెను దించి వచ్చిన డ్రైవర్ బసప్ప సిద్ధంగా ఉన్నాడు.

నేను పని చేస్తున్నది ఒక ఇంటర్నేషనల్ సెక్యూ రిటీ కన్సల్టెన్సీలో. మేం పెద్ద కంపెనీల, అంటే బిలి యన్లలో టర్నోవర్ ఉండే సంస్థల, హైటెక్ సెక్యూరిటీ అరేంజ్‌మెంట్స్ చూస్తుంటాము. మా కంపెనీలో నేను మిడిల్ మేనేజ్‌మెంట్ ర్యాంకులో ఉన్న అధికారిని. బ్యాంకింగ్ నా స్పెషాలిటీ. నాకు కంప్యూటర్స్, లాజి స్టిక్స్, పోలీసింగ్ ఇష్టమైన సబ్జెక్టులు. ఎందుకంటే, ఈ రంగాల్లో నాకు పూర్వానుభవం ఉంది. అందుకే, మా కంపెనీలో నాది చాలా 'కీ' అండ్ కీలకమైన రోల్.

నాది 100% సక్సెస్ రేట్. అంటే వంద శాతమే! 99 శాతం కూడా కాదు. నేను కేసు టేకప్ చేస్తే, మొదటి రోజే, ఆ ఫైలు చివరి పేజీలో 'సక్సెస్' అన్న పదం రాసుకోవచ్చని మా కొలీగ్స్, క్లయింట్లు అంటుం టారు. అందుకే హై ప్రొఫైల్ సెక్యూరిటీ కేసులన్నీ నా కనుసన్నలలోనే పరిష్కరించ బడుతుంటాయి.

ఖచ్చితంగా 8.30 గంటలకు నేను మా ఆఫీసు లోకి అడుగు పెట్టాను.

నేను సీట్లో కూర్చున్నానో లేదో ఇంటర్‌కాం మోగింది. డిస్ప్లేబోర్డులో నెంబర్ వన్ నుండి కాల్ వస్తున్న సూచనగా ఎర్రటి చిన్న బల్బు బ్లింక్ అవు తోంది. అంటే, మా బాస్ ఫోన్ చేస్తున్నాడన్నమాట. ఇంత పొద్దున్నే ఆఫీసుకు వచ్చాడంటే ఏదో సీరి యస్ మాటరేనన్నమాట. 'నేను రావడం సీసీటీవీ కెమెరాల్లో చూసి ఉంటాడు. లేదా నేను నా రూం బయోమెట్రిక్ తాళం తీసిన విషయం ఆయనకు తెలిసిపోయి ఉంటుంది. అందుకే రాగానే పిలి చాడు' అనుకుంటూ ఫోన్ ఎత్తాను. ఫోన్ ఎత్తి



# అటు వెళ్ళను అంటోంది

'బాహుబలి 2' తరువాత ఉత్తరాది వారికి అనుష్కతో సినిమా చేయాలన్న కోరిక మరింతగా పెరిగింది. ఎలాగైనా ఆమెను బాలీవుడ్‌కి తీసుకురావడానికి చాలామంది ప్రయత్నిస్తున్నా అనుష్క మాత్రం ససేమిరా అంటోంది. తనకు నార్త్ కన్నా సౌత్ చాలా సౌకర్యంగా ఉంటుందన్నది ఆమె అభిప్రాయం. ఉత్తరాదిలో ఇప్పుడంతా నాజూకు భామలు రాజ్యం ఏలుతున్నారు. అక్కడికి వెళ్ళి తానేమి చేయాలన్నది అనుష్క ఆలోచనట! ఇప్పటికిప్పుడు సన్నగా నాజూకుగా మారడం అసాధ్యం కనుక ఈ సమయంలో అక్కడ సినిమా చేయడం దండగ అని ఆమె సన్నిహితులు కూడా ఆమెకు సలహా ఇస్తున్నారట! సో....టాలీవుడ్ జేజమ్మ బాలీవుడ్‌కి వెళ్ళే అవకాశమే లేదంటున్నారు.

'గుడ్ మార్నింగ్ రాజీవ్!' అన్నాను.

మాదంతా అమెరికన్ స్టైల్లో పనిచేసే వర్కింగ్ విధానం. బాస్‌ను కూడా పేరు పెట్టే పిలవాలి. "సార్లూ, గార్లూ" పనికిరావు. వెంటనే రమ్మన్నాడు. బాస్, అంటే పెద్దవాడేం కాదు. నాకంటే రెండేళ్ళ సీనియర్.

నేను వెళ్ళేసరికి మా బాస్ సెక్రటరీ, ఆయన రూము తలుపు తెరిచి పట్టుకుంది. నేను లోపలికి అడుగు పెడుతుంటే,

"గ్రీన్ టీ పంపిస్తాను" అంది. నేను తనకు థ్యాంక్స్ చెప్పి, బాస్‌కి షేక్‌హ్యాండ్ ఇచ్చి కూర్చున్నాను.

ఎక్కువగా ఉపోద్ఘాతం లేకుండా, "ఒక గమ్మత్తయిన కేస్!" అన్నాడు.

దానర్థం నాకు తెలుసు. లోకల్ బ్రాంచ్ వాళ్ళు సాల్వ్ చేయలేని, సాధించలేని కేసులన్నింటినీ మాకు రెఫర్ చేస్తారు. ప్రతీ కాంప్లికేటెడ్ కేసు నాకు అంటగట్టేటప్పుడు మా బాస్ ఇదే లైన్‌తో సంభాషణ మొదలు పెడతాడు.

నాకు పెద్దగా ఇబ్బందేం లేదు. 'ఇట్స్ మై జాబ్ అని నేననుకుంటాను.

చెప్పడం మొదలుపెట్టాడు.

"ఒక బ్యాంకులో లూటీ జరిగింది. మేనేజర్, హెడ్ క్యాషియర్ లీవులో ఉన్నప్పుడు, సెకండ్ కీ కూడా కొత్తగా చేరిన క్యాషియర్ దగ్గర ఉన్నప్పుడు, పోయిన శనివారం రాత్రి డకాయిటీ జరిగిందని బ్యాంక్ జోనల్ మేనేజర్ చెప్పాడు. సోమవారం రోజు ఉదయం చుట్టుపక్కల వాళ్ళు బ్యాంకు తలుపులు తీసి ఉండడం చూసి పోలీసులకు ఫోన్ చేశారట. ఇక మిగిలిన వివరాలు ఫైల్లో ఉన్నాయి. క్యాషియర్ గాయబ్. మేనేజర్‌ని సెలవు క్యాన్సిల్ చేసి, పిలిపించి చూస్తే మొత్తం యాభై కోట్ల రూపాయలు, వందకిలోల బంగారం మాయమైనట్టు ప్రాథమిక విచారణలో తేలింది.

వాళ్ళు రెండు మూడు రోజులు ప్రయత్నించారు. కానీ, లాభం లేదు. కొత్తగా చేరిన క్యాషియర్ మీదే అనుమానం. కానీ, అతను దొరకడం లేదు. మన సహాయం కోరారు." అన్నాడు టూకీగా చెబుతూ. చేతిలోని ఫైలు నాకు ఇచ్చాడు. అందులోని వివరాలు చూశాను. ఐదు నిమిషాల్లో ఫైలు తిరగేసి,

"రాజీవ్! చాలా చిన్న కేసు. మనం డీల్ చేయాలా?" అని అడిగాను.

"యస్! యూ ఆర్ కరెక్ట్! కేసు చిన్నదే. కానీ, క్లయింట్ పెద్దవాడు. ఆ బ్యాంకుకు దేశమంతా కలిపి పన్నెండొందల బ్రాంచీలున్నాయి. ఈ బ్యాంక్ మేనేజ్‌మెంట్, ఇంకో పెద్ద బ్యాంకులో మెర్జ్ కావడానికి ప్రయత్నిస్తోంది. ఈ విలీనం సమయంలో ఇదే పెద్ద స్కాండల్ అవుతుం దేమోనని భయపడుతున్నారు. ఆ రెండు బ్యాంకులకు లండన్‌లోని మన హెడ్డాఫీస్‌తో మంచి సంబంధాలున్నాయి. టైం ఈజ్ ఎసెన్స్ ఇక్కడ. ఎప్పటికో రెణ్ణెల్లకు సాల్వ్ అయితే లాభం లేదు. ఈ మెర్జర్ ఆగిపోతుంది. అందుకే మనకు, ముఖ్యంగా, నీకు అప్పగించడం జరుగుతోంది."

నేను తలూపాను.

ఫైల్లో వివరాలున్నాయి కానీ, సెక్యూరిటీ రీజన్ కారణంగా బ్యాంక్ పేరు మెన్షన్ చేయలేదు. అందుకే...

"ఓకే! ఇంతకీ ఏ బ్యాంక్?" అని ప్రశ్నించాను.

రాజీవ్ ఆ బ్యాంక్, బ్రాంచ్ పేరు చెప్పాడు.

అది విని నేను ఫక్కున నవ్వాను.

రాజీవ్ ఆశ్చర్యంగా చూశాడు. అలా నవ్వడం మానర్స్ కాదు. బాస్‌ను పేరు పెట్టి పిలిచినంత మాత్రాన అతనూ, నేనూ సమానం కాదు.

"సారీ బాస్!" అన్నాను.

"ఇట్స్ ఓకే! బట్ వాటీజ్ ద మాటర్?" అన్నాడు.

"రాజీవ్! అది నేను ఇంతకు ముందు పని చేసిన బ్యాంకే! అక్కడ రిజైన్ చేసి, ఇంకోచోట చేరి అక్కడ రిజైన్ చేసి, ఇక్కడ చేరాను. సో ది వరల్డ్ ఈజ్ సో స్మాల్. అందుకే నవ్వొచ్చింది. కాబట్టి, నా పూర్వ బ్యాంక్ పరువు ప్రతిష్టలు కాపాడే బాధ్యత ఇప్పుడు నా మీద ఉందన్నమాట!" అన్నాను.

"వావ్! వాటే గ్రేట్ ట్విస్ట్!" అన్నాడు.

"ఒకసారి ఫైల్ చదువుతా! హైదరాబాద్‌లోని జోనల్ మేనేజర్‌తో మాట్లాడాలి. మీరు వాళ్ళకు చెప్పి పెట్టండి. ఐ విల్ పింగ్ యూ బై ఆఫ్టర్ నూన్!" అని లేచాను.

బయట రూములో కూర్చున్న సెక్రటరీని చూసి "నీ గ్రీన్ టీ రాలేదు" అని బయటకు నడిచాను.

మా ఆఫీసులో అంతా పేపర్‌లెస్! ఈ మెయిల్‌లో నా అబ్జర్వేషన్స్ పంపాలి. దానికి వాళ్ళ ఆమోదం కానీ, రిజెక్షన్ కానీ, ఇంప్రూవ్‌మెంట్స్ కానీ మెయిల్‌లోనే తెలియచేస్తారు.

మాకు మా క్లయింట్లతో వార్షిక మెయింటెనెన్స్ కాంట్రాక్ట్ ఉంటుంది. ఇట్లాంటి స్పెషల్ కేసులకు మాత్రం గంటకు ఇంత అని ఛార్జ్ చేస్తుంటాము. మేము ప్రతీ ఫైల్ మీద వర్క్ చేసిన గంటల వివరాలను తెలుపుతూ, పని మొదలుపెట్టగానే, క్లయింటుకు, మా అకౌంట్స్ డిపార్ట్‌మెంటుకు మెయిల్ పెడుతుంది నా సెక్రటరీ. వాళ్ళు కేసు సాల్వ్ అయ్యాక బిల్ చేసి క్లయింట్ దగ్గర వసూలు చేస్తారు.

నేను కేసు టేకప్ చేస్తే, నా తరఫున కంపెనీ గంటకు మూడు వందల డాలర్లు అంటే భారత రూపాయల్లో దాదాపు ఇరవై వేల రూపాయలు. ఒకరోజుకు సుమారుగా లక్ష నుండి రెండు లక్షల రూపాయల వరకూ ఉంటుంది. దీనికి తోడు కంపెనీ కూడా కొంత ప్రాసెసింగ్ ఫీజు వసూలు చేస్తుంది.

అయాం ఏ కాస్ట్లీ గై, యూ నో!

***

నా ఛాంబర్ కొచ్చి ఫైలు తిరగేయసాగాను. పది నిమిషాలు గడిచాయో లేదో మా బాస్ బజ్ చేశాడు. నేను ఫోనెత్తి 'యస్! రాజీవ్!' అన్నాను. 'ఆ బ్యాంక్ జోనల్ మేనేజర్ లైన్లో ఉన్నాడు. మాట్లాడు. కనెక్ట్ చేయమని వనజకు చెప్పు' అంటూ ఫోన్ పెట్టేశాడు. వనజ మా ఇంటర్నల్ ఎక్స్చేంజ్ బోర్డు నుండి

లైను తీసుకుని నాకు ఫోను కలిపింది.

ఆ జోనల్ మేనేజర్ పది నిమిషాలు నా బుర్ర తిన్నాడు. నేను పదే పదే,

"నాకు కేసు వివరాలు మాత్రం చెప్పండి. లైక్, ఇప్పటి వరకు పోలీసుల పరిశోధనలో ఏం తేలింది? మీ అబ్జర్వేషన్ ఏంటి? మీ క్యాషియర్ జాడ ఏమైనా తెలిసిందా?" అని ఎన్ని సార్లు అడిగినా ఆయన వాటికి సమాధానం చెప్పకుండా, తన గోడూ, హెడ్డాఫీసు తనను గంట గంటకూ ఎలా షంటుతున్నదీ; ఈ కేసు త్వరగా తేలకపోతే తన ప్రమోషన్ ఎలా ఆగిపోతుందో; ప్రమోషన్ ఆగిపోతే తను తన నేటివ్ ప్లేస్ కలకత్తాకు వెళ్ళలేక మరో సంవత్సరం ఇక్కడే, హైదరాబాదులోనే ఉండాల్సి వస్తుందనే తప్ప కేసుకు సంబంధించి నేను నోట్ చేసుకోదగిన ఒక్క పాయింట్ కూడా చెప్పలేదు.

ఇక నేను భరించలేక 'మీ సెక్యూరిటీ మేనేజర్ ఉంటే నాతో డైరెక్టుగా సెల్‌ఫోన్‌లో మాట్లాడమనండి. మా సెక్రటరీ నా డీటెయిల్స్ మీకు మెయిల్ చేస్తుంది. ప్లీజ్ ఆస్క్ హిం టు టాక్ టు మీ!' అంటూ ఫోన్ పెట్టేసి ఊపిరి పీల్చుకున్నాను.

'అంటే నేను ఇంతకు ముందు పనిచేసిన బ్యాంకు ఇంకా ఇట్లాంటి మేనేజర్ల ఆధ్వర్యంలోనే నడుస్తోందన్న మాట' అనుకుని నిట్టూర్చాను.

'అక్కడ యాభై కోట్ల రూపాయలు ప్లస్ వంద కిలోల బంగారం పోయిందన్న బాధ కన్నా ఈ కేసు మూలంగా తన ప్రమోషన్, తన ట్రాన్స్‌ఫర్ ఎక్కడ ఆగిపోతుందోనన్న ఆందోళనే జోనల్ మేనేజరును పట్టి పీడిస్తోంది. ఇట్లాంటి వెన్నెముక లేని, స్పైన్‌లెస్ అధికారుల వల్లే ఈ నాడు మన దేశంలో బ్యాంకులు ఈ దుర్గతికి చేరుకున్నాయి అనుకుంటూ' ఈ కేసులో ఎలా పరిశోధన కొనసాగించాలా అన్న ఆలోచనల్లో మునిగి పోయాను.

హైదరాబాద్‌లో మాకో చిన్న బ్రాంచ్ ఉంది. అక్కడి సీనియర్ ఆఫీసర్‌ను కాంటాక్ట్ చేసి కేసు వివరాలు మెయిల్‌లో తెప్పించమని నా సెక్రటరీకి చెప్పాను.

నా సెక్రటరీ పేరు వనజాక్షి అయ్యంగార్. బెంగుళూరు యూనివర్సిటీ నుండి హాస్పిటాలిటీ మేనేజ్‌మెంట్‌లో యంబీయే చేసింది. వయసు 25. కంప్యూటర్‌లో దిట్ట. మా కంపెనీ మాన్యువల్ ప్రకారం స్టైలిష్‌గా ఉంటుంది. చక్కటి ఉచ్చారణతో ఇంగ్లీషు మాట్లాడుతుంది. నేను తెలుగువాణ్ణి కాబట్టి, అప్పుడప్పుడు అనుకోకుండానే, నేను తెలుగులో మాట్లాడేస్తుంటాను కాబట్టీ, అదీకాక కన్నడ వచ్చిన వారికి తెలుగు సులభంగా వస్తుంది కాబట్టీ, నా కోసం తను, తెలుగు నేర్చుకుంటోంది.

సెక్రటరీ అంటే థర్డ్ గ్రేడ్ తెలుగు సినిమాల్లో చూపించినట్టుగా బాస్ కనపడగానే కొంగు జార్చి, అందాలన్నీ ప్రదర్శిస్తూ, లటుక్కున బాస్ ఒళ్ళో కూర్చునే వల్గర్ క్యారెక్టర్ కాదు.

షీ ఈజ్ మోస్ట్ ప్రొఫెషనల్. మా ఆఫీసు ఉదయం 9 గంటలకు ప్రారంభమవుతుంది. నేను ఎనిమిదిన్నర కల్లా ఆఫీసుకు వస్తాను. తను నా కంటే అరగంట ముందే వచ్చి నా ఛాంబర్ క్లీన్‌గా, స్పిక్ అండ్ స్పాన్‌గా, నేను ఎలా ఉండాలని కోరుకుంటానో, అలాగే ఉందా లేదా? అని చెక్ చేస్తుంది. నాకొచ్చిన మెయిల్స్ చెక్ చేసి, అవసరమైన వాటిని హైలైట్ చేసి, ఒక ఫోల్డర్ క్రియేట్ చేసి, ఆ రోజు డేటుతో సహా రెడీగా ఉంచుతుంది.




నా అపాయింట్‌మెంట్స్ అన్నీ తనే అరేంజ్ చేస్తుంది. నా టూర్ ప్రోగ్రామ్స్, హోటల్ బుకింగ్స్, ఏ సిటీకి వెళ్తే అక్కడ నన్ను రిసీవ్ చేసుకోబోయే హోస్టు వివరాలు అంటే పక్కాగా నా ఐటినెరరీ (itinerary) నా యాత్రా ప్రణాళికను సిద్ధం చేస్తుంది. ఆ ప్రోగ్రామ్ వివరాలను కావలిసిన వారందరికీ మెయిల్ పెడుతుంది. అందరినీ ఫాలో అప్ చేస్తుంది.

నేను డీల్ చేసే ప్రతీ కేసుకు సంబంధించి అన్ని విషయాలు క్షుణ్ణంగా అవగాహన చేసుకుంటుంది. ప్రతీ కేసుకు సంబంధించి ఒక ఇండెక్స్ తయారు చేస్తుంది. ఆ ఇండెక్సుల్లో, ఆ కేసుకు సంబంధించి నేను తరచుగా మాట్లాడే అవసరమున్న వ్యక్తుల, అధికారుల ఫోన్ నంబర్లు; ఫాక్స్ నంబర్లు, మెయిల్స్, వాట్సప్ నంబర్లు; ఆ కేసులో అప్పటి వరకు జరిగిన ప్రోగ్రెస్; ప్రస్తుతానికి ఏ స్టేజ్‌లో ఉంది; ఏ యాక్షన్ తీసుకుంటే కేసు క్లోజ్ అవుతుందన్న వివరాలు at a glance అంటే ఫైలంతా చదవకుండానే, విహంగ వీక్షణం చేస్తే, ఒక్క పేజీలో దర్శనమిస్తాయి.

సంవత్సరం క్రితం జాయినైన కొత్తలో, నా పని తీరుకు అలవాటు పడడానికి తను చాలా కష్టపడింది. అందరి అమ్మాయిల్లాగే ముందు నన్ను లుక్స్‌తో పడేసి, వర్క్‌లో రిలాక్స్ అవుదామని ప్రయత్నించింది. కానీ, త్వరలోనే, మా ఆఫీసులో, నా ఛాంబర్‌లో తన పాత్రను అర్థం చేసుకుని, పనులన్నీ చకచకా నేర్చుకుంది. తన ఔట్‌లుక్ మారగానే నేను ఆమెను ట్రైనప్ చేశాను. నాకు కావలిసిన విధంగా మౌల్డ్ చేసుకున్నాను.

ఎందుకంటే, సెక్రటరీ ఎంత ఎఫిషియెంట్‌గా ఉంటే నా మీద అంత మేరకు బర్డెన్ తగ్గుతుంది. అందుకే, మిగతా వారిలా కాకుండా, నేను కేసును తనతో విశదంగా చర్చిస్తుంటాను. అలా చేయడం వల్ల తనూ కేసులో ఇన్వాల్వ్ అయి, ఆ కేసు మీద ఇంట్రెస్ట్ పెరుగుతుంది. తనతో డిస్కస్ చేయడం వల్ల నాక్కూడా కొన్ని అంశాలు క్లియర్ అవుతుంటాయి. ఒక రకంగా చెప్పాలంటే మేమిద్దరమూ కలిసి స్ట్రాటెజీ, వ్యూహం రూపొందించుకుంటాము. కంపెనీలో మిగతా వారి సంగతేమో కానీ, ఈ పద్ధతి వల్ల మా టీమ్‌కు మంచి విజయాలే లభించాయి.

ఒక్కోసారి నాకు 'she is as good as me' అనిపిస్తుంది. అయితే, ఇతర అధికారులు, ఇతర ఆఫీసుల్లో మాదిరిగా, నా దగ్గర ఫిమేల్ హరాస్‌మెంట్ లేకపోవడంతో తను చాలా రిలాక్స్‌డ్‌గా పని చేస్తుంది.

దాదాపు నా మెదడుకు ఎక్స్‌టెన్షన్‌లా ఆమె బుర్ర పని చేస్తుంది. నేనేదయితే మనసులో అనుకుంటానో, తను ఆ పని ఆల్రెడీ చేయడం మొదలు పెడుతుంది.

పని విషయంలోనే కాకుండా వనజ వ్యక్తిత్వం కూడా గొప్పది. ఒక్కసారి మా మధ్య ఎలాంటి రిలేషన్ ఉండాలన్న విషయంలో క్లారిటీ వచ్చాక తను నన్ను నా తెలివితేటలకు, నా హ్యాండ్‌సమ్ పర్సనాలిటీకి, నన్ను, లైకే, చిన్న పాపాయిలా, అడోర్ చేయడం, ఆరాధించడం మొదలుపెట్టింది. నా గురించి ఎవరైనా చెడుగా మాట్లాడినా, చెడు కామెంట్స్ పాస్ చేసినా అస్సలు ఒప్పుకునేది కాదు. వారితో వాదనకు దిగేది. నా సెక్స్ రిలేషన్స్ గురించి కంపెనీలో, నా పరోక్షంలో చాలా మందే కామెంట్స్ చేస్తుంటారు. వాళ్ళు వనజని కావాలని ఆ చర్చలోకి లాగి నన్ను తన ముందరే ఎగతాళి చేస్తారు. అందులో చాలా మంది అమ్మాయిలే ఉంటారని నాకు తెలుసు. ఎందుకంటే వాళ్ళందరూ నా దగ్గర భంగపడ్డవాళ్ళే. ఆఫీసులో వాళ్ళతో ఎటువంటి రిలేషన్ పెట్టుకోకూడదని, నా పూర్వానుభవం నేర్పిన పాఠంతో, నేను ఈ కంపెనీలో చేరిన మొదటి నుంచీ ఒక నియమం పెట్టుకున్నాను. అది బెంగుళూరు లాంటి నగర కాస్మోపాలిటన్ భామలకు నచ్చలేదు. అందుకే, లేనిపోని పుకార్లు పుట్టిస్తారు. తమకు దక్కనిది వనజకు దక్కిందేమోనని వాళ్ళ దుగ్ధ.

**(ఇంకా వుంది)**

# హోమియోకేర్ ఇంటర్నేషనల్‌లో
## 'రుమటాయిడ్ ఆర్థరైటిస్' నివారణ సులభం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్నేషనల్



ఏ వయస్సు వారినైనా ప్రభావితం చేసే ఈ వ్యాధి ముఖ్యంగా 30 నుండి 60 సంవత్సరాల మధ్య వయస్సు గలవారిని ఎక్కువగా ప్రభావితం చేస్తుంది. పురుషుల కంటే స్త్రీలలో 3రెట్లు అధికంగా ఈ వ్యాధి కనిపిస్తుంది. 16 సం॥ లోపు వయస్సు గల వారిలో ఈ వ్యాధి తలెత్తినచో, దీనిని వైద్యపరిభాషలో 'జువెనైల్ రుమటాయిడ్ ఆర్థరైటిస్' అని అంటారు. ఈ వ్యాధి ముఖ్యంగా కీళ్ళలోని సైనోవియం పొరను శోథమునకు గురి చేసి, తద్వారా క్రమంగా కీళ్ళలోని ఎముకలను, వాటి తాలూకు కార్టిలేజ్‌ని కూడా దెబ్బతీస్తుంది. ఫలితంగా కీళ్ళు – వాటి ఆకారం, అమరికను కోల్పోయి, విపరీతమైన నొప్పి కలగటంతో పాటు కీళ్ళ కదలికలు కష్టతరంగా మారుతాయి. ఈ పరిస్థితి దీర్ఘకాలికంగా కొనసాగితే అది కీళ్ళను పూర్తిగా దెబ్బతీసి – కీళ్ళ వైకల్యానికి కూడా దారి తీసే ప్రమాదం ఉంది.

'రుమటాయిడ్ ఆర్థరైటిస్' సమస్యను వాడుక భాషలో 'కీళ్ళవాతం' అని అంటారు. ఇది ఒక ఆటో ఇమ్యూన్ వ్యాధి. మన శరీరంలోని రోగనిరోధక వ్యవస్థ – మన సొంత కణాలపైనే దాడిచేయడం వలన కలిగే వ్యాధులను 'ఆటో ఇమ్యూన్ వ్యాధులు' అని అంటారు. 'రుమటాయిడ్ ఆర్థరైటిస్' అనేది క్రానిక్ సిస్టమిక్ ఇన్‌ఫ్లమేటరీ డిసీజ్. దీని వలన శరీరంలోని వివిధ రకాల కణజాలాలు, అవయవాలు, కీళ్ళు (సైనోవియల్ జాయింట్స్), ఊపిరితిత్తులు, మూత్రపిండాలు, హృదయం మరియు చర్మం శోథమునకు గురికావడం వలన ఈ వ్యాధి తాలూకు దుష్ప్రభావం ఆయా అవయవాలపై ఉంటుంది.




**కారణాలు:** సాధారణంగా రోగనిరోధక వ్యవస్థ – బ్యాక్టీరియా, వైరస్ మరియు ఇతర అన్య పదార్థాలు ఏవైనా మన శరీరం లోనికి ప్రవేశించినప్పుడు, వాటిపై దాడి చేసి, మనల్ని వ్యాధి బారిన పడకుండా కాపాడుతుంటుంది. కానీ కొన్నిసార్లు మన శరీరంలో అసమతుల్యతలు ఏర్పడి, రోగనిరోధక వ్యవస్థ సొంత కణాలపైనే దాడి చేయడంతో ఈ వ్యాధి కలుగుతుంది. ● ఈ వ్యాధికి గల ఖచ్చితమైన కారణాలు తెలియరాలేదు. కానీ కుటుంబచరిత్ర, పొగ త్రాగటం, అధిక బరువు, వాతావరణ మార్పుల వంటి అనేక అంశాల వలన ఈ వ్యాధికి గురి అయ్యే అవకాశం ఉంటుంది. ● 'రుమటాయిడ్ ఆర్థరైటిస్'తో బాధపడే వారిలో 80% వరకు 'రుమటాయిడ్ ఫ్యాక్టర్' అనే యాంటీబాడీని కలిగియున్నారు.

**లక్షణాలు:** ఈ వ్యాధికి గురి అయిన కీళ్ళలో – వాపు, నొప్పి మరియు చేతితో తాకితే వేడిగా అనిపించడం, ఉదయాన్నే నిద్ర లేవగానే కీళ్ళు బిగుసుకుపోవడం వంటివి కనిపిస్తాయి. ● శరీరంలోని ఇరు పార్శ్వాలలో ఉండే ఒకే రకమైన కీళ్ళను ప్రభావితం చేయడం ఈ వ్యాధి యొక్క ముఖ్య లక్షణం. ● ఈ వ్యాధి మొదట – చిన్న కీళ్ళు అయిన చేతివ్రేళ్ళు, కాలివ్రేళ్ళను మరియు వ్యాధి తీవ్రత పెరిగే కొద్దీ – మణికట్టు , మోచేతులు, భుజాలు, మోకాళ్ళతో పాటు, తుంటి ప్రాంతాన్ని మరియు చీలమండల వంటి కీళ్ళను ప్రభావితం చేస్తుంది. ● కీళ్ళ ప్రాంతంలోని చర్మం క్రిందనుండే ఫైబ్రస్ కణజాలం పెరగడంతో, అవి బయటకు చిన్న కణితుల మాదిరిగా కనిపిస్తాయి. వీటిని రుమటాయిడ్ నాడ్యూల్స్ అని అంటారు. ● వీటితో పాటు నీరసం, రక్తహీనత, బరువు తగ్గడం, ఆకలి తగ్గిపోవడం, జ్వరం వంటి లక్షణాలను కూడా గమనించవచ్చు. ● ఈ వ్యాధి ప్రభావం – ఇతర ప్రధాన అవయవాలైన కళ్ళు, చర్మం, రక్తనాళాలు, గుండె, ఊపిరితిత్తులు మరియు మూత్రపిండాల పైన ఉండటం వలన కళ్ళు పొడిబారడం మరియు నోరు ఎండిపోయినట్లుండటం, ఛాతీనొప్పి, దగ్గు, శ్వాస తీసుకోవడంలో ఇబ్బంది తలెత్తడం, రక్తనాళాల్లో కొవ్వు పేరుకుపోవడం వలన గుండెనొప్పి వంటి లక్షణాలను కూడా మనం గమనించవచ్చు.

**రోగ నిర్ధారణ పరీక్షలు:** సి.బి.పి., ఇ.ఎస్.ఆర్., ఆర్.ఏ. ఫ్యాక్టర్, ఏ.ఎన్.ఏ. యాంటీ సి.సి.పి., ఎక్స్-రే, ఎమ్.ఆర్.ఐ. మొదలైన పరీక్షలు చేయడం ద్వారా ఈ వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్నేషనల్ వైద్యం:** చాలా రకాల ఆటో ఇమ్యూన్ వ్యాధులు 'సైకో సోమాటిక్ డిజార్డర్స్' క్రిందకు వస్తాయి. అన్ని రకాల సైకో సోమాటిక్ డిజార్డర్స్‌కు హోమియోలో చక్కని పరిష్కారం లభిస్తుంది. ఇలాంటి ఆటో ఇమ్యూన్ వ్యాధులకు ఇతర చికిత్సా విధానాలలో శాశ్వత నివారణ లేదు – కేవలం తాత్కాలిక ఉపశమనం మాత్రమే లభిస్తుంది. కానీ హోమియోకేర్ ఇంటర్నేషనల్‌లో అందించబడే కాన్‌స్టిట్యూషనల్ హోమియో చికిత్సా విధానం ద్వారా, రోగి మానసిక మరియు శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకుని, చికిత్స అందించడం ద్వారా ఈ వ్యాధి సంపూర్ణంగా నయం అయ్యే అవకాశం ఉంది. అంతేకాకుండా ఇతర కాంప్లికేషన్స్ బారిన పడకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు.

టోల్ ఫ్రీ 1800 108 1212

కన్సల్టేషన్ ఉచితం
955 000 1199

www.homeocare.in




**న**లుగురినోటిలో కృష్ణుడు పడకూడదు. కృష్ణుడి అల్లరి అరికట్టాలి. అక్కడికీ ఇక్కడికీ పోకుండా కృష్ణుణ్ణి నిరోధించాలి. ఏం చెయ్యాలి? బాగా ఆలోచించింది యశోద. కృష్ణుడు కదలకుండా పెరట్లో రోటికి కట్టిపడేయడం అన్ని విధాలా మంచిది అనుకున్నది. అనుకున్నదే తడవు కృష్ణునికి కడుపు నిండా పాలు పట్టింది. పాలుపట్టి రోటికి కట్టేసేందుకు తాడు తెచ్చింది. మొదటి చివర రోటికి కట్టి ముడిపెట్టింది. రెండో చివర కృష్ణుని మొలకి కట్టేందుకు ప్రయత్నించింది. అయితే ఆ తాడు రెండు అంగుళాల మేర తక్కువైంది. ఇంకో తాడు తెచ్చి చూసింది. అదీ రెండు అంగుళాలు తక్కువైంది. మరో తాడు తెచ్చింది. అదీ అంతే! ఇంట్లో తాళ్ళన్నీ రెండు అంగుళాల మేర తక్కువగా ఉండడంతో, ఇరుగింటికి వెళ్ళి అడిగి తెచ్చి చూసింది. ఆ తాడూ అంతే! రెండు అంగుళాలు తక్కువగా ఉంది. పొరుగింటికి వెళ్ళి అడిగి తెచ్చినా ఫలితం లేకపోయింది. ఆ విచిత్రానికి యశోదసహా పల్లెలోని గోపికలంతా ఆశ్చర్యపోయారు. ఏం చెయ్యాలిప్పుడు? ఎలా కట్టాలి అనుకున్నంతలో తానే మొలకి తాడు కట్టుకుని, ఆటను ఆపాడు కృష్ణుడు. తాడు సరిపోయిందా? అన్నట్టుగా నవ్వుతూ తల్లిని చూశాడు. హమ్మయ్య అనుకున్నది యశోద. ఊపిరి పీల్చుకున్నది.

# కూలిన మద్దిచెట్లు:పెరిగి పెద్దయిన బలరామకృష్ణులు

ఇక అటూ ఇటూ ఎలా పరిగెడతావో నేనూ చూస్తాను. అయ్యగారి ఆటకట్టు అన్నది యశోద. కృష్ణుణ్ణి వదలి, గోపికలుసహా వెళ్ళిపోయింది అక్కణ్ణుంచి.

కాసేపు గడిచింది. దగ్గరగా ఎవరూ లేరు. దూరంగా గోపబాలకులు ఆడుకుంటున్నారు. అయితే వారెవరూ ఇటు కృష్ణుణ్ణి పట్టించుకునే స్థితిలో లేరు. అదే అవకాశంగా కృష్ణుడు తనకి కట్టిన రోలుని ఈడ్చుకుపోసాగాడు. పొడుగ్గా, పెద్దగా రెండు మద్దిచెట్లు ఉన్నాయక్కడ. వాటి మధ్యకు రోలుని తీసుకుపోసాగాడు. నారదమహర్షి శాపం వల్ల మద్దిచెట్లలా మారిన యక్షులను అనుగ్రహించేందుకు ముందుకురికాడు కృష్ణుడు.

ఆగండి మునీశ్వరా! చేతులు జోడించి ప్రార్థించాడు జనమేజయుడు. ఆగాడు వైశంపాయనుడు.

ముందు యక్షులు మద్దిచెట్లుగా మారిన వైనం, వారిని నారదుడు ఎందుకు శపించాడు అన్నది వివరించండి అడిగాడు జనమేజయుడు.

తప్పకుండా వివరిస్తాను అన్నాడు వైశంపాయనుడు.

యక్షుల శాపవిమోచనకు కృష్ణుడు ఎందుకు నడుం కట్టుకున్నాడన్నది కూడా మీరు చెప్పాలి.

అవశ్యం అని నవ్వాడు వైశంపాయనుడు. తర్వాత చెప్పసాగాడిలా.

మహారాజా! మద్దిచెట్లుగా మారిన యక్షులపేర్లు నలకూబర మణిగ్రీవులు. వారిద్దరూ కుబేరుని పుత్రులు. పరమేశ్వరుని సేవకులు. అయితే వారికి గల అహంకారం అంతా ఇంతా కాదు. మాలాంటివారు ఈ ప్రపంచంలోనే లేరన్నంతగా ప్రవర్తించేవారు. ఒకనాడు వారిద్దరూ, ఇద్దరు సుందరీమణులతో వెండికొండమీది పూలతోటలో విహరించసాగారు. ఆకాశగంగాతరంగాల్లో జలక్రీడలాడసాగారు. అప్పుడు అటుగా నారదుడు విచ్చేశాడు. నారదుణ్ణి చూసిన సుందరీమణులు సిగ్గుపడ్డారు. గబగబా వలువలు ధరించారు. మద్యపానమత్తులై ఉన్న నలకూబర మణిగ్రీవులిద్దరూ దుస్తులు ధరించలేదు సరికదా, నారదుణ్ణి పట్టించుకోనట్టుగా ప్రవర్తించారు. దిగంబరంగానే నీటిలో నిలిచారు. వారి మదోన్మత్తతను తట్టుకోలేకపోయాడు నారదుడు. శపించదలిచాడు. అప్రయత్నంగా అన్నాడిలా.

ధనగర్వం తలకెక్కినవాడు ఇతరుల మాటే తలపెట్టడు. తనువు, మనుగడ, సంసారం శాశ్వతం అనుకుంటాడు. దీనజనులహింసకు కూడా వెనుకాడడు. అదే దరిద్రుడు ఇతరులను ఆదరిస్తాడు. అంతా తనలాంటివాళ్ళేనని జాలిపడతాడు. అందుకే కలిమితో కళ్ళు మూసుకుపోయినవారికి లేమి సరైన మందు అని పెద్దలు అన్నారు.

తర్వాత? అన్నట్టుగా చూశారు కుబేరకుమారులు. నారదుణ్ణి గేలి చేశారు.

కుబేరుని కుమారులమని గర్వంతో విర్రవీగుతున్నారు. మానినీ మదాంధులై కన్నూ మిన్నూ కానకున్నారు. మీకు తగిన శాస్తి జరగాలి. ఈ భూలోకంలో జంట మద్దిచెట్లయి మీరు నూరు దివ్య సంవత్సరాలు నిలిచి ఉండండి. ఇదే నా శాపం అన్నాడు నారదుడు.

ఆసరికి యక్షులిద్దరికీ మత్తుదిగింది. గర్వం కూడా అణగింది. చేసిన తప్పు తెలిసొచ్చి, ఇద్దరూ చేతులు జోడించారు. నారదునికి నమస్కరించారు. శాపవిముక్తి కలిగించమని వేడుకున్నారు. అప్పుడు నారదుడు అన్నాడిలా.

వంద దివ్యసంవత్సరాల అనంతరం శ్రీకృష్ణుని పాదసంస్పర్శవల్ల శాపవిముక్తి కలుగుతుంది. తర్వాత స్వర్లోకం చేరుకుంటారు.

ధన్యులం అన్నారు యక్షులు. నారదుని కోపం తగ్గిందప్పటికి. అతను అక్కణ్ణుంచి నిష్క్రమించాడు. నారదుడు అటు వెళ్ళగానే ఇటు నలకూబర మణిగ్రీవులిద్దరూ జంటమద్దిచెట్లయి జన్మించారు.

ఆ చెట్ల మధ్యకు రోలుసహా వచ్చాడు కృష్ణుడు.

చెట్లనానుకుని రోలు నిల్చుంది. లాగితే వాటి మధ్య నుంచి అది రావట్లేదు. బలంగా లాగాడు కృష్ణుడు. అంతే! రెండు మద్దిచెట్లూ ఫెళఫెళమని పెద్దగా శబ్దం చేస్తూ కూలిపోయాయి. కూలిన చెట్లస్థానంలో తేజోమూర్తులు నలకూబర మణిగ్రీవులిద్దరూ నిలిచారు. చిన్నికృష్ణుని చూసి చేతులు జోడించారు. ప్రార్థించారిలా.

మహానుభావా! దేవదేవా! పిల్లాడిలా కనిపిస్తున్న నువ్వు పిల్లాడివి కావు. ఆ పరాత్పరుడివి. ఆదిమధ్యాంతరహితుడివి. ఈ సమస్తప్రపంచం నీ బాహ్యరూపం. సమస్తప్రాణుల పంచేంద్రియాలకు నువ్వే అధీశ్వరుడివి. ప్రకృతి, దాని నుంచి ప్రభవించిన మహత్తులన్నీ నీ స్వరూపాలే! వాటికి నువ్వే విభుడివి. యోగీశ్వరా! విశ్వమంగళా! ప్రపంచసంరక్షణార్థమై ప్రభవించిన ఆదిపురుషుడవు నువ్వు. నిన్ను మేము దర్శించగలిగామంటే... ఇదంతా ఆ నారదముని శాపకారణం. అందుకు ధన్యులం. ఇక సదా నిన్ను సేవించుకునే భాగ్యం మాకు ప్రసాదించు.

యక్షులారా! సర్వప్రాణుల్లో నేను ఉన్నానని గ్రహించి, నన్ను అర్చించినవారికి ఎలాంటి బంధనాలూ ఉండవు. నన్ను చూస్తే చాలు, బంధనాలన్నీ పటాపంచలవుతాయి. మీ సహజరూపాలు మీరు పొందారు కదా, స్వర్లోకం చేరుకుని ఆనందించండి. వెళ్ళిరండి అన్నాడు కృష్ణుడు.

ధన్యులం అన్నారు కుబేరకుమారులు. ఇద్దరూ వెంటనే అదృశ్యమయ్యారు.

ఇంటిముంగిట చర్చల్లో ఉన్న నందుడాదిగా పెద్దలకు పెరట్లో నుంచి పెను శబ్దం వినరావడంతో పరుగుదీశారు. పెరట్లోనికి చేరుకుని చూశారు. ఏనాటి నుంచో

**కృష్ణుని మాయా ప్రభావంతో వేలకొలదీ తోడేళ్ళు ఉద్భవించాయి. పులుల్లా వ్రేపల్లెమీదపడి పశువుల్ని లాక్కుపోసాగాయి. లేగదూడలు, పాడిఆవులు బితుకుబితుకు మనసాగాయి. సింహాలను సైతం ఎదుర్కోగల ఆబోతులు ఆమడదూరంలో నిలిచిపోసాగాయి. తోడేళ్ళు సహా అడవిపందుల గుంపులు, అనేక క్రూరమృగాలు వ్రేపల్లెలో ప్రవేశించాయి. ఆ ప్రళయోదంతం చూసి తట్టుకోలేకపోయారు పెద్దలు.**

ఉన్న మద్దిచెట్లు నిలువునా కూలిపడడం గమనించి ఆశ్చర్యపోయారు. గాలివానా లేదు. పిడుగుపడ లేదు. గొడ్డలితో నరికిన జాడలేదు. చిన్నికృష్ణుడు కూలదోసే అవకాశం లేదు. మరి చెట్లెలా కూలి పోయాయి? అంతుచిక్కక ఏమైఉంటుందా? అని అనేక రకాలుగా ఆలోచనలు చేశారు. అంతలో దూరంగా ఆడుకుంటున్న గోపబాలకులు అటుగా వచ్చి, తాము చూసింది చెప్పారు.

తనకు కట్టిన రోటిని కృష్ణుడు మద్దిచెట్లమధ్యకు తీసుకుని వచ్చాడు. బలంగా దానిని వాటి మధ్య నుంచి లాగాడు. అప్పుడు చెట్లు కూలిపోయాయి. వాటి స్థానంలో ఇద్దరు తేజోమూర్తులు వెలిశారు. వారు కృష్ణునికి నమస్కరించి మాయమైపోయారు.

పిల్లల మాటలు పెద్దలు పట్టించుకోలేదు. ఆట పిల్లలు, తమను ఆట పట్టిస్తున్నారనుకున్నారు. వెళ్ళి రండి! ఆడుకోండి అని వారిని అక్కణ్ణుంచి పంపించేశారు. చర్చోపచర్చలు, వాదోపవాదాలు ఎన్ని జరుగుతున్నా ఏమీ పట్టించుకోక దోగాడుతూ అమాయకంగా చూస్తున్న కృష్ణుణ్ణి దగ్గరగా తీసుకున్నాడు నందుడు. వాడి మొలకు కట్టిన తాడు విప్పాడు. అంతలో గోపి కలు చేరుకున్నారక్కడికి. చిన్నికృష్ణుని నవ్వించేదుకు, ఆడించేందుకు చప్పట్లు చరిచి, నర్తించసాగారు. వారలా నర్తిస్తోంటే తండ్రి చేతుల్లోంచి కిందికి దిగి, తానూ వారిని అనుసరించి నర్తించాడు కృష్ణుడు. నవ్వాడు.

తోటిపిల్లలతో ఆటపాటలు తప్ప ఆకలిపట్టించు కోని కృష్ణునికి, అన్నం తినిపించేందుకు, పాలు పట్టేం దుకు అబద్ధాలాడసాగింది యశోద.

కన్నా! నువ్వు కడుపునిండా పాలుతాగితే, నీ జుత్తుందా, అది ఇంకా పొడుగ్గా పెరిగి బాగుంటుంది అన్నది యశోద. నిజంగా అడిగాడు కృష్ణుడు. నిజం అన్నది యశోద. అయితే పాలివ్వు, గడగడా తాగే స్తానన్నాడు కృష్ణుడు. యశోద ఇచ్చిన పాలన్నీ తాగే శాడు. జుట్టు చూసుకున్నాడు. ఎదగలేదు. అంతకు ముందు ఉన్నంతే ఉన్నది. అది చూపించి, తల్లిని నిలదీశాడు కృష్ణుడు. పాలు తాగితే జుత్తు పెరుగు తుందన్నావుగా, పెరగలేదేం? అడిగాడు. పెరుగు తుంది. నువ్వు రోజూ పాలుతాగాలి అని తప్పించు కున్నది యశోద.

ఒకరోజు చిన్నకర్రపట్టుకుని తల్లిసహా దిగుడు బావి దగ్గర నిలిచి, అందులోని తన ప్రతిబింబాన్ని చూసుకున్నాడు కృష్ణుడు. కర్రతో నిలుచున్న కుర్రాణ్ణి చూసి భయపడ్డాడు. అమ్మా! చూడు! వాడెవడో కర్ర పట్టుకుని నన్ను కొట్టడానికి వస్తున్నాడన్నాడు. ఆ మాటకి కడుపు చెక్కలయ్యేలా నవ్వుకున్నది యశోద.

ఆకతాయితనం, అల్లరికి మారుపేరుగా కృష్ణుడు ఎదుగుతోంటే ఒకనాడిలా హెచ్చరించింది యశోద.

నువ్వు ఇలాగే అల్లరి చేస్తూ ఉంటే అదిగో! ఆ బూచోడు నిన్ను సంచిలో వేసుకుని పట్టుకుపోతాడు అన్నది. ఆనాటి నుంచి బిచ్చగాళ్ళనూ, వారి సంచు లనూ చూస్తే చాలు, కృష్ణుడు భయపడి, తల్లి చాటుగా దాగునేవాడు. తల్లి చీరకొంగును కప్పుకునేవాడు. కృష్ణుడి ప్రవర్తన చూసి, పిచ్చికన్నయ్యా అని ముద్దు చేసేది యశోద.

**(పూర్వభాగం:పంచమఖండం సమాప్తం)**

శ్రీకృష్ణబలరాములిద్దరూ క్రమక్రమంగా పెరిగి పెద్దవారయ్యారు.



ఒకనాడు కృష్ణుడు, అన్న బలరాముణ్ణి సమీ పించి అడిగాడిలా.

అన్నా! నేను చాలాకాలంగా అనుకుంటున్న మాట నీకు చెప్పాలని ఉంది. వింటావా?

చెప్పు చెప్పు నీ మాట నేనెప్పుడు కాదన్నాను అన్నాడు బలరాముడు. చెప్పసాగాడిలా కృష్ణుడు.

పుట్టినప్పటి నుంచి మనం ఈ పల్లెలో నివసి స్తున్నాం. రోజులు బాగుండి, గడిచిపోయాయి. ఇప్పుడు రోజులు బాగా లేవు. ఇంకా ఈ పల్లెలో ఉండడం ఎవరికీ మంచిది కాదు. పశువులకి మేత కష్టంగా ఉంది. పంటలు పండడం లేదు. కాయగూరలకి కరువు వచ్చింది. ఆఖరికి వంటచెరకు కూడా దొరకడం లేదు. చెరువుల్లో నీరు లేదు. ఇలాంటి పరిస్థితుల్లో ఇక్కడ ఉండడం బాధల్ని మూటగట్టుకోవడమే! అందుకని....

అందుకని? రెట్టించాడు బలరాముడు.

అంతా బృందావనానికి వెళ్ళిపోదాం. బృందావనాన్ని చూసినవారంతా దానిని నందనవనం అంటున్నారు. అక్కడ గోవర్ధనం అని ఓ పర్వతం ఉంది. అది పేరుకి తగ్గ పర్వతం. అలాగే అక్కడ డిండీరం అని ఓ పెద్ద మర్రిచెట్టు ఉన్నది. ఆకాశగంగలాంటి యమునానది ఉన్నది. నీటికీ, పంటకీ తిరుగులేని నేల అది. అక్కడికి వెళ్ళిపోతే హాయిగా బతకవచ్చు న్నది నా అభిప్రాయం. నువ్వేమంటావో చెప్పు?

ఆలోచనలోపడ్డాడు బలరాముడు.

మన యువతరం అంతా వెళ్ళిపోదామనే మోజు పడుతున్నది కాని, ముసలితరం మాత్రం రామంటు న్నారు. ఇక్కడ పుట్టిపెరిగిన వాళ్ళం. ఇక్కడే మరణి స్తామంటున్నారు. పిచ్చినమ్మకాలూ వాళ్ళూ...అని ఆగాడు కృష్ణుడు.

పెద్దలనుకాదని మనం ప్రయాణం కట్టడం తప్పు. వాళ్ళని ఒప్పించగలగాలి. ఆ బాధ్యతనీదే అన్నాడు బలరాముడు. సరేనన్నట్టుగా నవ్వాడు కృష్ణుడు. అయితే అటు చూడు అన్నాడు. బలరాముడు చూశా డటు.

కృష్ణుని మాయాప్రభావంతో వేలకొలది తోడేళ్ళు ఉద్భవించాయి. పులుల్లా వ్రేపల్లె మీద పడ్డాయి. కని పించిన పశువుల్ని లాక్కుపోసాగాయి. దాహం తీర్చుకునేందుకు చెరువుకి వెళ్ళాలంటే లేగదూడలు భయపడసాగాయి. పచ్చికకోసం పరుగుదీసే పాడి ఆవులు బితుకుబితుకుమనసాగాయి. సింహాలనుసైతం ఎదుర్కోగల ఆబోతులు, ఆ తోడేళ్ళను చూసి ఆమడ దూరంలోనే నిలిచిపోసాగాయి. అయినా వదలి పెట్టక వాటి అంతుచూడసాగాయి తోడేళ్ళు. నెత్తురు జుర్రుకోసాగాయి. గొర్రెపిల్లలకు ఆశపడే తోడేళ్ళు ఇప్పుడిలా పెద్దపెద్దపశువుల్ని పొట్టనబెట్టుకోవడాన్ని చూసి పల్లెప్రజలు భయభ్రాంతులయ్యారు. తోడేళ్ళు సహా అనేకరకాల క్రూరమృగాలు కూడా వ్రేపల్లెలో ప్రవేశించాయి. అడవిపందులు గుంపుగుంపులుగా వచ్చి పంటపొలాలను చిందరవందర చేశాయి. నేలను పెళ్ళగించాయి. ప్రళయంలా ఉందంతా. చూసి తట్టు కోలేకపోయారు పెద్దలు.

—అరణి

2

# విజయ విలాసం-2

## స్టెప్స్ టు సక్సెస్

- ఎం. వెంకటేశ్వరరావు, సెల్: 90307 07037

**ఈ మధ్య ఎవరినోట విన్నా 'క్వాలిటీ ఆఫ్ లైఫ్' మాటే. అంటే డూప్లెక్స్ ఇల్లు, సాఫ్ట్‌వేర్ ఉద్యోగం. ఉద్యోగంచేసే లైఫ్ పార్టనర్ ఖరీదైనకారు, ఇద్దరు పిల్లలు, ఏది కావాలన్నా క్షణాల్లో అందుకోగల ఆర్థిక స్తోమత, లక్షల్లో బ్యాంకు బ్యాలెన్సు, ఇలా చెప్పుకుంటూ పోతే చేంతాడంత 'లగ్జరీలు..' అంతా సుఖమయ జీవితం.**

**ఆ లగ్జరీలకోసం వ్యక్తిత్వం, విలువలకి తిలోదకాలిస్తున్నారు. ఆర్థిక వనరులు ఆశించినంత అందకపోతే తమ శక్తియుక్తులు, క్రియేటివిటీని అక్రమ మార్గంలోకి మళ్ళిస్తున్నారు.**

## క్వాలిటీ ఆఫ్ లైఫ్ అంటే...



తెలిసో, తెలియకో తాము చేస్తున్న వృత్తి, ఉద్యోగాల్లో క్వాలిటీ ఆఫ్ లైఫ్ హంగులకోసం ఎలాంటి అక్రమాలకైనా వెనుదీయడంలేదు. తద్వారా లభించే జీవితమే శాశ్వతం అనుకుంటున్నారు.

క్వాలిటీ ఆఫ్ లైఫ్ కోసం అక్రమమార్గాల్లో ప్రయాణిస్తే, ఆశించింది అందడం మాట అలా ఉంచితే మనశ్శాంతికి దూరమవటంతప్ప ఆశించిన ఫలితం మాత్రం అందదు. అందినా తాత్కాలికమే.

"విజయం నీకు బానిసైతే అది నీ గొప్పతనం. విజయానికి నువ్వు బానిసైతే అది దాని గొప్పతనం..." **–వివేకానంద.**

### చెప్పిందే చెయ్

"శనగలు తింటూ ఉలవలు ఎదుటివారికి పెట్టే రకం" అని ఒక సామెత. అంటే చెప్పేదానికీ, చేసేదానికీ పొంతన ఉండదు. ఇలాంటి జీవితాల్లో 'క్వాలిటీ ఆఫ్ లైఫ్'కి పారదర్శకత ఉండదు.

ఇలాంటివారు తరచు విలువలు, ఆధ్యాత్మికత ఇత్యాదులగురించి గొప్పగా మాట్లాడుతుంటారు.

యువ 'స్వామీజీ' నిత్యానంద ఉదాహరణ చూడండి. ఆధ్యాత్మికంగా పిన్నవయసులోనే పీక్స్‌కి చేరి, దేశవిదేశాల్లో ఆశ్రమాలు, వాటి బ్రాంచిలు నెలకొల్పిన కార్పొరేట్ స్వామి!

అరిషడ్వర్గాల్ని జయించడమెట్లా? వంటి విషయాలపై అనర్గళమైన ఆంగ్లోపన్యాసాలతో ప్రజల్ని మభ్యపెట్టగల రసికశిఖామణి. ఓ సినీతారతో ఆయన రాసలీలలు, ఒక్కసారిగా వెలుగుచూశాయి. దాంతో ఎన్నోఏళ్ళు ఆయనచేసిన సాధన సాగరంపాలైంది. ఉన్నత వ్యక్తిత్వం, సద్భావన, సత్సాంగత్యం లోపించిన వాళ్ళు చెప్పే విలువలు మాటలకే పరిమితం. తనకి ఏది కావాలో, అది ఎక్కడ దొరుకుతుందో తెలిసిన వ్యక్తులే జీవితంలో పైకొస్తారు. అలాంటి వారే చెప్పింది చేస్తారు. చెప్పింది చెయ్యగల సత్తా ఉన్నప్పుడే దానిని గురించి మాట్లాడాలి. ఇటీవలి కాలంలో మనకు తారసిల్లిన అలాంటి తెలుగుతేజం రేవంత్. ఈ సీజన్‌లో రియాలిటీ షో 'ఇండియన్ ఐడల్' టైటిల్ సాధిస్తానని చెప్పిమరీ సాధించాడు.

### వ్యక్తిత్వం = చేతలు, మాటలు

మాటలకు, చేతలకు పొంతన ఉన్నవారు సద్గుణాలకు, నైతిక విలువలకు ప్రాధాన్యమిస్తారు. ఇలాంటి వాళ్ళ జీవితాల్లో 'క్వాలిటీ ఆఫ్ లైఫ్' నిత్యనూతన వసంతంలా వెల్లివిరుస్తుంది.

"వ్యక్తిత్వం కోల్పోయిన వ్యక్తుల నుండి శౌర్యం, సంపద నిష్క్రమిస్తాయి" **–(పోతన)**

రామలింగరాజు మొదలు విజయ్‌మాల్యా వరకు ఎంతోమంది ఇందుకు సజీవ ఉదాహరణలు.

### రెడీమేడ్ కోసం రెడీ

క్వాలిటీ ఆఫ్ లైఫ్‌లో భాగంగా ఆహారం, ఆహార్యం, ఉద్యోగం, ప్రేమలు, పెళ్ళిళ్ళు, రాజకీయం, జీవితం, జీవన విధానం అన్నీ రెడీమేడ్‌గా లభించాలని కోరుకుంటూ యువత పరుగులు తీస్తోంది.

ప్రెగ్నెంట్ అవగానే పిల్లల పుట్టాలన్న ధోరణి వచ్చింది.

ఏదైనా వేగంగా, ఉచితంగా వచ్చి ఒళ్ళో వాలి పోవాలనే భావనలో బ్రతుకుతున్నారు.

గ్లోబలైజేషన్ పుణ్యమా అని ఇప్పుడన్నీ రెడీమేడ్‌గా లభిస్తున్నాయి. యువతరంలో వచ్చిన పెనుమార్పేంటంటే దీనికి బానిసైపోవడం. రానురాను అది 'రెడీ మ్యాడ్‌నెస్'గా మారుతోంది.

బట్టలు కావాలంటే... కర్చీఫ్ మొదలు సూటూ బూటూ వరకు సెంట్రల్‌మాల్, బిగ్‌బజార్, బ్రాండ్ ఫ్యాక్టరీలకెళ్ళి కొనెయ్యడమే. ఆకలేస్తే ఇడ్లీ నుండి బిర్యానీ వరకు అన్నీ హోం డెలివరీనే.

చదువంటే, పూర్వీకులు చెమటోడ్చిన సంపాదనతో అమలాపురం నుండి అమెరికా వరకూ ఎక్కడైనా దాన్ని "కొనుక్కోవడమే"

ఉద్యోగం అంటే, సాఫ్ట్‌వేర్ రంగమే, జీవిత

మంటే ప్రేమలు, డేటింగ్‌లు, మీటింగులు, మేటింగులు..! నచ్చితే పెళ్ళి, లేకపోతే సహజీవనం, వికటిస్తే విడాకులు!

ఈవిధమైన పరుగు తాత్కాలికమనే విషయం యువత విస్మరించింది. వాళ్ళు చేస్తున్న తప్పిదాలు, పడుతున్న పక్కదారులు 'క్వాలిటీ ఆఫ్ లైఫ్'ని దూరం చేస్తున్నాయి.

### ఇది మర్చిపోయారు

"నువ్వు ఆనందంగా ఉన్నావా? లేదా?" అని తీరుబడిగా ఆలోచించడానికి తగినంత విశ్రాంతి లేకపోవడమే నీ దుఃఖపూరిత జీవితానికి కారణం"

—బ్రెయిన్ ట్రేసీ

క్వాలిటీ ఆఫ్ లైఫ్ కోసం విలువల్ని పణంగా పెట్టకండి. బాల్యంలో తల్లిదండ్రులు నేర్పిన విలువలు విస్మరించి, పాశ్చాత్యనాగరికతతో మమేకం కాకండి. భార్యకు విడాకులు, తల్లిదండ్రులకు వృద్ధాశ్రమాలు.. వంటి పోకడలకు తెరతీయకండి.

వేలఏళ్ళనాటి రామాయణ, మహాభారతాలు నేటికీ సద్గ్రంథాలుగా మనగల్గడానికి కారణం, అందులోని శాశ్వత విలువలు, ఉన్నత ఆదర్శాలే. మనం మాట్లాడే మాటకి కట్టుబడమనీ, చేసే ప్రతిపనికీ ప్రయోజనం ఉండాలనీ, కుటుంబం ఆదర్శంగా ఉండాలనీ, పిల్లల్ని ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దాలనీ.. ఇలాంటి ఎన్నో అంశాల్ని నేటికీ బోధిస్తున్నాయి.

"నిన్నటికంటే నేడు నీలో వివేకం పెరగకపోతే మరో రోజు వ్యర్థమైందని గుర్తించు"

—డేవిడ్ కాల్టన్

కాలాతీతమైన విలువలు, ఆదర్శాలే క్వాలిటీ ఆఫ్ లైఫ్‌కి కేంద్ర బిందువులు. నిలబడి నీళ్ళు తాగమనిచెప్పే విలువలే జీవితానికి దిక్సూచి. విలువలు పాటించడం తెలిసిన వ్యక్తి జీవితంలో దేన్నీ కోల్పోడు. ఆటుపోట్లకు చలించడు. విలువలు మనిషిలోని పారదర్శకత, న్యాయబద్ధత, నమ్మకం, సచ్ఛీలత, సమానత్వాలకు ప్రతిబింబాలు.

మనిషి జీవన గమనం ఎప్పుడూ విలువలతో కలిసి ముందుకు సాగాలి. మన లక్ష్యం జీవిత విలువల్ని పెంచేదిలా ఉండాలి. ఈ రెంటి అనుసంధానమే జీవితం.

శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడు. మిన్నువిరిగి మీద పడినా అది భారతీయసంస్కృతిలో మమేకమైపోయింది.



## హేట్సాఫ్ కిరణ్‌బేడీ



ఉద్యోగ జీవితంలో పెనుసవాళ్ళను ధైర్యంగా అధిగమించి, ఎన్నో సంస్కరణలు ప్రవేశపెట్టి కరుడుగట్టిన ప్రజలను మార్చగలిగారు. ఆమె నిర్ణయాల వల్ల నేడు ఎన్నో కుటుంబాలు క్షేమంగా జీవిస్తున్నాయి. ఒక పోలీసు అధికారిగా ఆమె సంస్కరణలు ప్రపంచం మన్ననలు పొందాయి. ఆమె ఎందరికో స్ఫూర్తిగా నిలిచారు.

విధి నిర్వహణలో 'క్వాలిటీ ఆఫ్ లైఫ్' అంటే 'ఇది' అని తెలియజెప్పిన మహిళ. భారతదేశ తొలి మహిళా ఐ.పి.ఎస్. అధికారిణిగా తనదైన శైలిలో పనిచేశారు. క్వాలిటీ ఆఫ్ వర్క్‌కి కేరాఫ్‌గా మారారు. రామన్ మెగసెసే వంటి అత్యుత్తమ అవార్డులు అందుకున్నారు. బ్యూరో ఆఫ్ రీసెర్చి అండ్ డెవలప్‌మెంట్ డైరెక్టర్ జనరల్ హోదాలో 2007 డిసెంబరులో స్వచ్ఛంద పదవీ విరమణ పొందారు డాక్టర్ కిరణ్‌బేడీ.

1949 జూన్ తొమ్మిదిన అమృతసర్‌లో జన్మించి డిగ్రీ వరకు అక్కడే చదివి, రాజనీతిశాస్త్రంలో పి.జి. చేశారు. ఉద్యోగంలో చేరాక న్యాయశాస్త్రం చదివారు. డిల్లీ ఐఐటి నుండి పి.హెచ్.డి. పట్టా పొందారు. 1972లో బ్రిజ్ బేడీని వివాహమాడారు. వారికి ఓ కూతురు.

1972లో తొలి మహిళా పోలీసు అధికారిగా ఎన్నికయ్యారు. 1973లో రిపబ్లిక్ డే పెరేడ్‌లో ఐ.పి.ఎస్ అధికారి హోదాలో మొదటిసారి కిరణ్ బేడీని చూసి ప్రజలు ఆశ్చర్యపోయారు.

ఏ పదవి చేపట్టినా తనదైన శైలిలో పనిచేసి మన్ననలందుకున్నారు. 1982లో డిల్లీ ట్రాఫిక్ అధికారిగా ఉన్నప్పుడు, నో పార్కింగ్‌ప్లేస్‌లో ఉన్న నాటి ప్రధాని ఇందిరాగాంధీ కారును క్రేన్‌తో తొలగించి చరిత్ర సృష్టించారు. అప్పట్నుంచీ ఆమెను 'క్రేన్ బేడీ' అని పిలుస్తారు.

9000 మంది ఖైదీలున్న తీహార్ జైలు అధికారిగా పనిచేసి ఎనలేని మన్ననలు పొందారు. చండీఘర్ లెఫ్టినెంట్ గవర్నర్ సలహాదారుగా చేశారు. ఐక్యరాజ్యసమితిలో పని చేశారు. సామాన్య ప్రజలతో మమైకం కావడానికి ఓపెన్ డోర్ పద్ధతిని, ప్రతి నియోజకవర్గంలో బీట్ బాక్సు ప్రవేశపెట్టి సంచలనం సృష్టించారు. పదవీ విరమణ అనంతరం నవజ్యోతి ఫౌండేషన్, ఇండియా విజన్ ఫౌండేషన్, స్వచ్ఛంద సంస్థలు స్థాపించి సేవలందిస్తున్నారు. "ఐ డేర్" పేరుతో ఆత్మకథ రాసు కున్నారు. ప్రస్తుతం పుదుచ్చేరి లెఫ్టినెంట్ గవర్నర్‌గా ఉన్నారు.

కర్తవ్య నిర్వహణ ఈమె 'క్వాలిటీ ఆఫ్‌లైఫ్' ఎంతో మంది యువతీ యువకులకు స్ఫూర్తిదాయకం.

కానీ ఈ మధ్య ఓ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ ఏరికోరి ఓ అమ్మాయిని పెళ్ళాడాడు. తొలిరేయిలో భార్యకు నిజాయితీగా తన ఫ్లాష్‌బ్యాక్ ఇలా వివరించాడు. "ఇంతకు ముందు నేను ప్రేమించిన ఆమె వేరే వ్యక్తిని పెళ్ళి చేసుకుంది. అదే సమయంలో విడాకులు తీసుకున్న ఓ అమ్మాయి నన్ను ప్రేమిస్తోంది. ఆ ఇద్దరికీ నా మనసులో ఇప్పటికీ స్థానం ఉంది. వీళ్ళ మధ్య నా జీవితంలోకి వచ్చిన నీకూ అధికారిక స్థానం ఉంది"

దాంతో వారి దాంపత్యం కోర్టు కెక్కింది. నేటి యువత విచిత్రపోకడలకిది మచ్చుతునక. ఇలాంటి వాళ్ళు ఎవ్వరికీ ఆదర్శం కాదు.

### దటీజ్ క్వాలిటీ ఆఫ్ లైఫ్

ఆ మధ్య ఓ జంట ఘనంగా షష్టిపూర్తి చేసుకుంది. "కేవలం విలువలు, పరస్పర నమ్మకమే ఇన్ని దశాబ్దాల తమ దాంపత్య ప్రయాణానికి కారణమని వారు గర్వంగా చెప్తుంటే వినేవారి ఒళ్ళు పులకరించింది. దటీజ్ క్వాలిటీ ఆఫ్ లైఫ్.

ఎక్కువమంది తమ శక్తియుక్తులు వృత్తి, వ్యాపారం, రాజకీయ, క్రీడల్లోనే జీవితాంతం వెచ్చించి, తమ రూపం ద్వారానో, ప్రతిభ ద్వారానో తమని తాము ఆవిష్కరించుకుంటారు.

భారతదేశ స్వాతంత్ర్యం అనగానే మహాత్మా గాంధీరూపం కనిపిస్తుంది. క్రికెట్ పేరు చెబితే, సచిన్ టెండూల్కర్ కళ్ళముందు కన్పిస్తాడు. క్వాలిటీ ఆఫ్ లైఫ్‌లో వ్యక్తిత్వానికి విలువలు జోడిస్తే తద్వారా లభించే విజయం చిరస్మరణీయమవుతుంది. 'హవాలా' కుంభకోణం పేరు చెబితే హర్షద్‌మెహతా గుర్తొస్తాడు. వక్రమార్గంపట్టిన క్వాలిటీ ఆఫ్ లైఫ్‌కు ఇతడొక ఉదాహరణ.

"ప్రతికూల ఆలోచనలు నిన్నే చుట్టు ముడతాయి. విలువలతో కూడిన ఆలోచనలు ప్రపంచానికే మేలు చేస్తాయి."

—నార్మన్ విన్సెంట్ పీలే

పిల్లలకి ప్రథమ గురువులు తల్లిదండ్రులే. పిల్లలకు వారు ఇవ్వాల్సింది ఆస్తి కాదు, శాశ్వత విలువలతో విజేతలుగా నిలబెట్టగలిగే 'విలువల సంపద'.

"మీ ఇంట్లో పిల్లలకి ఆధ్యాత్మిక విషయాలు చెబుతుంటారట గదా" అని ఓ ఇంటర్వ్యూలో నటుడు వెంకటేష్‌ను అడిగారు. దానికి ఆయన "ఆస్తి, ఐశ్వర్యం వారసత్వంగా వస్తుంది. నేను 'నేను'గా వాళ్ళకి ఇవ్వగల్గింది మనోవికాసానికి కావల్సిన విలువలు. అవే వాళ్ళ క్వాలిటీ ఆఫ్ లైఫ్‌కి తోడ్పడతాయి" అన్నారు.

**(ఇంకా వుంది)**



# వెరైటీ ప్రేమజంటలు

**చుట్టూ బాలీవుడ్ తారలు.. మీడియా హంగామా.. లెక్కపెట్టలేనన్ని రుచికరమైన వంటకాలు.. అబ్బుర పరిచే అలంకరణతో కూడిన పెళ్లివేదిక.. అతిథులు, ఆత్మీయుల కోలాహలం నడుమ ఓ జంట కల్యాణం కమనీయంగా జరుగుతోంది. బాలీవుడ్ స్టార్స్, మీడియా ఉన్నారంటే ఇదేదో పెద్ద సెలబ్రిటీల పెళ్ళి అనుకుంటే పొరపాటే. నెలకు పట్టుమని పదివేల రూపాయలు కూడా మిగుల్చుకోలేని ఓ సామాన్యుడి పెళ్ళి. ముఖం చూస్తేనే ఒళ్లు గగుర్పొడిచే ఓ యువతి లవ్ మ్యారేజ్. మిస్డ్ కాల్‌తో పరిచయమై మనసులు ఇచ్చిపుచ్చుకున్న నవతరం లైలా మజ్నూల పెళ్ళి! ముఖం కాదు మనసు ముఖ్యమనుకున్న ఆ యువకుడి పెద్ద మనసు మెచ్చి ప్రముఖులంతా ఏకమై ఇద్దరినీ ఒక్కటి చేసేందుకు జరిపించిన కల్యాణం.**

ఉత్తరప్రదేశ్‌లోని అజమ్‌గర్ ప్రాంతానికి చెందిన లలిత బెన్‌బన్సీ.. 2012వ సంవత్సరంలో సొంత అన్న చేతిలోనే యాసిడ్ దాడికి గురైంది. క్షణికావేశంలో అన్న చేసిన తప్పునకు నరకాన్ని అనుభవిస్తోంది. ఒకటి కాదు రెండు కాదు ఏకంగా 17 సర్జరీలు చేసినా ఆమె ముఖాన్ని డాక్టర్లు మామూలు స్థితికి తీసుకురాలేకపోయారు. తనను చూసి ఎవరూ పెళ్ళి చేసుకోరని మానసికంగా సిద్ధమై, తనకు చేతనైన పని చేస్తూ కుటుంబానికి ఆదరువుగా నిలుస్తూ జీవనం సాగిస్తోంది. ఈ క్రమంలో అనుకోని ఓ సంఘటన ఆమె జీవితంలో పెనుమార్పును తీసుకొచ్చింది. బంధువుల కోసం కాల్ చేయగా.. అది కాస్తా ముంబయిలోని సీసీటీవీ ఆపరేటర్‌గా పనిచేసే రాహుల్ కుమార్‌కు వెళ్లింది. రాంగ్ కాల్ అని తెలిసి వెంటనే పెట్టేసినా, కొద్ది సెకన్లపాటు ఆమె మాట్లాడిన మాటలు అతడిని మరో లోకంలోకి తీసుకెళ్లాయి. లలిత మాటల్లోని మాధుర్యానికి రాహుల్ మైమరచిపోయాడు. మళ్లీ అదే నెంబర్‌కు ఫోన్ చేసి మాట్లాడాడు. అలా ఓ మిస్డ్‌కాల్ వారి మధ్య స్నేహాన్ని పెంచింది. ఆ స్నేహం కాస్తా రెండు నెలల్లోనే ప్రేమగా మారింది. తన గురించి అన్ని విషయాలు రాహుల్‌కు చెప్పింది లలిత. చూడటానికి బాగోననీ, తన ముఖం తనకే అసహ్యం వేస్తుందంటూ వేదనతో వివరించింది. అయినా తనకు ముఖం కంటే మల్లెపూవులాంటి నీ మనసు చాలంటూ పెళ్ళికి సిద్ధమయ్యాడు రాహుల్. వీళ్లిద్దరి ప్రేమ, పెళ్ళి విషయం తెలిసి బాలీవుడ్ ప్రముఖ నటుడు వివేక్ ఒబెరాయ్ ఒక ఫ్లాట్‌ను వారికి బహుమతిగా ఇచ్చాడు. ప్రముఖ డిజైనర్లు అబూజానీర, సందీప్ ఖోస్లా వారిద్దరి పెళ్ళి దుస్తులు రూపొందించారు. పలువురు ప్రముఖుల సమక్షంలో ఆ జంట మే 23వ తారీఖున ఒక్కటయింది.



ఇలా రూపురేఖలతో సంబంధం లేకుండా కేవలం మనసు మెచ్చి పెళ్ళి చేసుకున్న వారు వీళ్లిద్దరు మాత్రమే కాదు. లావు, పొట్టి, ఎత్తు, నలుపు, వయసు వంటి వాటితో సంబంధం లేకుండా చూడగానే నచ్చి.. మనసు ఇచ్చిపుచ్చుకున్న జంటలు ఎన్నో ఉన్నాయి. ఆ జంటల వివరాలేంటో, వారి కథేంటో ఓ లుక్కేయండి.

## బామ్మతో ప్రేమాయణం

సాధారణంగా అయితే ఓ పురుషుడు.. తనకంటే వయసు తక్కువున్న అమ్మాయిని పెళ్ళి చేసుకునేందుకు మొగ్గుచూపుతాడు. కొన్ని కొన్ని సందర్భాల్లో అమ్మాయి తనకన్నా ఒకటి రెండేళ్లు పెద్దయినా పెళ్ళికి ఓకే చెబుతారు. కానీ ఒకటి కాదు రెండు కాదు.. తనకంటే వయసులో మూడు రెట్లు పెద్దయిన ఓ అమ్మాయిని... కాదు కాదు ఓ బామ్మను ఓ యువకుడు ప్రేమిస్తున్నాడంటే నమ్మగలరా? ఊహించుకుంటేనే అమితాశ్చర్యాన్ని కలిగించే ఈ వింత అమెరికాలోని జార్జియా రాష్ట్రం, ఆగస్టాలో జరిగింది. కైల్ జోన్స్ అనే 31 ఏళ్ల యువకుడు, 91 ఏళ్ల మార్జోరియో మెక్క్యూల్‌తో ప్రేమాయణం కొనసాగిస్తున్నాడు. ఏకంగా అయిదేళ్లుగా ఆమెతో డేటింగ్ చేస్తున్నాడు. తరచూ డేటింగ్ సైట్లలో చాట్ చేసే కైల్‌కు అనుకోకుండా మెక్క్యూల్ పరిచయం అయింది. అదికాస్తా బంధానికి దారితీసింది. మెక్క్యూల్‌ను తన తల్లికి కూడా పరిచయం చేశాడు కైల్. 50 నుంచి 71 ఏళ్ల వయసు వరకూ ఉన్న అయిదుగురు కొడుకులు ఉన్నా.. ఈ బామ్మ కైల్‌తో తన సెక్సువల్ లైఫ్ కూడా బాగానే ఉందంటోంది. 30 ఏళ్లుగా తాను ఒంటరిగా ఉంటున్నాననీ, కొడుకులెవరూ పట్టించుకోవడం లేదనీ, కైల్ వచ్చాక మనసు కుదుటపడిందనీ ఈ బామ్మ చెబుతోంది.

ప్రేమకు వయసుతో



సంబంధం లేదని కైల్ చెబుతున్నాడు. ఏది ఏమైనా జార్జియాలో ఈ యువవృద్ధ జంట అందరినీ ఆకట్టు కుంటోంది.



## లెక్కలేనంత వ్యత్యాసం

అతడో బాడీబిల్డర్. పేరు అలీ. సోషల్ మీడియాలో ఎప్పుడూ యాక్టివ్‌గా ఉండే ఈ 22 ఏళ్ల యువకుడి స్వస్థలం యునైటెడ్ కింగ్‌డమ్‌లోని స్కాట్లాండ్. ఆన్‌లైన్‌లో కాలిఫోర్నియాలోని శాన్‌జోస్‌కు చెందిన 25 ఏళ్ల యువతి గ్లోరియా షరీ నవాతో పరిచయం అయింది. తనకంటే వయసులో మూడేళ్లు పెద్దయినా ఆమెను ప్రేమించాడు. వయసులో తేడా మూడేళ్లే అయినా ఇద్దరి బరువులో వ్యత్యాసం మాత్రం లెక్కలేనంత! తమ ప్రేమ గురించి తాను నిర్వహిస్తున్న ఓ యూట్యూబ్ ఛానల్లో బయటపెట్టింది గ్లోరియా. అంతే.. లెక్కలేనన్ని విమర్శలను ఎదుర్కోవాల్సి వచ్చింది. 'ఇంత లావు ఉన్న అమ్మాయిని పెళ్ళి చేసుకుంటున్నావ్. నువ్వు ఏమైనా గుడ్డోడివా.. ఆమె ఎలా నచ్చింది అసలు నీకు' అనే కామెంట్స్ కుప్పలు తెప్పలుగా వచ్చిపడ్డాయి. వీటన్నింటికీ చెక్ పెడుతూ 2014వ సంవత్సరంలో వీరిద్దరూ ఒక్కటయ్యారు. తమ పెళ్ళి ఫోటోను సోషల్ మీడియాలో పెడితే.. ఈసారి మాత్రం వైవాహిక జీవితాన్ని ఆనందంగా గడపండంటూ ప్రశంసలు కురిపించారు. పెళ్ళి తర్వాత పనిలో పనిగా గ్లోరియా బరువు తగ్గే పనిలో పడింది.

## వయసులో పెద్ద.. ఎత్తులో చిన్న..

ఒడ్డూపొడుగూ బాగున్నవాళ్లు కనిపిస్తే.. ఆరడుగుల అందగాడు అని పిలుస్తుంటారు. అబ్బాయిలకేనా... మాకు మాత్రం అలా పేర్లు పెట్టరా? అని ప్రశ్నించడానికే అన్నట్లుగా ఓ యువతి 18 ఏళ్లకే ఆరడుగుల ఎత్తు దాటేసింది. బ్రెజిల్‌లోని శాలినోపొలీస్ నగరానికి చెందిన ఎలిసనీ దా క్రూజ్ సిల్వా అనే ఓ మోడల్ ఏకంగా 6.9 అడుగుల ఎత్తు పెరిగి రికార్డు సృష్టించింది. ఎత్తు విషయంలోనే కాదు తన పెళ్ళి వ్యవహారంలోనూ అందరికీ షాకిచ్చింది. తనకంటే పొడవు తక్కువైన ఓ యువకుడితో ప్రేమలో పడింది. 5.4 అడుగుల ఎత్తున్న 23 ఏళ్ల ఫ్రాన్సినాల్డో డా సిల్వా కార్వలోతో మూడేళ్లుగా లవ్‌లో ఉంది. తమ ఎత్తు వల్ల వైవాహిక జీవితంలో ఎదురయ్యే ఇబ్బందులను నవ్వుతూనే ఎదుర్కొనేందుకు ఈ జంట సిద్ధమయింది. ఎలిసనీకి ఉన్న ఓ అరుదైన వ్యాధి వల్ల పిల్లలు పుట్టే అవకాశం లేదని, అందుకే తాము ఓ పాపను దత్తత తీసుకుంటామని చెబుతున్నాడు ఫ్రాన్సినాల్డో.

## ప్రేమను గెలుపొందాడు



అతడు పేరుకే మరుగుజ్జు.. కానీ తనకంటే నాలుగు రెట్లు ఎక్కువ బరువున్న వస్తువులను ఎత్తగలడు. వాహనాలను లాగగలడు. డెన్మార్క్‌కు చెందిన 4.4 అడుగుల ఎత్తున్న 52 ఏళ్ల ఆంటాన్ క్రాఫ్ట్ అనే వ్యక్తి, తాను ఎన్ని రికార్డులను బ్రేక్ చేసినా రాని సంతోషం.. ప్రేమను గెలుపొందడంతో మనసుకు హాయిగా ఉందంటున్నాడు. అబ్బాయిగా పుట్టి అమ్మాయిగా మారిన ఓ ట్రాన్స్‌జెండర్ ప్రేమను అతడు గెలుపొందాడు. 6.3 అడుగుల ఎత్తుండే చినా బెల్ అనే ట్రాన్స్‌జెండర్‌తో డేటింగ్ చేశాడు. ప్రస్తుతం అమెరికాలోని ఫ్లోరిడాలో ఉంటున్న ఈ జంట.. తమ ప్రేమను ఇలాగే కొనసాగిస్తామంటోంది. అనుకోకుండా కలిసిన తాము జీవితాంతం ఒక్కటిగా ఉంటామని ఊహించలేదని చెబుతోంది.

## అనుకోకుండా కలిశారు

అమ్మాయికి ఆకలేయదు.. అబ్బాయికి ఆకలి ఆగదు. తిండి సహించదొకరికి.. మరొకరు తిండి లేకుంటే సహించరు. వెరైటీ వ్యాధితో బాధపడుతున్న ఇద్దరూ ఆసుపత్రికి వెళ్లారు. డాక్టర్‌ను కలిసేందుకు చాంతాడంత క్యూ ఉండటంతో ఇద్దరి మధ్య మాటలు కలిశాయి. మాటలు మనసును కదిల్చాయి. ఒకరిపై మరొకరికి ప్రేమను పుట్టించాయి. ఇదేదో సినిమా అనుకుంటే పొరపాటే. అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో ఓగ్నార్డ్ నగరంలోని పసిఫిక్ షోర్స్ హాస్పిటల్‌లో జరిగింది ఈ యదార్థ సంఘటన. లిజ్జీ ఎల్స్‌బర్గ్ అనే యువతికి అస్సలు ఆకలి వేయదు. కొంచెం తిన్నా వాంతులవుతుంటాయి. అలాగే క్రిస్ గ్లాస్గో అనే యువకుడికి తిండి లేకుంటే అస్సలు నిద్రపట్టదు. రోజుకు అయిదు సార్లు లాగించేస్తాడు. ఇద్దరూ ఆసుపత్రికి వెళ్లిన సమయంలో కలిశారు. డాక్టర్ వద్దకు మాటిమాటికి వెళ్తూ ట్రీట్‌మెంట్ సమయంలో ప్రేమలో పడ్డారు. పెళ్ళి చేసుకున్నారు.

అనుకోకుండా కలిసి ఇలా ఒక్కటైన జంటలు ఎన్నో ఉన్నాయి. ఆదర్శ వివాహాలు చేసుకునే వారు కొందరయితే.. నచ్చి, మనసును మెచ్చి ఏడడుగులూ వేసిన వారు మరికొందరు. ఏదిఏమైనా ప్రేమ గుడ్డిది అనే మాట నిజమని ఎంతో మంది విమర్శించినా.. ప్రేమలో ఉన్నవారికి తమ భాగస్వామిలోని లోపాలు కనిపించవనే మాట అక్షర సత్యమని ఈ జంటలు నిరూపిస్తున్నాయి.

–కె.హసాన్
kandula.hassan@gmail.com






## బొప్పాయితో మతిమరుపు దూరం?

**బొ**ప్పాయితో మతిమరుపు దూరం చేసుకోవచ్చా? అన్న సందేహం అక్కర్లేదు అంటున్నారు పరిశోధకులు. ప్రతిరోజూ ఒక బొప్పాయి పండు తిన్నట్టయితే జ్ఞాపకశక్తి భేషుగ్గా ఉంటుందనీ, మెదడు పనితీరు కూడా మెరుగుపడుతుందనీ అధ్యయనంలో వెల్లడైంది. కొంతమంది మీద వీరు అధ్యయనం నిర్వహించారు. వీరిని రెండు గ్రూపులుగా విభజించి, ఒక గ్రూపు వారికి ప్రతిరోజూ బొప్పాయి పండు ఇచ్చారు. రెండో గ్రూపు వారికి బొప్పాయి పండు ఇవ్వలేదు. కొన్ని రోజుల అనంతరం వీరి మెదడు పనితీరునూ, జ్ఞాపకశక్తిని పరిశీలించారు. ప్రతిరోజూ బొప్పాయి తిన్నవారిలో పై రెండూ మెండుగా ఉండగా, పండు తినని వారిలో జ్ఞాపకశక్తి సన్నగిల్లడాన్ని గమనించారు. ఈ మార్పులకు బొప్పాయి పండే కారణమా అన్న విషయం మీద వీరు ఇంకా పరిశోధనలు నిర్వహిస్తున్నారు.

## కాఫీతో లివర్ కేన్సర్ దూరం?

**కా**ఫీ తాగడం వలన పలు ఆరోగ్య సమస్యలు దూరం అవుతాయన్న సంగతి తెలిసిందే! ఇప్పుడు ప్రతిరోజూ ఐదు కప్పుల కెఫిన్‌రహిత కాఫీ తాగడం వలన లివర్ కేన్సర్ వచ్చే అవకాశాలను 50 శాతం తగ్గించుకోవచ్చన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. సుమారు 20 లక్షల మంది మీద సుదీర్ఘకాలం పరిశోధనలు నిర్వహించారు. వీరిని నాలుగు గ్రూపులుగా విభజించారు. ఒక గ్రూపు వారికి అస్సలు కాఫీని ఇవ్వలేదు. మరో గ్రూపు వారికి ఒక కప్పు కెఫిన్ రహిత కాఫీని ఇచ్చారు. మరో గ్రూపు వారికి మూడు కప్పుల కెఫెన్ రహిత కాఫీ, నాలుగో గ్రూపు వారికి ఐదు కప్పుల కెఫిన్ రహిత కాఫీ ఇచ్చారు. సుదీర్ఘకాలం అనంతరం వీరి ఆరోగ్య స్థితిని పరిశీలించారు. కాఫీని అస్సలు తాగని వారిలో సుమారు ఐదు వేల మంది లివర్ క్యాన్సర్ బారిన పడగా, ఒక కప్పు తాగిన వారిలో 20 శాతం, మూడు కప్పుల కాఫీ తాగిన వారిలో 35 శాతం, ఐదు కప్పులు తాగినవారిలో 50 శాతం లివర్ కేన్సర్ వచ్చే అవకాశాలు తగ్గిన విషయాన్ని అధ్యయనకారులు గమనించారు. కేవలం కెఫిన్ రహిత కాఫీ కారణంగానే ఈ మార్పు కనిపించిందా? మరేదైనా కారణం ఉందా? అన్న విషయం మీద వీరు పరిశోధనలు నిర్వహిస్తున్నారు.



నిద్రలేమి పలు అనారోగ్య సమస్యలకు కారణం అవుతుందన్న సంగతి తెలిసిందే! ఇప్పుడు అదే నిద్రలేమి ప్రాణహాని కలిగిస్తుంది అంటున్నారు అధ్యయనకారులు. రోజుకు ఆరు గంటల కన్నా తక్కువ నిద్ర పోయేవారు గుండె జబ్బులు, పక్షవాతం వంటి సమస్యలతో మరణించే అవకాశం ఉందని వీరు అంటున్నారు. నిద్ర తక్కువపోయే వారిలో మెటబాలిక్ సిండ్రోమ్ సమస్య ఎక్కువగా కనిపిస్తుందనీ, ఊబకాయం, షుగర్ తదితర సమస్యలు వారిలో ఎక్కువగా ఉంటాయని వీరు చెబుతున్నారు. ఈ సమస్యలే వీరి ప్రాణాలను హరిస్తాయని అంటున్నారు. 50 సంవత్సరాల వయస్సు గల 14 వేల మంది నిద్రా సమయాలపై వీరు అధ్యయనాన్ని నిర్వహించారు. ఆరుగంటల కన్నా తక్కువ నిద్ర పోయేవారిలో పదిశాతం మంది పై సమస్యల బారిన పడి ప్రాణాలు పోగొట్టుకుంటున్నారని వీరు స్పష్టం చేస్తున్నారు. నిద్రలేమి అనే సమస్య లేకున్నా, ఊబకాయం, షుగర్ సమస్యలతో మృత్యువాత పడుతున్న వారి సంఖ్యను వీరు పరిగణనలోకి తీసుకోలేదు. వృద్ధాప్యంలో సహజంగానే నిద్రపోయే సమయం తగ్గుతుందనీ, ఆ వయస్సులో కలిగే నిద్రలేమి కారణంగా మృత్యువాత పడేవారి సంఖ్య నామమాత్రంగా ఉంటుందనీ వీరు చెబుతున్నారు.

## నిద్ర తగ్గితే ప్రాణానికి ముప్పే!





## కారంతో ఊబకాయం దూరం?

**కా**రం, మసాలాలు ఆరోగ్యానికి హానికరం అన్నది చాలామంది నమ్మకం. ఇది కేవలం అపోహ మాత్రమే అంటున్నారు పరిశోధకులు. కారం ఎక్కువ తీసుకున్నంత మాత్రాన ఆరోగ్యానికి ఎలాంటి హానీ జరగదనీ, ఊబకాయం తగ్గుముఖం పడుతుందన్న విషయం వీరి పరిశోధనల్లో వెల్లడైంది. అంతే కాకుండా ఊబకాయం వలన వచ్చే పదిరకాల కేన్సర్ల బారి నుంచి తప్పించుకోవచ్చు అని వారు చెబుతున్నారు. ఎలుకల మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. కొన్ని ఎలుకలకు కారంతో కూడిన ఆహారాన్ని ఇచ్చారు. మరికొన్ని ఎలుకలకు మామూలు ఆహారాన్ని ఇచ్చారు. కొన్ని నెలల అనంతరం వీటిని పరిశీలించగా కారం ఎక్కువగా తీసుకున్న ఎలుకల్లో బరువు తగ్గడాన్ని గమనించారు. కారం తినని ఎలుకలు బరువు పెరగడాన్ని గుర్తించారు. కారంతో కూడిన ఆహారాన్ని తీసుకుంటే బరువు తగ్గవచ్చు అన్న విషయాన్ని వీరు నిర్ధారించారు. అయితే కొన్ని రకాల ఆరోగ్య సమస్యలతో బాధపడేవారు మాత్రం దీనికి దూరంగా ఉండాలని వీరు సూచిస్తున్నారు.

—అవినాష్

# అలర్జీ - హోమియో చికిత్స

అలర్జీ అనే పదం మనము సర్వసాధారణంగా ప్రతీ రోజు వింటూ వుంటాము. అలర్జీ అనేది రోగనిరోధక వ్యవస్థకు సంబంధించిన ఒక రుగ్మత. వర్షాకాలం మెరిసే వేడి వేసవి నుండి ఉపశమనం ఇస్తుంది. అలాగే అది పలురకాల వ్యాధులతో ప్రాణాలు తోడేయనూ వచ్చు. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా వర్షాకాలంలో ఒక అలర్జీ సమస్య వేదిస్తుంది. తుమ్ములూ, దగ్గులే కాదు ఒక్కోసారి శ్వాసతీసుకోవడము కష్టమవుతుంది. ఈ జలుబు మరియు దగ్గు సహజంగా వైరల్ జ్వరాలకు దారితీస్తుంది. ఈ వర్షాకాలంలో ఆస్తమా, అలర్జీ, బ్రాంకైటీస్, ఫ్లూ వంటి వ్యాదులు ఎక్కువ చూస్తాము. మన అధునిక జీవనం, పారిశ్రామిక ప్రాంతాలలో మరియు పెద్ద పట్టణాలలో వాతావరణ కాలుష్యం ఈ అలర్జీ ఒక పెద్ద కారణం.

అలర్జీతో ఇబ్బందులు పడేవారి బాధ వర్ణనాతీతం. వయసుతో నిమిత్తం లేకుండా చిన్నా, పెద్దా అందరు శ్వాసకోశ అలర్జీలను కలిగించే వాటిలో ప్రధానమైనవి. అలర్జీతో బాధ పడేవారిలో ఏదో ఒక ప్రత్యేకమైన పదార్థానికి దగ్గరగా వచ్చినప్పుడు శరీరంలోని రక్తంలో ఉండే ఇమ్యూనోగ్లోబిన్-ఇ అనే యాంటీబాడీస్ తో అలర్జిన్ కలవడం వల్ల హిస్టమిన్ విడుదల వుతుంది. దీని వలనే వ్యాధి లక్షణాలు ప్రారంభ మవుతాయి. మనిషి శారీరకతత్వము, వాతావరణం, వంశపారంపర్య చరిత్ర, గాలి, నీరు, ఆహారం వీటిలో కలిగే మార్పులు, కలుషితం వలన రక్తంలో జరిగే మార్పుల వలన ఈ అలర్జీ కొందరికి కొన్ని పదార్థములు, కొన్ని వస్తువులు అలర్జీ కారణం అవుతాయి.




**కారణాలు:** 1.దుమ్ము, పుప్పొడి రేణువులు. 2. పెంపుడు జంతువుల వెంట్రుకలు 3. ఘాటు వాసనలు, చల్లటిగాలి. 4. శీతలపానియాలు, ఐస్క్రీమ్‌లు. 5.వంశపారం పర్యం. 6.మస్కిటో రిపెల్లెంట్స్. 7.వాతావరణ మార్పులు.

**లక్షణాలు:** తుమ్ములు, ఆయాసం, శ్వాసలో ఇబ్బందులు, వాంతులు, ఉబ్బసం, ముక్కు కారడం, ఎర్రని దద్దుర్లు, కళ్ళు దురద, కంటిపోర గుచ్చు కోవడం.

**వ్యాధి నిర్ధారణ:** సి.బి.పి, ఈఎస్ఆర్, ఇసినోఫిల్ కౌంట్ (ఏఈసీ), ఐజీ.ఈ.యాంటీబాడీస్, ఎక్సరే, ఫల్మనరీ ఫంక్షన్‌టెస్ట్, సిటీస్కాన్, అలర్జిక్‌ప్రొఫైల్.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

**హోమియోచికిత్స:** హోమియోపతిలో అలర్జీ నుంచి పూర్తిగా ఉపశమనంకలిగించే మందులు ఉన్నాయి. హోమియోచికిత్సతో అన్ని రకాల అలర్జిక్ సమస్యలు దూరమవుతాయి. హోమియోపతిలో అలర్జీకి మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. రోగ నిరోధక శక్తిని పెంచి వ్యాధి నివారణ త్వరితంగా అయ్యేలా చేయడం జరుగుతుంది. అలర్జీ ఏ కారణం వలన వస్తుంది. ఎంత తీవ్రంగా వుంది, తీవ్రతను బట్టి మందులు ఇవ్వబడుతాయి. దీనికి హోమియోలో ఆర్సనిక్ ఆల్బ్, రస్టాక్స్, బెల్లడోన, ఆర్టికమురిన్స్, ఆరమ్‌డైఫిలమ్, ఇప్రెసియా, ఆలెయంసెప మొదలగు మందులు ఉన్నాయి. వీటిని అనుభవజ్ఞులైన డాక్టర్ పర్యవేక్షణలో వాడితే అలర్జీ సమూలంగా తగ్గిపోతుంది.

www.starhomeopathy.com | తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక । దుబాయి । లండన్ । మాంచెస్టర్ | ✆ 90300 64224

# మహిళల్లో సంతానలేమి ఆధునిక పరిష్కార మార్గాలు

**సంతానం అనేది స్త్రీలకు దేవుడిచ్చిన వరం, కానీ ప్రస్తుతం చాలా మంది స్త్రీలు కొన్నిరకాల కారణాలువలన 'సంతానలేమి' సమస్య తో బాధపడుతున్నారు. మనసమాజం ఆధునికతను సంతరించు కుంటున్నకొద్దీ ఎంతోమంది దంపతులు "సంతానలేమి" సమస్య ను ఎదుర్కొంటున్నారు. దీనికికేవలం శారీరక వ్యాధులు, లోపాలే కాదు, మారుతున్న జీవనశైలి, ఆహారపు అలవాట్లు, రాత్రివేళ ఉద్యోగాలు, మానసిక ఒత్తిడి వంటివి గణనీయమైన పాత్ర పోషిస్తున్నాయి. అయితే ఆధునిక విజ్ఞానం పెరిగిన ఈ రోజుల్లో సంతానలేమికి చక్కటి పరిష్కారాలు అందుబాటులో ఉన్నాయి కనుక ఆందోళన చెందవలసిన అవసరం లేదు అంటున్నారు మన ఫర్టీ 9 హాస్పిటల్ వైద్యులు డా॥ సి.జ్యోతి.**

అసలు సంతానలేమి అంటే ఆరోగ్యవంతులైన దంపతులు ఎటువంటి గర్భనిరోధక పద్ధతులు పాటించకుండా ఏడాది పాటు దాంపత్యజీవనం సాగించినా పిల్లలు కలగపోవటాన్ని 'సంతానలేమి'అంటారు. దీనికి కవలం స్త్రీలనునిందించటం సర్వసాధారణం. కానీ నిజానికి స్త్రీ, పురుషులిద్దరూ సమాన భాగస్వాములే. **స్త్రీలలో సంతానలేమిని 2 రకాలుగావిభజించ వచ్చు:** 1.ప్రైమరీ ఇన్‌ఫెర్టిలిటీఅంటే స్త్రీ ఏడాదినుండి రెండేళ్ల పాటు సాధారణ లైంగిక జీవితం గడిపినప్పటికీ గర్భం ధరించ కపోవటం. 2. సెకండరీ ఇన్‌ఫెర్టిలిటీ అంటే స్త్రీ సాధారణ లైంగిక జీవితం గడపటంవలన ఒకసారి గర్భ ధారణ జరిగి, పిల్లలు కలిగినా లేదా గర్భస్రావమై, రెండవ సారి గర్భధారణ జరగక పోవటం. **స్త్రీలలో సంతానలేమికి గల కారణాలు: స్త్రీ ప్రత్యుత్పత్తి వ్యవస్థలోలోపాలు:** అవి ముఖ్యంగా 1. చిన్న గర్భ సంచి ఉండటం (ఇనెఫాంటైల్ యుటి రస్) లేదా అసలు గర్భ సంచి లేకపోవటం. 2.రెండుగదులు గా ఉండే గర్భసంచి ( బైకార్న్ మేట్ యుటిరస్ ) 3.యోని మార్గం చిన్నగాఉండటం లేదా మూసుకుపోవటం 4.ఫాలో పియన్‌ట్యూబ్స్ మూసుకు పోవటం. **బీజవాహికలలో లోపాలు:** 1. సాల్పింజైటీస్-ఇది బీజ వాహికల్లో వచ్చేవాపు. 2. హైడ్రో సాల్పింక్స్-దీనిలో బీజవాహిక లు ద్రవంలో నిండి మూసు కుపోతాయి. ఇది ముఖ్యంగా గర్భసంచి ఇన్‌ఫెక్షన్‌ల వల్ల ముఖ్యంగా టీ.బి, లైంగికంగా సంక్రమించే వ్యాధుల వల్ల వస్తుంది. 3.ఎక్టోపిక్‌ప్రెగ్నెసీ **హార్మోన్ సమస్యలు:** 1.థైరాయిడ్, మధుమేహంవంటివి. 2.ఎఫ్.యస్.హెచ్, ఎల్.హెచ్, వంటివి ప్రోలాక్టిన్ వంటి హార్మోన్ల అసమతుల్యత 3. పి.సి.ఒ.డి 4. ఎ.ఎమ్.హెచ్ వంటి హార్మోన్స్ స్థాయిలు తగ్గటం వలన కూడా సంతానఅవకాశాలుతగ్గుతాయి.5.అండా శయంలో కణుతులు లేదాపాలిసిస్టిక్ ఓవరీస్ వంటివి. **యోని, గర్భ సంచిలో లోపాలు:** మహిళల్లో సంతానలేమి సమస్యలకు 5% కారణాలు దీనికి సంబంధించినవే. 1. ఎండోమెట్రియా సిస్ 2. గర్భసంచిలో కణితులు ఏర్పడటం (యుటిరైన్ ఫైబ్రాయిడ్స్)పాలిప్స్, సర్వైకల్ ఫైబ్రాయిడ్స్, ఎడినోమయోసిస్ వంటివి. 3.యోనిలోఉండే మ్యూకస్‌పొర అధికఆమ్ల గుణాన్ని కలిగి ఉండటంవలన కూడా శుక్రకణాలుచనిపోవటంవంటివి సంతానలేమికి కారణాలు. 4.గర్భసంచికి సోకే టీ.బి. లైంగికం గా సంక్రమించే వ్యాధులు ( ఎస్.టీ.డిస్ )గర్భసంచి ఇన్‌ఫెక్షన్స్. **ఇతర కారణాలు:** 1.వయసు, అధిక బరువు, 2. స్త్రీలలో 30 సంవత్సరాల వయసు దాటిన తర్వాత గర్భందాల్చేఅవకాశాలు తగ్గుతాయి. వయసుతో పాటు అండాల ఉత్పత్తి తగ్గటం, హార్మోన్స్ స్థాయిలలో తేడాలు కూడా అధిక గర్భస్రావానికి అవకాశా లను పెంచుతాయి. వయసు పెరిగిన కొద్ది సంతాన అవకాశా లు తగ్గుతాయి. 3.కొన్నిసార్లు ఎటువంటి కారణం లేకుండా కూడా సంతానలేమి ఉంటుంది. ఇటువంటి వారికి కృత్రిమ పద్ధతుల ద్వారా చికత్స చేస్తారు. **స్త్రీలలో సంతానలేమికి నిర్ధారణ పరీక్షలు:** 1. థైరాయిడ్ పరీక్షలు, హార్మోనల్ ఎస్సే (ఈస్ట్రోజన్,ప్రొజెస్టిరాన్,ఎఫ్.సి.హెచ్, ఎల్.హెచ్, ప్రోలాక్టిన్ వంటివి). 2.అల్ట్రాసౌండ్‌పెల్విక్‌స్కానింగ్. 3. ఫొలిక్యు లార్ స్టడీ 4.హిస్టిరో సాల్పింజియోగ్రమ్(హెచ్.ఎస్.జి) 5.డయా గ్నోస్టిక్ లాప్రోస్కోపి వంటివి. **వీటికిచేయదగినచికిత్సలు:** ఇందులో ముఖ్యమైనవి 1.హార్మోన్ థెరపీ 2. ఐ.యు.ఐ 3. ఐ.వి.ఎఫ్ 4.ఇక్సీ 1.హార్మోన్‌థెరపిలోమందులద్వారా ఋతుచక్రసంబంధ లోపాలను సవరించవచ్చు, అండాల విడుదలను ప్రేరేపించ వచ్చు. 2.లాప్రోస్కోపిక్ సర్జరీ ద్వారా అండాశ యంలోని నీటి తిత్తులను (పిసిఒడి) ని సవరించవచ్చు. 3. ఐ.యు.ఐ. దీనిలో పురుషుల్లోని శుక్రకణాలను నేరుగా స్త్రీ గర్భశయంలోకి ప్రవేశపెడతారు. దీన్ని అండం విడుదలజరిగినపుడు చేయడం ద్వారా గర్భధారణకి అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. దీన్ని ఎక్కువగా వీర్యకణ లోపాలు ఉన్నపుడు, స్త్రీలలో బీజవాహిక లలో సమస్యలు ఉన్నపుడు సూచిస్తారు. దీన్ని 6నుంచి 10 రుతుచక్రాలు ప్రయత్నించవచ్చు. అంతేకాక ఇది తక్కువ వ్యయం కూడా. 4. ఐ.వి.ఎఫ్. దీన్ని"టెస్ట్‌ట్యూబ్‌విధానం" అంటారు. దీనిలో స్త్రీ అండాన్ని పురుషుడి శుక్రకణాన్ని లేబరేటరీ లో ఫలదీకరణం చెందించి తిరిగి స్త్రీ గర్భాశయం లోకి ప్రవేశపెడతారు. దీన్ని ఎక్కువగా స్త్రీలలో ట్యూబులు మూసుకున్న వారికి, శుక్రకణాల సంఖ్య కదలికల్లో లోపాలు మగవారిలో ఉన్నపుడు, దంపతుల వయసు ఎక్కువగా ఉన్న పుడు సూచిస్తారు. 5. ఇక్సీ, దీన్ని ఐ.వి.ఎఫ్ సత్ఫలితాలను ఇవ్వ నిసందర్భంలో ఉపయోగిస్తారు. ఇందులోశుక్రకణాలనుకృత్రిమ పద్ధతి ద్వారా అండంలోకి ప్రవేశపెట్టి ఫలదీకరణం చెందిస్తారు. అలా ఫలదీకరణం చెందించిన దాన్ని తిరిగి స్త్రీ గర్భాశయంలోకి ప్రవేశపెడతారు. ఇటువంటి అత్యాధునిక చికిత్సల ద్వారా సంతానలేమికి మంచి పరిష్కారాన్ని పొందవచ్చు. "**ఫర్టీ 9 హాస్పిటల్**" లో నిపుణులైన వైద్యులు పరీక్షలు నిర్వహించి, మీ సమస్యలకు తగిన సంతాన సాఫల్య చికిత్సలను సూచిస్తారు. దీని ద్వారాఎంతో మంది దంపతులు సంతాన భాగ్యాన్ని పొందుతున్నారు.

**- డా॥ సి.జ్యోతి** ఫెర్టిలిటీ స్పెషలిస్ట్
ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం

ADVT

✆90300 15588 | సికింద్రాబాద్ । కూకట్‌పల్లి । మదాపూర్ । వరంగల్ | www.ferty9.com

# వెట్టి (ది వారియర్)

-మధుబాబు




**తీరుబడిగా కూర్చుని ఉన్న ప్రణవి ఛెంగునలేచి తను కూడా బయటికి తొంగిచూసింది. కారణం అక్కడ ఉన్న వారెవరికీ, ప్రత్యూషకి తప్ప మరెవ్వరికీ తెలియలేదు. కుంకుమ అద్దినట్టు ఒక్కసారిగా ఎరుపెక్కాయి ఆమె బుగ్గలు. గబుక్కున వెనక్కితిరిగి కుర్చీలో కూర్చుండి పోయింది.**

**'అత్తమ్మా...' ఉన్నట్లుండి పిలిచింది శివారెడ్డి భార్య.**

**'ఏమిటే పిల్లా? మళ్ళీ ఆ వీరభోజుడు లోపలికి వస్తున్నాడా?' కుర్చీలో నుంచి కదలకుండానే అడిగింది పిచ్చమ్మ.**

'వాడు కాదు. ఊళ్ళో పెద్దలు... పోలీసులు కూడా' స్వల్పంగా వణకటం మొదలుపెట్టిన కంఠంతో అన్నది శివారెడ్డి భార్య.

యదార్థం కానిది ఏమీలేదు ఆమె మాటల్లో. బిలబిలలాడుతూ వచ్చేశారు అనేకమంది. 'శివారెడ్డి సారూ... మీ తండ్రిగారు పోయి చాలా కాలం అయినా, ఆయన మీద కేసు బుక్ చేయమని బాజిరెడ్డి కంప్లయింట్ ఇచ్చాడు. చౌడేశ్వరి గుడిలో పూజారి కూతుర్ని చెరిచి ఆమె మరణానికి కారకుడు మీ తండ్రిగారేనని అంటున్నాడు' దూరంగానే నిలబడి నెమ్మదిగా అన్నాడు ఒక ఆఫీసరు.

'ఇప్పుడు జరుగుతున్న అన్యాయాలను గురించి పట్టించుకోని మీరు, ఎప్పుడో జరిగిన విషయాన్ని గురించి అడగటానికి వచ్చారా?' గది గుమ్మం దగ్గరికి పోయి ఖంగుమంటున్న కంఠంతో అడిగింది పిచ్చమ్మ.

'అది కాదు తల్లీ... ఇది దైవకార్యానికి సంబంధించిన విషయం.. తేడా అంటూ వస్తే మన జనంలో తీవ్రమైన ఆందోళన ప్రారంభం అవుతుంది. అందుకే క్లారిఫికేషన్ కోసం వచ్చాము' వెంటనే అన్నాడు ఆఫీసరు.

కనులు చిట్లిస్తూ ఏదో చెప్పబోయింది పిచ్చమ్మ. ఆమె కంటే ముందుగా తను మాట్లాడాడు అంతవరకూ మౌనంగా అక్కడి పరిస్థితులన్నిటినీ గమనిస్తున్న అమెరికా పెద్దమనిషి.

'మాది చిత్తూరు. అమెరికాలో నేను, నా పెద్దకొడుకు ఇటువంటి లీగల్ వ్యవహారాల్ని చూసే సంస్థని నడుపుతున్నాము' అంటూ కోటు జేబులో నుంచి ఒక అందమైన విజిటింగ్ కార్డుని తీసి ఇచ్చాడు.

ఆ కార్డు మీద ప్రింట్ అయి ఉన్న మేటర్ని చదివేసరికి, కొంచెం వివర్ణమైంది ఆ అధికారి వదనం.

'సార్... ఇది చాలా చిన్న విషయం. మీవంటివాళ్ళు వచ్చి మాట్లాడేంత పెద్దది కాదు. క్లారిఫికేషన్ కోసం మాత్రమే వచ్చాము. కేసులు బుక్ చేయటానికి కాదు' తత్తరపడుతూ చెప్పాడు.

'చిన్న విషయమే – ఎప్పుడో ఏదో జరిగిపోయిన దాన్ని తిరిగి తవ్వి తెలియని వాళ్ళకి కూడా తెలిసిపోయేటట్టు చేయబోతున్నారు మీరు. తప్పు జరిగిం

## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. గ్రానైట్‌మైన్స్ వారినుంచి తప్పించుకుని పిచ్చమ్మి కుటుంబంలోకి అడుగు పెడతాడు. ఆ కుటుంబంలోని సమస్యలన్నిటికి చౌడేశ్వరి ఆత్మశిల స్థానభ్రంశం చెందడమే కారణమని తెలుసుకుంటాడు. అడవిలో ఆత్మశిల కనిపిస్తుందతనికి. ఇంతలో పఠాన్‌కి, ప్రణవికి తెల్లారితే పెళ్ళని అనౌన్స్ చేస్తాడు బాజిరెడ్డి. జరగబోయే పరిణామాలు ఆగాలంటే ఆత్మశిలను యథాస్థానంలో ఉంచాలని భావించి, బాబీతో పాటు అడవిలోకి బయలుదేరతాడు వెట్టి. ఆత్మశిలను బాబీకిచ్చి చౌడేశ్వరి గుడి దగ్గరికి పంపిస్తాడు. హైమారెడ్డి ఎస్టేటుకు వచ్చి పెళ్ళి జరగకుండా రకరకాల ప్రయత్నాలు చేస్తుంటాడు. ఈలోపు బాజిరెడ్డి జరిగినదంతా అక్కడి వాళ్ళకు చెప్పేస్తాడు. గుడి దగ్గరికి వచ్చిన బాబీని పాములన్నీ చుట్టుముడతాయి. వెట్టి గుడి దగ్గరకు చేరుకుంటాడు.

ఆ తర్వాత...

దని మీకు కంప్లయింట్ వచ్చింది. తప్పుచేసిన మనిషి కాలం చేశాడు. తప్పుకు గురి అయిన బిడ్డ కూడా ఇప్పుడులేదు. క్లారిఫికేషన్ ఎవరికి? ఎవరు అడిగారు?' సూటిగా అడిగాడు అమెరికా పెద్దమనిషి.

'అదీ... బాజిరెడ్డి సారు...' అంటూ మొదలు పెట్టబోతుండగా, 'వాడు ఎవడు? వాడికీ ఈ మేటర్‌కీ ఏమిటి సంబంధం? చుట్టమా పక్కమా బంధువా?' అడిగాడు ఆ పెద్దమనిషి.

'అదేంటి సార్? రెస్పాన్సిబిలిటీ ఉన్న ఒక సిటిజన్' కోపంగా అన్నాడు ఆ ఆఫీసర్.

'అబ్బో... ఇప్పటివరకూ మేము చూసినంతవరకూ అతగాడు చాలా రెస్పాన్సిబుల్‌గా మాట్లాడాడు. ఈ శివారెడ్డి చెల్లెల్ని తన కొడుక్కు ఇచ్చి పెళ్ళి చేసి ఉంటే, ఈ సోషల్ రెస్పాన్సిబిలిటీ బయటికి వచ్చేదే కాదు. అది జరగక పోయేసరికి న్యాయం ధర్మం అంటూ మాటలు మొదలు అయ్యాయి' వెక్కిరింపుగా అన్నాడు ఆ పెద్దమనిషి.

'సార్.. మాకు కంప్లయింట్ వచ్చింది. మేము విచారించి తీరాలి' మొండిగా అన్నాడు ఆ అధికారి.

'తప్పు జరిగినప్పుడు ఆ తప్పుకు బలైన బిడ్డకు బంధువులు ఎవరూ లేరా?' అడిగాడు ఆ పెద్దమనిషి.

'లేకపోవటమేమిటి సారూ... ఆ బిడ్డ తండ్రి... పిచ్చిపూజారి ఉన్నాడు' చటుక్కున చెప్పాడు పోలీసులతో వచ్చిన నగర ప్రముఖుడు ఒకతను.

'వెరీగుడ్! అతన్ని వెంటనే పిలిపించండి. పంచాయితీ మొదలుపెట్టే ఉద్దేశం మీకు ఉంటే, అతను ఖచ్చితంగా వచ్చి మాట్లాడి తీరాలి' చెప్పాడు అమెరికా పెద్దమనిషి.

శివారెడ్డి తండ్రిగారి పేరు చెవులపడితే పిచ్చిపూజారి నోటివెంట ఎటువంటి మాటలు వస్తాయో తెలిసిన రమణయ్య పంతులుగారి ముఖం వివర్ణం అయింది.

'మాకు కొన్ని పద్ధతులున్నాయి. ఆయన్ని తర్వాత విచారిస్తాము. ముందు శివారెడ్డిని...' మరింత మొండిగా అనబోతున్న ఆఫీసర్‌ని చేయెత్తి అపాడు సబ్బిరెడ్డి.

అమెరికా పెద్దమనిషి మాట్లాడిన మాటల్ని వినగానే తను ఏం చెయ్యాలో అతనికి బాగా తెలిసి వచ్చింది కాబోలు... 'ఆఫీసర్ గారూ, నేను ఎవరినో మీకు తెలుసు. చందనం దుంగల్ని అక్రమంగా తరలిస్తున్నప్పుడు బాజిరెడ్డి కొడుకును నేను రెడ్‌హాండెడ్‌గా పట్టుకున్నాను. ఏదో పాపమని జాలితో స్టేషన్ బెయిల్ ఇచ్చాను. బెయిల్ కండీషన్ల ప్రకారం ఇప్పుడు అతన్ని తిరిగి తీసుకుపోవాలి. అతని తండ్రిని కూడా విచారించాలి కాబట్టి, తనను కూడా తీసుకుపోతాను' అంటూ తన గార్డుల వైపు చూసి 'వాన్ ఎక్కించండి ఇద్దరినీ' అని ఆర్డర్ ఇచ్చాడు.

'ఆగండి. దయచేసి ఆగండి. ఇప్పుడు బాజిరెడ్డి సారు లేకుండా ఈ ఎంక్వయిరీ నడపటం ఇంపాజిబుల్' హడావుడిగా



అన్నాడు ఇన్‌స్పెక్టర్.

'మాది మీకంటే ముందుగా బయటపడిన కేసు. మేమే ముందుగా కదలాలి. కావాలంటే మీరు కోర్టుకు పోయి పర్మిషన్ తెచ్చుకుని వాళ్ళని బయటికి తెచ్చుకోండి' మొండిగా అన్నాడు సబ్బిరెడ్డి.

'ప్లీజ్! గివ్ మీ టెన్‌మినిట్స్... నేను బాజిరెడ్డి సారుకు చెప్పి...' అంటూ సబ్బిరెడ్డి తల అడ్డం తిప్పటంతో నిస్సహాయంగా నిలబడిపోయాడు ఆ పోలీస్ అధికారి.

'పెద్దలు చాలామంది వచ్చారు. ఇది శివారెడ్డి వంశప్రతిష్ఠకు సంబంధించిన సమస్య. తేడావస్తే చాలా ప్రొబ్లమ్స్ ఎరైజ్ అవుతాయి. పిచ్చిపూజారిని పిలిపించడమే బెస్ట్ అని నా అభిప్రాయం. మరి మీ ఉద్దేశం ఏమిటి?' పోలీసులతో వచ్చిన ప్రముఖుల్ని అడిగాడు సబ్బిరెడ్డి.

తలలు ఊపారూ అందరూ. 'అలాగే చేయండి' ఒకేసారి అన్నారు.

'ఇదిగో సబ్బిరెడ్డి సారూ... ఆ పూజారిని గనుక పిలిపిస్తే పెనం మీది నుంచి పొయ్యిలో పడిపోయినట్టు అవుతుంది. ఆయనకి...' అంటూ తన భయాన్ని సబ్బిరెడ్డి చెవిలో ఊదాడు రమణయ్యపంతులు.

'అది జరుగుతుంది ఇది జరుగుతుంది అని భయపడుతూ ఉండటం వల్లే ఆ బాజిరెడ్డి బరి తెగించి మాట్లాడుతున్నాడు. భరించటం ఇక అనవసరం.' అంటూ పిచ్చమ్మి వైపు చూసి, 'ఏమంటావ్ అత్తమ్మా?' అడిగాడు సబ్బిరెడ్డి.

'నిజమే సబ్బిరెడ్డీ... ఎంతకాలం ఈ చిత్రహింస? పిలిపించండి' ఖంగుమంటున్న కంఠంతో చెప్పింది ఆమె.

ఇద్దరు నగర ప్రముఖులు తనవెంట వస్తూ ఉండగా పోలీస్ అధికారి బయటికి వెళ్ళిపోయాడు పిచ్చిపూజారి కోసం.

***

బాబీ నిలబడిన ప్రదేశానికి ఆరు అడుగుల దూరంలో బండి దిగి స్టాండు వేశాడు వెట్టి. 'అన్నయ్యా విరుగుడు పొద ఎక్కడైనా ఉందేమో చూసి వస్తాను' అంటూ పరిగెత్తబోయిన బండోడిని కదలకుండా చెయ్యిపట్టుకుని నిలబెట్టేశాడు.

'పాములు అన్నయ్య... ఒకటి కాదు రెండు కాదు. అన్యాయం అయిపోతాము' బాబీ మీద ఉన్న కాలనాగుల్ని చూస్తూ భయంగా అన్నాడు బండోడు.

'మరేం ఫరవాలేదు. ఆ తల్లి తను స్వయంగా చూసుకుంటోంది. అబ్బయ్య చెప్పినట్టు చెయ్యి' అంటూ వినవచ్చింది ఒక కంఠం.

అదిరిపడి వెనక్కి చూసిన బండోడికి కనిపించాడు అతని తండ్రి. అతని పక్కనే రాయుడిపల్లి రవీంద్ర కూడా కనిపించాడు.

ట్రాక్టర్లని, టూ వీలర్స్‌ని, రవీంద్ర వెహికల్‌ని రోడ్డు మీదే వదిలి, గుంపులు గుంపులుగా వస్తున్న రాయుడిపల్లి జనం కూడా కనిపించారు.

'ఏదో జరగబోతోందని అనిపించింది. మీ అక్కమ్మకి అదేపనిగా పెద్ద పాము సరాసరి వంట ఇంట్లోకి వచ్చి మరీ కనిపించింది. ఉండబట్టలేక ముందుగా మేము వచ్చాము. మన ఊరి ఆడవాళ్ళందరూ వెనకాల వస్తున్నారు' తన బావమరిదికి చెప్పాడు రవీంద్ర.

అదే పనిగా తడిసిపోతున్నాయ్ పిచ్చిపూజారి కళ్ళు. 'తల్లీ... నా మాటలే నిలబెట్టావు. నీ మీద నమ్మకం ఉన్న జనం వచ్చేశారు. నీకు పూర్వవైభవం వచ్చేసింది. రా తల్లీ... నీ ఇంటికి తీసుకు పోతాము..' అంటూ చేతులు జాచాడు ఇంకోసారి.

మళ్ళీ బుస్సుమన్నాయి పాములన్నీ. కోరలు కనిపించేటట్టు నోళ్ళు తెరిచాయి. 'ఆ చోటు చూపించండి. మా బాబీ తీసుకువచ్చి దింపుతాడు' అన్నాడు వెట్టి.

'రహస్యం రా! అది చాలా పెద్ద రహస్యం... పరాయి వారెవరికీ తెలియకూడనిది' అన్నాడు పూజారయ్య.

'తెలిసీ తెలియని తనంతో ఎవరైనా గుడ్డిగా పుట్టల మధ్యకు పోతే లేనిపోని ప్రమాదాలు ఎదురు కావచ్చని, గతంలో పెట్టబడి ఉంటుంది ఆ నియమం. ఇప్పుడు అందరికీ అంతో ఇంతో లౌకికజ్ఞానం అలవడింది. ఇక మీదట రహస్యాలు అవసరం లేదు. మీరు దారి చూపించండి. నా మాట నిజమో కాదో తెలుస్తుంది' అన్నాడు వెట్టి.

**పుట్టల మధ్యకు బయలుదేరాడు పిచ్చి పూజారి. ఆత్మశిలను గట్టిగా పట్టుకుని అతని వెనకే వెళ్ళాడు బాబీ. పాములన్నీ పుట్టలమీదికి ఎక్కి గౌరవ వందనాలు చేస్తు న్నట్టుగా పడగలు విప్పాయి. మట్టి అరుగు వద్దకు చేరుకున్నారు. ఆత్మశిలను అరుగు మధ్యలో నిలబెట్టి, విరుచుకుపడి పోయాడు బాబీ. బాబీకేమయింది? ఆ తరువాత ఎలాంటి పరిణామాలు జరిగాయి?**

అయిష్టంగానే కదిలి పుట్టలమధ్యకు బయలుదేరాడు పిచ్చిపూజారి. వెనుకే నడిచాడు బాబీ. బుల్లెట్‌ని చూసి పక్కలకు పారిపోయిన పాములన్నీ పుట్టల మీదికి ఎక్కి మళ్ళీ గౌరవ వందనాలు చేస్తున్నట్టు పడగలు విప్పాయి.

'భయంగా ఉంది అన్నయ్యా' వణుకుతున్న కంఠంతో వెట్టికి చెప్పాడు బాబీ.

'ఓరి పిచ్చోడా... నీ ఒంటి మీద ఉన్న వాటికంటే గొప్పవి కావు అవి. వాటినే భరిస్తున్న నీకు అవి ఒక లెక్కా?' అడిగాడు అతను.

నవ్వేశాడు బాబీ. 'నా బతుకు ఇలా తయారవుతుందని నిన్న పొద్దున వరకూ నేను అనుకోలేదు. భలేగా ఉంది అన్నయ్య. ఇటువంటి అనుభవం వెయ్యి జన్మలెత్తినా ఎవరికీ కలగదు' అన్నాడు.

'ఇప్పటిదాకా నన్ను ఫుట్‌బాల్ ఆడుకుంది ఈ దేవత. బోరు కొట్టింది కాబోలు నిన్ను పట్టుకుంది. ఇక మీదట నీ బతుకు బొమ్మలాటే' నవ్వుతూ అని, బాబీ ఒంటి మీది పాములన్నీ తనకేసి బుస్సుమనటంతో ఎగిరి వెనక్కిదూకాడు వెట్టి.

పుట్టల మధ్యన ఉన్న మట్టి అరుగు దగ్గరికిపోయి, పెద్దకంఠంతో మంత్రాలు మొదలుపెట్టాడు పిచ్చి పూజారి. 'అభిషేకం చేయాలి. నీళ్ళు కావాలి... పంచామృతాలు కావాలి.. ఏవి?' అడిగాడు మధ్యలో.

'అవన్నీ తర్వాత వస్తాయి. ముందు అమ్మవారిని కింద కూర్చోబెట్టండి' అన్నాడు వెట్టి.

ముందుకు వంగాడు బాబీ. అంతే. అతన్ని చుట్టుకుని ఉన్న పాములన్నీ జరజరా కిందికి జారి మట్టి అరుగు వెనక్కి వెళ్ళిపోయాయి.

అరుగు మధ్యలో చిన్న పల్లపు ప్రదేశం ఉంది. తను గుండెలకు ఆనించుకుని తీసుకువచ్చిన శిలను ఆ ప్రదేశంలో నిలబెట్టి నమస్కారం చేసి విరుచుకు పడిపోయాడు బాబీ.

చటుక్కున అతన్ని పట్టుకుని పుట్టలకు దూరంగా పరుగుతీశాడు వెట్టి.

***

'ఇంతమంది జనం నా ఇంటికి వచ్చి చాలాకాలం అయింది. ఇప్పటివరకూ ఎవరికీ సరైన మర్యాదలు జరగటం లేదు' ఉన్నట్లుండి ఖంగుమంటున్న కంఠంతో అన్నాడు శివారెడ్డి.

'రాజీ..' అంటూ భార్యను పిలిచాడు.

మూడే మూడు అంగల్లో వచ్చి పక్కన నిలబడింది ఆమె.

'ఫలహారాలు చేయించు. టీలు, కాఫీలు పెట్టించు' ఆర్డర్ ఇచ్చాడు.

'అన్నీ నువ్వు చెప్పినట్టే జరుగుతాయి. నువ్వు స్థిమితంగా కూర్చో' తను కూడా ఇవతలికి వస్తూ చెప్పింది పిచ్చమ్మి.

అయిష్టంగానే చేయించుకున్న అలంకరణలన్నిటినీ తీసి అవతల పడేసి, తాను ధరించే జీన్స్ పాంట్, టీ షర్ట్ వేసుకుంది ప్రణవి.

'కొంచెం నిదానించు. అవతల చాలామంది పెద్దలున్నారు. బాగోదు' అంటున్న ప్రత్యూష మాటలు వినిపించుకోకుండా తను కూడా హాల్లోకి వచ్చేసింది.

'ప్రణవీ.. నువ్వు తొందరపడకు. నిదానించు' అంటూ ప్రత్యూష ఎంత ఆపినా ఆగకుండా సూటిగా హైమారెడ్డి దగ్గరికి పోయింది.

'రాత్రి మా విఠల్‌బాబు మాకు ఒక ఫోటో చూపించాడు. అది మీ అబ్బాయిదే అనుకుంటున్నాను. అవునా కాదా?' అని అడిగింది.

మొదట కొంచెం షాక్ తిన్నాడు హైమారెడ్డి. వెంటనే తేరుకుని, చిరునవ్వుతో తలవూపి, తన జేబులో ఉన్న ఫోన్‌ని తీసి, ఆన్ చేయగానే ప్రత్యక్షం అయిన ఫోటోని ఆమెకి చూపించాడు.

ఆ ఫోన్‌ని వెంటనే తీసుకున్నది ప్రణవి. శివారెడ్డి దగ్గరికి పోయి ఆ ఫోటోని చూపించింది.

'విఠల్‌బాబు తెచ్చిన సంబంధం ఇది. నీ అభిప్రాయం ఏమిటి? సూటిగా అడిగింది.

'ముందు ఇప్పుడు మొదలైన గొడవ పూర్తి అయిన తర్వాత...' అంటూ ఆమెను వారించ బోయాడు శివారెడ్డి.

'పూర్తి అయిపోయింది అన్నా! మంచికైనా చెడుకైనా బాజిరెడ్డి మన ఎస్టేట్‌లోనుంచి అవతలకి వెళ్ళిపోయినట్టే. ఈ ఆస్తిపాస్తులు నాకు అనవసరం. నీ ఇష్టమే నాకు ముఖ్యం' పట్టుదలగా అన్నది ఆమె.

పిచ్చమ్మి వైపు చూశాడు శివారెడ్డి.

'నువ్వు ఈ ఇంటిపెద్దవి. నీ చెల్లి బాధ్యత నీదే. నువ్వు ఎలా చెపితే అలాగే..' తడుముకోకుండా అన్నది ఆమె.

తన భార్య వైపు తిరిగాడు శివారెడ్డి.

'నా ప్రాణం అడ్డు వేసైనా ఆ పఠాన్‌గాడితో పెళ్ళి

జరగనీయనని మాట ఇచ్చాను' ముక్తసరిగా చెప్పింది ఆమె.

ఆపైన మరెవ్వరి వైపు చూడలేదు శివారెడ్డి. సూటిగా హైమారెడ్డి దగ్గరికి వచ్చి 'నా చెల్లెల్ని మీ అబ్బాయికి ఇచ్చి పెళ్ళి చేయాలనుకుంటున్నాను. నా ఆస్తి నాకు దక్కితే మీరు అడిగినంత కట్నం ఇచ్చుకుంటాను. ఆస్తి లేకపోతే, కొంచెం టైము ఇవ్వండి. సంపాదించిన తర్వాత ఇచ్చుకుంటాను' అన్నాడు.

'ఓరోరి... నువ్వెక్కడో బలే మనిషి మాదిరిగా ఉండవు శివారెడ్డి. నాకు ఒక్కడే బిడ్డ. వాడు ఈ అమ్మ మీద మనసు పడ్డాడు. ఆస్తులదేముంది? ఈ పెళ్ళి ఖరారు... జరిగిపోతుంది. అంతే' హుషారుగా అన్నాడు హైమారెడ్డి.

'మరి బాజిరెడ్డి నా పేరు మీద చేసిన అప్పు' అడిగాడు శివారెడ్డి.

'నేను హైమారెడ్డిని... కడప హైమారెడ్డిని. వాడినీ, వాడి కొడుకునీ జుట్టు పట్టుకుని నడి వీధిలో వేలం వేసైనా వసూలు చేస్తా. నువ్వు భయపడకు. నాకు వదిలెయ్. నీ చెల్లిని నా ఇంటికి పంపు, చాలు' అన్నాడు హైమారెడ్డి.

ప్రఫుల్లమై పోయింది ప్రణవి ముఖం.

'నమస్కారం చెయ్యవే...' అన్నది పిచ్చమ్మి.

గబుక్కున లోపలికి పరిగెత్తింది శివారెడ్డి భార్య. పెద్ద వెండిపళ్ళేన్ని ఒక బీరువాలో నుంచి తీసి, పసుపు కుంకుమలు పోసింది. కిచెన్‌లో కనిపించిన అరటి పళ్ళను కూడా ఉంచింది. మడత తీయని పట్టు పంచెల్ని వాటిమీద పెట్టి, హాల్లోకి తీసుకువచ్చి శివారెడ్డి ముందుకు జాపింది.

'ఒరే... ఒరే తమ్ముడూ... తక్కువై పోయామురా. తాంబూలాలు మార్చుకోవాలి. మన చెమట కంపు ముఖాలు తప్ప మరేమీలేవు కదరా...' ఆమె ఉద్దేశం అర్థమై, తన తమ్ముడితో అన్నాడు హైమారెడ్డి.

'బజారుకుపోయి చిటికెలో తెచ్చేస్తా' అన్నాడు తమ్ముడు.

'అయ్యో... తొందర పడకండి. ఆ బాజిరెడ్డి జనం ఇంకా గేటు అవతలే నిలబడి ఉన్నారు. ఆశ ఇంకా చావనట్టుంది. ఆ పిచ్చిపూజారిని తీసుకువచ్చి గొడవ చేసేవరకూ వాళ్ళు అవతలికి పోరు' వెంటనే అన్నాడు రమణయ్యపంతులుగారు.

పళ్ళు బిగించాడు సబ్బిరెడ్డి.

'ఊరుకుంటుంటే వాడి దాష్టీకం చాలా దూరం వెళ్ళిపోతోంది. తీసుకుపోయి చింతలపల్లిలో కూర్చోబెట్టి వస్తాను' అంటూ బయలుదేరబోయాడు.

'నా మనిషి వచ్చేంతవరకూ ఎవరూ ఏమీ కొత్త ఆలోచనలు చెయ్యద్దు. తను వచ్చిన తర్వాత తనే చెపుతాడు' అన్నది పిచ్చమ్మి.

'ఎవరమ్మా ఆ మనిషి?' ఆశ్చర్యంగా అడిగాడు అమెరికా నించి వచ్చిన పెద్దమనిషి.

నవ్వింది పిచ్చమ్మి. తెల్లటి పల్వరుస చాలా అందంగా కనిపించింది అందరికీ. 'నేను కష్టాల్లో ఉన్నానని జాలి పడి ఆ చౌడేశ్వరి తనే స్వయంగా పంపించింది అతన్ని. ఎవరో కాదు, మీ అబ్బాయే... విఠల్‌రెడ్డి' అన్నది.

'అమ్మ... మొండిఘటాల్లో మొదటిరకం. తాను పట్టిన కుందేలుకు మూడే కాళ్ళు అనే మనస్తత్వం.. మీ మనిషి ఎలా అయ్యాడు?' ఆశ్చర్యంగా అడిగాడు ఆయన.

'మొండిఘటం కాబట్టే ఈ బాజిరెడ్డి ఎత్తుల్ని ఎదుర్కోగలిగాడు. తనే గనక మా దగ్గరికి రాకుండా ఉన్నట్లయితే మేము ఏమయిపోయి ఉండేవాళ్ళమో తలుచుకోవటానికే భయం వేస్తోంది' కల్పించుకున్నది ప్రత్యూష.

ఆ మాటల్ని విన్నవెంటనే పిచ్చమ్మి నుదురు ముడతలు పడింది. ఏదో ఆలోచనతో ఆమె సత మతం అవుతున్నట్టు అందరికీ తెలిసిపోయింది.

'ఏమిటమ్మా? ఇప్పుడు ఏమయింది?' తన కుర్చీని ఆమె దగ్గరికి జరుపుకుంటూ అడిగాడు శివారెడ్డి.

'మన ప్రత్యూష నీ చెల్లెలికి నీడవంటిదిరా.. అది పుట్టీపుట్టగానే శంకరయ్యకు చెప్పేయటం జరిగింది. చావైనా రేవైనా తన బతుకు నీ చెల్లెలితోనే అని. ఇప్పుడు దానికి పెళ్ళిచేసి పంపించేస్తే మరి తన సంగతి? ఎప్పుడో ఆలోచించి ఉండవలసిన మాట ఇది. ఇప్పటివరకూ పట్టించుకోక పోవటం నిజంగా చాలా పెద్ద తప్పు' అన్నది పిచ్చమ్మి.

శివారెడ్డి దగ్గర సమాధానం లేదు. అయినా సరే సాలోచనగా తల ఊపాడు.

'అయ్యో.. మీ కుటుంబంలో పెళ్ళికావాల్సిన...' అంటూ హైమారెడ్డి వంక, ఆయన తమ్ముడివంక చూశాడు శంకరయ్య.

'ఓరోరి... చాలా ఆలస్యంగా అడిగితివి కదా! మొన్ననే నంద్యాలలో ఉండే మా బంధువు కొడుక్కి ఇక్కడి రాయుడిపల్లి రవీంద్ర బిడ్డను నిశ్చయం చేసుకున్నాము. ఇంకా మనోళ్ళల్లో ఈ బిడ్డకు తగినోళ్ళు ఎవరున్నారబ్బా.' అంటూ తన తమ్ముడికేసి చూశాడు హైమారెడ్డి.

'నాకు ఎవరూ అవసరం లేదు. నేను పెళ్ళి చేసుకోను' ఉన్నట్టుండి విసురుగా చెప్పి, వేగంగా డైనింగ్ హాల్లోకి వెళ్ళిపోయింది ప్రత్యూష.

'అదేంటి తల్లీ! తప్పుకదా... అలా మాట్లాడవచ్చా' అంటూ వెనుకే వెళ్ళబోయిన శంకరయ్యను చూపుల తోనే ఆపేసింది పిచ్చమ్మి.

'మొండి మాలోకం తల్లీ. ఒకసారి ఏదైనా నిర్ణయం తీసుకుంటే తిరిగి మార్చుకోదు' నిస్సహాయంగా అన్నాడు శంకరయ్య.

'నువ్వు కంగారుపడకు. అన్నీ సక్రమంగా జరిగిపోతాయి. నువ్వు స్థిమితంగా కూర్చో బాబాయ్...' నవ్వుతూ చెప్పింది ప్రణవి.

'తను నీకేమైనా చెప్పిందా తల్లీ?' అడిగాడు శంకరయ్య అర్థింపుగా.

'నాకు అన్నీ తెలుసు. తను చెప్పాల్సిన అవసరం లేదు' అంటూ రెండు క్షణాలు ఆగి, మన గొడవ అటో ఇటో తేలిపోయిన తర్వాత బజారుకుపోయి తాంబూలాలు మార్చుకోవటానికి సరంజామా తీసుకురావాలి. పిచ్చిపిచ్చి పంచెలు పైకండువాలు కాదు. మంచి మంచి పాంట్లు, షర్టులు తీసుకో. కొలతలు నీకు తెలుసు, ఇది వరకు ఒకసారి తీసుకు వచ్చావు' అన్నది ఆమె.

అధికం అయిపోయింది శంకరయ్య అయోమయం. 'అమ్మకు కబురుచెయ్యి. వెంటనే బయలుదేరి వచ్చేయమని చెప్పు' ఉన్నట్టుండి అతని అయోమయాన్ని మరింత అధికం చేసేసింది పిచ్చమ్మి.

***

గుడి ఆవరణలో ఉన్న బావిలోనుంచి రెండు బకెట్ల నీళ్ళను తెచ్చి బాబీ తలమీద కుమ్మ రించాడు రవీంద్ర బావమరిది. అప్పటికే అతను కళ్ళు తెరవక పోవటంతో భయం భయంగా చూశాడు వెట్టి వైపు.

'మీ ఫ్రెండ్‌ని పిలువ్' అన్నాడు వెట్టి.

మట్టి అరుగు దగ్గరికి పోయే ధైర్యం లేక దూరంగానే నిలబడి పిచ్చిపూజారి అక్కడ చేస్తున్న తతంగాల్ని శ్రద్ధగా గమనిస్తున్నారు రాయుడిపల్లి నుంచి




వచ్చిన జనం. బండోడి తండ్రి తన కొడుకుతో కలిసి వారితోనే నిలబడి ఉన్నాడు.

'నువ్వేమిటి పెద్దయ్యా... అక్కడికి పోవటానికి నీకే మిటి అభ్యంతరం?' ఆశ్చర్యంగా అడిగాడు రవీంద్ర బావమరిది.

'పిచ్చిపిచ్చి మందులు మాకులు ఉపయోగించి ఒక దుర్మార్గుడికి సాయం చేసిన సంగతిని ఆ తల్లి మర్చిపోకపోతే నాకు రోజులు మూడిపోతాయ్. ఒకసారి పనిచేసిన మూలిక ఇంకోసారి పనిచేస్తుందన్న నమ్మకం లేదు' విషయాన్ని నిజాయితీగా చెప్పాడు బండోడి తండ్రి.

'అన్నయ్య పిలుస్తున్నాడు' అంటూ అతన్ని, బండోడిని వెంటపెట్టుకుని గుడి ఆవరణలోకి తీసుకుపోయాడు రవీంద్ర బావమరిది.

బాబీ నాడి పట్టుకున్నాడు బండోడి తండ్రి. 'విషపు పురుగులు ఒంటిమీద పాకటం వల్ల వచ్చిన తంటా ఇది. ప్రమాదం లేదు' అంటూ తన దుస్తుల్లో నుంచి ఏదో మూలికని తీసి వాసన చూపించాడు.

గట్టిగా తుమ్మి లేచి కూర్చున్నాడు బాబీ. వెట్టి

# ఆశ చావని రెజీనా

మరొకరు మరొకరు అయితే వరుస ఫ్లాపులతో ఈ పాటికే తట్టా బుట్టా సర్దేసుకుని ఇంటిదారి పట్టేవారు. కానీ రెజీనా అలా కాదు కదా! పారేసుకున్న చోటులోనే వెతుక్కోవాలన్న సిద్ధాంతాన్ని బాగా వంటపట్టించుకుంది. అందుకే ఎన్ని ఫ్లాపులు ఎదురైనా సరే రాబోయే 'నక్షత్రం' సినిమా మీద బోలెడన్ని ఆశలు పెట్టుకుంది. ఇవి తన వరకే పరిమితం చేసుకుని ఉంటే బాగుండేది. కానీ వాటిని బహిర్గతం చేసేస్తోంది. 'నక్షత్రం' సినిమా తన కెరీర్‌ను మలుపు తిప్పుతుందని అంటోంది. కాక పోతే ఈ సినిమా ఎప్పుడు విడుదల అవుతుంది? అన్న విషయం దర్శకనిర్మాతలకే తెలియదు. అలాంటి సినిమా మీద రెజీనా అనవసరంగా ఆశలు పెట్టుకుంటోందని ఆమె అభిమానులు సైతం అంటున్నారు.



గుండెలు కుదుటపడ్డాయి.

'పెద్దయ్య... మీరందరూ కలిసి ఇక్కడ జరిపించవలసిన వేడుకల్ని జరిపిస్తూ ఉండండి. మేము అర్జంటుగా సిటీకి పోవాల్సిన పని ఉంది.' అంటూ బాబీని పైకి లేపి, గుడి వెలుపల ఉన్న బండి దగ్గరకి తీసుకు వచ్చాడు.

'రవీంద్ర సారూ... రవీంద్ర సారూ' అంటూ రోడ్డు మీది నుంచి పరిగెత్తుకుంటూ వచ్చాడు రాయుడిపల్లి మనిషి ఒకతను.

'పోలీసులు వస్తున్నారు. పెద్దోళ్ళు ఎవరో వెంట ఉన్నారు' అని కూడా చెప్పాడు. అతని మాటలు పూర్తి అవటం... పోలీసు ఆఫీసరు, అతని అసిస్టెంట్లు, కొంతమంది ప్రముఖులు అక్కడికి రావటం జరిగింది.

'ఇక్కడ పిచ్చిపూజారి ఉన్నాడు. ఎవరు?' వస్తూనే దర్పంగా అడిగాడు ఆ అధికారి.

చివుక్కుమన్నది మర్యాదగా మాట్లాడటానికి సిద్ధంగా నిలబడిన రవీంద్రన్న హృదయం.

పళ్ళు బిగించి దురుసుగా సమాధానం చెప్పబోతుండగా మంత్రాలు చదవటం పూర్తయింది కాబోలు, తనే వచ్చాడు పిచ్చిపూజారి.

'అభిషేకాలు జరగాలి రవీంద్ర. పాలు కావాలి. పంచామృతాలు కావాలి. నిన్న నేను అడిగిన వన్నీ అవసరమే' అన్నాడు వస్తూనే.

'అన్నీ వచ్చేస్తాయి. ఆ తల్లికి ఎటువంటి లోటు జరగదు. వాళ్ళు ఎవరో మీకోసం వచ్చారు.' అంటూ పోలీస్ ఆఫీసర్‌ని చూపించాడు.

కనులు చిట్లించి చూశాడు పూజారి. ఉన్నట్టుండి పెద్దగా నవ్వాడు. 'శివారెడ్డి చెల్లెల్ని తన కొడుక్కి చేసుకోవాలనే కోరికకు గండి పడినట్లుంది. బాజిరెడ్డి బురద జల్లుడు కార్యక్రమాన్ని మొదలుపెట్టినట్లున్నాడు. శివారెడ్డి తండ్రి నా బిడ్డను పాడుచేసి చంపేశాడని మీకు చెప్పాడా?' తనను ఒక్క ప్రశ్న కూడా అడగకముందే తనే అతన్ని అడిగాడు.

మౌనంగా తల ఊపాడు పోలీస్ ఆఫీసరు.

'ఆ బాజిరెడ్డి వట్టి దొంగ. శివారెడ్డి తండ్రిని నా బిడ్డ ఇష్టపడింది. ఆ ఇష్టపడటం వల్ల గర్భం వచ్చింది. ఆ బాజిరెడ్డి ఏదో మందు తెచ్చి ఇచ్చాడు. అది తినటంతో నా బిడ్డ కాలం చేసింది. శివారెడ్డి తండ్రి బాజిరెడ్డిని తిట్టి ఊరినుంచి తరిమేయటానికి చూశాడు. ఆ దుర్మార్గుడు మా తల్లిని ఇక్కడినించి తీసుకుపోయి తుప్పల్లో పారేశాడు. దానితో శివారెడ్డి తండ్రి మీద నింద పడింది. ఆ తల్లి కూడా పగబట్టి ఆయన్ని బలి తీసుకుంది' అన్నాడు.

'ఈ పనులన్నిటికీ నేనే సాక్ష్యం. ఇవన్నీ నా చేతులతో నేను ఇచ్చిన మందుల వల్లనే జరిగాయి' అందుకున్నాడు బండోడి తండ్రి.

తామందరూ పూజ చేయటానికి వచ్చిన చౌడేశ్వరి ఆత్మశిలకు బాజిరెడ్డి ద్రోహం చేశాడని తెలిసిన వెంటనే ఆవరించుకున్నది కోపం అక్కడ ఉన్న జనం అందరికీ.

'చింతలపల్లి మీదుగా పోతున్నాము కదా. వాళ్ళని కూడా కలుపుకుందాము. ఆ బాజిరెడ్డి బతకటానికి వీలులేదు. పదండి' అంటూ రోడ్డు మీద నిలబెట్టిన తన వాహనం వైపు పరిగెత్తాడు రవీంద్ర.

బాజిరెడ్డి ఇచ్చిన కంప్లయింట్‌ని విచారించటానికి వచ్చిన పోలీస్ అధికారికి మతిపోయినంత పని అయింది.

ఆలస్యం చేస్తే బాజిరెడ్డి ప్రాణాలకే ప్రమాదం ఏర్పడుతుందని అర్థమై తను కూడా తమ వెహికల్ దగ్గరికి పరిగెత్తాడు.

బుల్లెట్‌ని స్టార్ట్ చేశాడు వెట్టి. మళ్ళీ అతని వెనక రవీంద్ర బావమరిది, బండోడు కూర్చున్నారు. వారి వెనుక బాబీ... రవీంద్ర వెహికల్‌ని క్రాస్‌చేసి వేగంగా సిటీవైపు దూసుకుపోయింది అది.

***

బుంగిడిలో పెద్దమ్మ పండించే పంటలకు మార్కెట్‌ని చూసిపెట్టే ఏజెంట్‌గా పనిచేసే మునిరెడ్డికి బంధువులు ఉన్నారు చింతలపల్లిలో. వాళ్ళలో ఒకరి దగ్గర్నించి వెళ్ళింది అతనికి ఫోను.

'కదిరి శివారెడ్డి మేనేజర్ బాజిరెడ్డి పని అయిపోయినట్టే. రాయుడిపల్లి జనం వచ్చి మా వాళ్ళని రెచ్చగొట్టారు. అందరూ కలిసి శివారెడ్డి ఎస్టేట్ దగ్గరికి పోయి ఆ బాజిరెడ్డి భరతం పట్టేస్తారు'.

మునిరెడ్డికి ఆశ్చర్యం కన్నా అనుమానం చాలా అధికంగా కలిగింది. ఏదో అనుమానం వచ్చి బుంగిడిలో ఉన్న గ్రానైట్‌మైన్స్ ఏజెంటుకు ఫోన్ చేశాడు.

'పగిడయ్య మా వాళ్ళందర్నీ వెంటేసుకుని కదిరి పోయాడు. మాకు కావాల్సిన మనిషి అక్కడ ఉన్నట్టు శివారెడ్డి ఎస్టేట్ మేనేజర్ బాజిరెడ్డి ద్వారా తెలిసింది' వినవచ్చింది సమాధానం.

'ఓరి మీ దుంపలు తెగ. అక్కడ రాంభజన మొదలయిందిరా. పొట్టేళ్ళ పోట్లాటలో మీరు తలలు దూరిస్తే చచ్చిపోతారు. వచ్చేయమని చెప్పు. ఆ గొడవ చల్లారాక తీరికగా చూసుకోవచ్చు' అంటూ తనకు తెలిసింది చెప్పాడు మునిరెడ్డి.

పది నిమిషాల తర్వాత బుంగిడి నుంచి పగిడయ్యకు చేరిందా వార్త. బాజిరెడ్డి జనంతో కలిసి శివారెడ్డి ఇంటిముందు నిలబడి ఉన్నారు అతను, అతని జనం. క్షణం కూడా ఆలస్యం చేయకుండా తమను అక్కడికి పిలిపించిన తమ లీడర్‌కి ఆ విషయం చెప్పాడు.

ఎంతోసేపు ఆలోచించలేదు ఆ నాయకుడు. కేవలం రెండంటే రెండు నిమిషాలు ఆలోచించి... తన వారికి సైగ చేశాడు.

తన కారులో కూర్చుని అవసరం అయినప్పుడు కనిపించకుండా పోయిన తన లాయర్లని గురించి మాట్లాడుతున్నాడు బాజిరెడ్డి. అతనికి అర్థం అయ్యేలోపు ఆ వీధిలో నుంచి అవతలికి వెళ్ళిపోయారు గ్రానైట్‌మైన్స్ జనం. సూటిగా హాస్పిటల్ దగ్గరికి పోయారు. డాక్టర్ గారిని బతిమాలుకుని అంబులెన్స్‌లో బసవప్పని వేసుకుని బెంగుళూరుకేసి వెళ్ళిపోయారు.

***

బాజిరెడ్డిని గేటు బయటికి పంపించిన వెంటనే సంపంగిని ఆవరించుకున్న తిక్క పూర్తిగా దిగిపోయింది. శివారెడ్డి ఎస్టేట్‌లో నుంచి బయటికిపోతే, తనను ఆదరించగలిగింది ఒక్క బాజిరెడ్డి మాత్రమే అని ఆమెకు తెలుసు. ఆ బాజిరెడ్డి బతుకు బజారుపాలు అయితే, అతనితో పాటు తను కూడా నాశనం అయిపోవటం తప్పనిసరి అని అర్థమై, అమాంతం పిచ్చమ్మి పాదాల మీద పడిపోయింది.

'ఇది పెద్ద కట్లపాము. నమ్మద్దు. తరిమేయటం

మంచిది' అన్నది శివారెడ్డి భార్య. నెత్తిమీద చేతులు పెట్టుకుని, నోటికి వచ్చిన ప్రమాణాలన్నిటినీ తీసింది సంపంగి. 'ఈ జన్మలో నేను బాజిరెడ్డిసారుతో మాట్లాడేది లేదు' అంటూ తనకు అతను ఇచ్చిన ఫోన్‌ని నేల కేసి కొట్టి నాశనం చేసేసింది.

ఆ సంపంగే ఇప్పుడు పరిగెత్తుకుంటూ వచ్చి రోడ్డుమీద జరుగుతున్న గొడవను గురించి అందరికీ చెప్పింది.

'జనం.. జనం తల్లీ.. రాయుడిపల్లి, చింతలపల్లి నుంచి వచ్చేశారు. పోలీసులు ఆపినా ఆగకుండా బాజిరెడ్డిని, పఠాన్‌ని కిందికి నెట్టి మట్టగిస్తున్నారు'.

బెడ్‌మీది నుంచి దిగలేని శివారెడ్డి, పరుగులాంటి నడకతో గేటు దగ్గరికి పోయాడు. 'ఆగండి...' అంటూ అరిచి ఆ ఒక్క అరుపుతో అందరినీ ఆపాడు.

'బాజిరెడ్డి దుర్మార్గుడే అయినా మా తండ్రిగారి కాలం నుంచి మా దగ్గర పనిచేసినవాడు.. వదిలేయండి' అన్నాడు.

'శివారెడ్డీ... వీడు ద్రోహం చేసింది మీకు మాత్రమే కాదు. ఆ తల్లికి కూడా చెడుపు చేశాడు..' ఆవేశంగా అన్నాడు రవీంద్ర.

'ఆ తల్లే చూసుకుంటుంది. వదిలేయండి' అన్నాడు శివారెడ్డి.

కుక్కలు చింపిన విస్తళ్ళ మాదిరిగా తయారైన తండ్రీకొడుకుల్ని వారి కారులోనే ఇంటికి తీసుకు పోయారు అతని జనం.

'ఏరా... ఏమిటి విషయం? మా ఎదుటికి వచ్చేది లేదా?' బుల్లెట్‌ని దూరంగా ఆపి నిలబడి ఉన్న వెట్టిని బిగ్గరగా పిలిచాడు అతని తండ్రి.

మొదట ఆశ్చర్యపడినా, వెంటనే దగ్గరికి పోయి తండ్రి కౌగిలిలో ఒదిగిపోయాడు వెట్టి. తన సోదరుడిని కూడా కావలించుకున్నాడు.

'శివారెడ్డీ... ఆ తల్లికి జరిగిన అపచారం సరిచేయబడింది. రేపటి నుంచీ పూజలు.. ఈసారి గుళ్ళో ఉన్న మూర్తికే కాదు. పుట్టల మధ్యన ఉన్న ఆత్మశిలకు కూడా జరుగుతాయి. దగ్గర ఉండి జరిపించే బాధ్యత నీదే! శివారెడ్డికి చెప్పాడు పిచ్చిపూజారి.

బాజిరెడ్డి జనం అందరూ అంతర్ధానం అయిన తర్వాత బిక్కుబిక్కుమంటూ వీధిలోనే నిలబడి పోయిన ప్రస్తుత పూజారిని, ధర్మకర్తలను లోపలికి ఆహ్వానించి మర్యాద చేశాడు శివారెడ్డి.

'నా చెల్లెలి పెళ్ళికి ముహూర్తం పెట్టండి' అని పిచ్చిపూజారిని అడిగాడు.

'ముందు ఈ అబ్బయ్య పెళ్ళి తర్వాతనే నీ చెల్లి పెళ్ళి' తడుముకోకుండా చెప్పాడు పిచ్చి పూజారి.

ప్రశ్నార్థకంగా తనవైపు చూసిన తన తండ్రికి, అన్నకి పిచ్చమ్మి వైపు చూడమని సైగచేశాడు వెట్టి.

'శంకరయ్యా... తీసుకువచ్చావా?' అంతకు ముందే శంకరయ్యను బజారుకు పంపిన పిచ్చమ్మి అడిగింది అతన్ని.

తను తీసుకువచ్చిన నూతనవస్త్రాలను ఆమెకు అందించాడు శంకరయ్య. లోపలినుంచి ప్రత్యూష చేయి పట్టుకుని తీసుకు వచ్చింది ప్రణవి.

'నా బిడ్డతో పాటు పెరిగి పెద్దదయిన ఈ పిల్ల కూడా నా కూతురే. మీ అబ్బాయికిచ్చి పెళ్ళి చేయాలని అనుకుంటున్నాము' అంటూ విఠల్‌రెడ్డి తండ్రికి ఆ వస్త్రాలను అందించింది పిచ్చమ్మి.

మౌనంగా కూర్చుని ఉన్న హైమారెడ్డికి అప్పుడు వేసింది దాహం. 'గొంతులు ఎండుకు పోతున్నయ్.. ఇక మీరు మాకు మర్యాదలు చేసుకోవచ్చు' అన్నాడు ప్రణవిని బాబీకి ఇచ్చే మాట పూర్తి అయిన తర్వాత.

నెలల తరబడి అదో రకమైన దీనావస్థలో ఉన్నట్టు కనిపించిన ఆ భవనంలో ఒక్కసారిగా నవ్వుల పువ్వులు విరబూశాయి.

'విఠల్‌బాబు మీతో అమెరికా రాడు అంకుల్... మా దగ్గరే ఉంటాడు. మా ఆస్తులన్నిటికీ మేనేజర్‌గా పనిచేస్తాడు. అన్నిటినీ మించి మా చౌడేశ్వరి గుడి బాధ్యతల్ని తనే చూసుకుంటాడు' అమెరికా పెద్ద మనిషికి చెప్పింది ప్రణవి.

'ఆ ముట్టి పొగరు మొనగాడు అమెరికా వస్తే తట్టుకోవటం మాకు చేతకాదు. నీవు చెప్పిందే కరెక్టు..' రెండో ఆలోచన లేకుండా ఒప్పుకున్నాడు ఆయన.

'మరి ఆ గ్రానైట్‌మైన్స్ వాళ్ళ సంగతి ఏమిటి?' అడిగింది ప్రణవి.

'చిన్నచిన్న దెబ్బలతో వాళ్ళని ఆపటం కష్టం. ప్రభుత్వం ద్వారానే ఏదైనా చేయాలి. రాజధానిలో మాకు తెలిసిన ప్రజాప్రతినిధులున్నారు. వాళ్ళ ద్వారా మూవ్ అవుతాము' అన్నాడు విఠల్‌రెడ్డి సోదరుడు.

'అది కాదు అబ్బయ్య. మనం ఎదురుచూడని సమయంలో వాళ్ళు ఇంకోసారి గుంపుగా వచ్చి పడితే?' అనుమానంగా అడిగాడు శంకరయ్య.

'వాళ్ళు ఎవరో మనకు సరిగ్గా తెలియనప్పుడు జరిగింది ఆ ఘాతుకం. ఇప్పుడు ఎవరు ఎవరో తెలిసింది. ఇంక మన జోలికి రారు' అన్నాడు వెట్టి.

'మర్చిపో అబ్బయ్య. వదిలేయ్... వాళ్ళ పని అయిపోయింది. నా బిడ్డడిని నాకు కాకుండా చేయటానికి ప్రయత్నించిన వాళ్ళని నేను వదలను. ఒకరొకరిగా పట్టుకుని ఎగరేసి ఎగరేసి చంపుతాము' కచ్చగా అన్నాడు హైమారెడ్డి.

రెండు రోజుల తర్వాత వచ్చింది పెద్దమ్మ. దగ్గరుండి ప్రణవిని బాబీకి, ప్రత్యూషని వెట్టి సారీ విఠల్ రెడ్డికి ఇచ్చి పెళ్ళి జరిపించింది.

అమ్మవారి ఆత్మశిల స్వస్థానానికి చేరుకున్న మరుక్షణం పూర్తిగా స్వస్థుడై పోయాడు శివారెడ్డి. తనకు అండగా ఉండటానికి పంపబడిన డాక్టర్లను, నర్సులను వెనక్కి పంపేశాడు.

పెళ్ళి జరగకముందు తిరిగి తన చదువును కొనసాగించాలని అనుకున్నాడు విఠల్‌రెడ్డి. కాని అది జరిగే




పని కాదని అర్థమై ఆ ఆలోచన విరమించుకున్నాడు. బాజిరెడ్డి ఆస్తులన్నిటినీ చాలావరకు వశపరుచుకున్నాడు హైమారెడ్డి. కుందనపు బొమ్మలాంటి తన కోడలికి బహుమతిగా ఇచ్చేశాడు.

శివారెడ్డి ఆస్తులన్నిటికీ మేనేజర్ అయ్యాడు విఠల్ రెడ్డి. పెద్దమ్మ తన సంపదలన్నిటినీ శంకరయ్యకు అప్పగించి శివారెడ్డి దగ్గరికి వచ్చేసింది.

గొడవలన్నీ సద్దుమణిగి, ప్రణవి ప్రత్యూషల పెళ్ళిళ్ళు జరిగిన పదిహేను రోజుల తర్వాత అందరికీ తెలిసింది ఒక వార్త. అర్ధరాత్రి సమయంలో తన ఇంటిముందు నిలబడి తన కారు డ్రైవర్‌తో మాట్లాడుతున్న బాజిరెడ్డికి చీకట్లో ఏదో పురుగు ముట్టుకున్నట్టు అనిపించిందిట. హాస్పిటల్‌కి తీసుకుపోతూ ఉండగానే ప్రాణాలు కోల్పోయాడుట.

ఆరు సంవత్సరాలు కారాగార శిక్ష విధించబడింది అతని కుమారరత్నం పఠాన్‌కి. అతను జైలు నుంచి తిరిగి వచ్చేసరికి, ప్రణవికి ఇద్దరు మగబిడ్డలు. ప్రత్యూషకి ఒక ఆడపిల్ల.

ఆ బిడ్డకు బారసాల జరిపించే భారం పిచ్చి పూజారికి అప్పగించబడింది. ఆహ్వానం అందిన వెంటనే వచ్చి, ఆ బిడ్డను చూసి, కొయ్యబొమ్మలా నిలబడిపోయాడు.

'ఏమైంది స్వామీ?' ఆశ్చర్యంగా అడిగాడు శివారెడ్డి.

'నా కూతురు.. నా కూతురే నీ ఇంట పుట్టింది' తడి కనులతో చెప్పాడు పూజారయ్య. 'నీ తండ్రి చేసిన తప్పులో ఏదైనా కొంచెం మిగిలి ఉంటే అది ఇప్పుడు పూర్తిగా తుడిచి వేయబడింది' అని కూడా చెప్పాడు.

చింతలపల్లిలో తాము స్వాధీనం చేసుకున్న బాజిరెడ్డి ఆస్తులకు బండోడిని, రవీంద్ర బావమరిదిని మేనేజర్లుగా నియమించాడు శివారెడ్డి.

ఇప్పుడు శివారెడ్డి భార్యకు ఆరో నెల. లోపల ఉన్న శిశువులు ఎవరో బయటికి చెప్పకూడదనే రూల్ ఒకటి ఉన్నందున మౌనంగా ఉండిపోయాడు హాస్పిటల్లోని పెద్ద డాక్టరు. కాని అతని పెదవుల మీద ప్రత్యక్షం అయిన నవ్వుని బట్టి తేలికగా పసికట్టేసింది పిచ్చమ్మి– శివారెడ్డికి కవలలు జన్మించబోతున్నారని... ఇద్దరిలో ఒకరు ఆడ, మరొకరు మగబిడ్డ అని.

**(అయిపోయింది)**





# ప్రేమను గెలిపించుకోండిలా...

**అటు ఏడుతరాలు ఇటు ఏడుతరాలు చూసి పెళ్ళిళ్ళు చేస్తే ఆ బంధం కలకాలం నిలుస్తుందని పెద్దలు భావించేవారు. కానీ ఇప్పుడు పెళ్ళికి అమ్మాయికి అబ్బాయి గురించి, అబ్బాయికి అమ్మాయి గురించి తెలిస్తే చాలు. తల్లిదండ్రుల ప్రమేయం చాలా తక్కువ. అదే ప్రేమించుకున్న వాళ్ళకైతే తల్లిదండ్రులను ఒప్పించడం ఓ పెద్ద సమస్యగా కనిపిస్తుంది.**

**సాధారణంగా మనం తీసుకునే నిర్ణయాల్లో తల్లిదండ్రులు, కుటుంబసభ్యులు, స్నేహితుల పాత్ర ఎంతో కొంత ఉంటుంది. మన జీవితంలో ప్రతి అంశంలోనూ వారి ముద్ర కనిపిస్తుంది. అయితే చాలా సందర్భాల్లో పిల్లల నిర్ణయాన్ని అంగీకరించి తగినన్ని సూచనలు చేసి ముందుకు నడిపించిన తల్లిదండ్రులే వారి ప్రేమ విషయం తెలిసే సరికి కసురుకుంటారు. కారణం అవతలి వ్యక్తి ఎలాంటివారో తమ బిడ్డను ఎలా చూసుకుంటారో అనే భయం, ఇలా పిల్లలు తాము ఫలానా వ్యక్తిని ప్రేమిస్తున్నామని చెబితే చాలు వారిని భయపెట్టో బెదిరించో వారి మనసులోని వ్యక్తికి దూరంగా ఉండమని చెబుతుంటారు. దాంతో చాలామంది తల్లిదండ్రుల కోసం తమ ప్రేమను వదులుకోవాల్సి వస్తోంది. ఆ తర్వాత దాని ప్రభావం కుటుంబ సభ్యులతో తమకున్న అనుబంధంపై పడుతుంది. ఇలా జరగకుండా మీప్రేమను అందరూ వ్యతిరేకిస్తున్నా వారితో మీకున్న అనుబంధం దెబ్బతినకుండా మీ ప్రేమను గెలిపించుకోవాలంటే ఏం చేయాలో తెలుసుకుందామా!**

### ఎందుకు ఒప్పుకోలేదు?

చాలామంది తమ ప్రేమను కాదన్నారనో లేదా ప్రేమను గెలిపించుకోవడానికి అడ్డుగా ఉన్నారనో కుటుంబసభ్యులపై కోపం, ద్వేషం పెంచుకుంటూ ఉంటారు. మీరు వారిపై వ్యతిరేక భావాన్ని పెంచుకునే ముందు కొన్ని విషయాలు గుర్తుంచుకోవాలి. అందేటంటే వారు కూడా మీ శ్రేయోభిలాషులేనని, మీరు సంతోషంగా, క్షేమంగా ఉండటమే వారికి ముఖ్యం అనే విషయం మనసులో పెట్టుకోవాలి. అంతేకాదు మీకు దేనివల్ల మంచి జరుగుతుందో దాన్నే చేయడానికి వారు ఆసక్తి చూపిస్తారు. మరి అలాంటి వారు ఎందుకు మీనిర్ణయాన్ని కాదంటారు? అందుకే మీప్రేమను వారు ఎందుకు తిరస్కరిస్తున్నారో ముందుగా తెలుసుకోవాలి. ఈక్రమంలో వారి సందేహాలు తెలుసుకుని వాటికి సమాధానం చెప్పే ప్రయత్నం చేయాలి.

### సమయం ఇవ్వండి

మనసారా ప్రేమించిన వ్యక్తికి దూరంగా వెళ్లడమంటే చాలా కష్టమైన విషయమే. అయితే మీ ఇద్దరి మధ్య ఉన్న బంధాన్ని ఇంట్లో ఒప్పుకోవడం లేదని చెప్పి తాము ఇష్టపడిన వ్యక్తికి బ్రేకప్ చెబుతుంటారు కొందరు. ఇలా చేయడం అస్సలు సమజసం కాదు. దీనివల్ల మీరు బాధపడటంతోపాటు మిమ్మల్ని ప్రేమిస్తున్న వ్యక్తిని కూడా బాధపెట్టిన వారవుతారు. అందుకే వాస్తవానికి తగిన విధంగా ఆలోచించాలి. ఏ తల్లిదండ్రులూ తమ పిల్లలు మేం ఫలానా వారిని ప్రేమిస్తున్నామని చెబితే వెంటనే ఒప్పేసుకోరు. మీ ఇద్దరూ పెళ్లి చేసుకుంటే సంతోషంగా ఉంటారనే నమ్మకం ఉన్నట్లయితే మీ తల్లిదండ్రులకు కాస్త ఆలోచించుకునే సమయం ఇవ్వండి. కొన్ని నెలలు గడిచినా కూడా ఈ విషయంలో మీ తల్లిదండ్రుల దగ్గర నుంచి ఎలాంటి స్పందనా లేకపోతే మీరే మళ్లీ దాన్ని కదిపే ప్రయత్నం చేయండి. అంతే కాదు మీ నిర్ణయం ఎంత దృఢమైందో సున్నితంగా చెప్పి ఒప్పించే ప్రయత్నం చేయండి.

## సందేహాలు నివృత్తి చేయండి

ఎన్ని రోజులైనా తమ ప్రేమగురించి తల్లి దండ్రులు పట్టించుకోవడం లేదనే బాధ, కోపం రావడం సహజం. అయితే ఇలాంటి వాటిని తల్లి దండ్రులపై చూపించేవారు చాలామందే ఉంటారు. ఈ అసహనాన్ని తాము మనసిచ్చిన వ్యక్తులపై కూడా చూపిస్తుంటారు. ఫలితంగా రెండు వైపులా ఉన్న సంబంధ బాంధవ్యాలు దెబ్బతినే అవకాశా లుంటాయి. తల్లిదండ్రులు సాధారణంగా ప్రేమ పెళ్లికి ఒప్పుకోకపోవడానికి ఎన్నో కారణాలుం టాయి. అందుకే వారితో మాట్లాడి మీ వివాహం విషయంలో వారు ఎలాంటి విషయాలను పరిగ ణనలోకి తీసుకుంటారో అడగాలి. వారికి కావల్సిన అంశాలు మాత్రమే కాదు, మీ బంధంలో వారికి కనిపిస్తున్న లోపాలు, సందేహాలు లేదా ప్రతికూల అంశాలను సైతం అడిగి తెలుసుకోండి. ఇలా అడ గడం తప్పేమీ కాదు. మీ జీవితాన్ని మీరు నిలబెట్టు కునే ప్రయత్నం చేయకపోతే భవిష్యత్తులో మీరే ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వస్తుంది. దీనివల్ల వారికి మీ బంధంపై ఎలాంటి సందేహాలు ఉన్నాయో తెలుస్తాయి. ఇలా వారి అనుమానా లను నివృత్తిచేసే సమయంలో చాలా అనున యంగా వ్యవహరించాలి. అంతేకాదు మానసి కంగా దృఢంగా ఉండడం చాలా ముఖ్యం. ఎందు కంటే ఇలాంటి సందర్భాల్లో కుటుంబ సభ్యుల నుంచి కొన్ని కొన్ని కఠినమైన బాధించే ప్రశ్నలు కూడా ఎదుర్కోవాల్సి రావచ్చు. అన్నింటికీ నిదా నంగా సమాధానం చెప్పే ప్రయత్నం చేయండి.

## ఎక్కడ తగ్గాలో తెలుసుకోండి

మీ ప్రేమ విషయం మీ ఇంట్లో చెప్పినప్పటి నుంచి కుటుంబసభ్యులందరూ మీపై మాటల బాణాలు విసరడం మొదలుపెడతారు. ఈ క్రమంలో మీరు కోరుకుంటున్న వ్యక్తి గురించి లేనిపోని విషయాలు చెప్పడం మొదలుపెడ తారు. వారి వ్యక్తిత్వాన్ని తక్కువ చేసి చూపించి మీ మనసుని మార్చే ప్రయత్నం చేస్తారు. ఇలాంటి సందర్భాలు చాలా క్లిష్టమైనవనే చెప్పుకోవాలి. అయితే ఇలాంటి సందర్భాల్లో మీ బంధాన్ని సమ ర్థించుకోవడానికి గట్టిగా మాట్లాడటం, గొడవ పెట్టుకున్నట్లుగా ప్రవర్తించడం లాంటివి చేయ కూడదు. దీనివల్ల వారు మీపై మరింత ఒత్తిడి పెంచే అవకాశం ఉంటుంది. అందుకే ఏ సమ యంలో మీ బంధాన్ని సమర్థించుకోవాలి. ఎక్కడ దాని గురించి మాట్లాడకూడదో తెలుసుకోవాల్సి ఉంటుంది. అలాగే మీరు ఇష్టపడుతున్న వ్యక్తి గురించి మీ తల్లిదండ్రులు చెబుతున్న అంశాలన్నీ నిజమో కాదో కూడా పరిశీలించాల్సి ఉంటుంది. అందుకే నమ్మకమైన వ్యక్తి ద్వారా వాటిని నిర్ధా రణ చేసుకునే ప్రయత్నం చేయండి. అలాగే మీ చుట్టూ నెలకొని ఉన్న సంక్లిష్టమైన వాతావర ణాన్ని తేలికపరిచే వారితో అప్పుడప్పుడూ మాట్లా డుతూ ఉండండి.

## బలవంతంగా ఒప్పించొద్దు

మనసిచ్చిన వ్యక్తిని వివాహం చేసుకోవడానికి ఎవరి అంగీకారం అవసరం లేదని భావించేవారు కొందరుంటారు. అలాగే ఎలాగైనా ప్రేమను పెళ్లి పీటలెక్కించాలనుకునే క్రమంలో బలవంతంగా నైనా తమ తల్లిదండ్రులను ఒప్పించే ప్రయత్నం చేస్తుంటారు. దీనికోసం కొన్నిసార్లు ప్రాణాల మీదకు కూడా తెచ్చుకుంటారు. ప్రేమలో ఉన్న జంటలు చేసే పొరపాట్లలో ఇది కూడా ఒకటి. మీ ప్రేమను తల్లిదండ్రులు మనస్ఫూర్తిగా ఒప్పుకు నేలా చేయాల్సిన బాధ్యత మీకు ఉంది. ఒకవేళ మీ ప్రేమను ఎవరూ అంగీకరించకపోతే కుటుంబం నుంచే కాదు, సమాజం నుంచి కూడా కొన్ని ఇబ్బందులను ఎదుర్కోవాల్సి వస్తుంది. పైగా మీపై అందరికీ ప్రతికూల ధోరణి పెరిగే అవకాశం కూడా ఉంది. అందుకే కాస్త ఆలస్య మైనా సరే అందరినీ ఒప్పించి పెళ్లి చేసుకోవ డానికి మొగ్గు చూపండి.

—నివేదిత

## సహజీవనమే కారణం



ఊహ తెలియని ప్రాయంలో ప్రేమలో పడ తారు. కలకాలం కలిసి సాగుతామని ప్రమా ణాలు చేస్తారు. ఆ తర్వాత చిన్నపాటి మనస్పర్థల తోనే బ్రేకప్ చెప్పేస్తారు. ఇలాంటి కేసులు ప్రపంచ నలుమూలలా నమోదవుతూనే ఉన్నాయి. కానీ అన్ని దేశాల కంటే ఎక్కువ బ్రేకప్‌లు బ్రిటన్ లోనే జరుగుతున్నాయని ఓ సంస్థ జరిపిన సర్వే వెల్లడించింది. అందుకే ఆ దేశాన్ని 'బ్రేకప్‌ల రాజ ధాని'గా అభివర్ణించింది.

వివాహం చేసుకోకుండా సహజీవనం చేసే సంస్కృతి విపరీతంగా పెరగడమే బ్రేకప్‌లకు ప్రధాన కారణమని 'ఇంటర్నేషనల్ గ్రూప్ ఆఫ్ అకడమిక్స్' అనే సంస్థ తేల్చిచెప్పింది. అలాంటి బ్రేకప్‌లు బ్రిటన్‌లోనే అధికమని ఆ సంస్థ జరిపిన సర్వేలో వెల్లడైంది. ఆ దేశంలోని ప్రతి ఐదుగు రిలో ముగ్గురు పిల్లలు (62 శాతం) పెళ్లి చేసుకో కుండా కాపురం చేస్తున్న జంటలకే జన్మిస్తున్నా రట. ఆ పిల్లల్లో 94 శాతం మంది టీనేజ్‌లోకి రాక ముందే తమ తల్లిదండ్రులు బ్రేకప్ చెప్పుకోవడం చూడాల్సి వస్తోందట. దాంతో ఎంతోమంది చిన్నా రులు తమ విలువైన బాంధవ్యాలను కోల్పోతు న్నారని సంస్థ ఆవేదన వ్యక్తం చేసింది. పెళ్లిళ్లు చేసుకోని జంటలకు జన్మిస్తున్న పిల్లలు అమెరి కాలో 45 శాతం, బెల్జియంలో 15 శాతం, స్పెయిన్‌లో 6 శాతం ఉన్నట్లు సర్వేలో వెల్లడైంది. విద్య, ఆర్థిక రంగాల్లో మెరుగ్గా ఉన్న దేశాల్లోనే ఈ బ్రేకప్‌ల వ్యవహారం విచ్చలవిడిగా పెరిగిపోతోందని సర్వే తేల్చి చెప్పింది. వివాహబంధంతో ఒక్కటైన జంటలే ఎక్కువకాలం నిలుస్తున్నాయని పేర్కొంది. పేద దేశాల్లోని కుటుంబాలు పెడదారిన వెళ్లడం లేదని స్పష్టం చేసింది.

## ఎసెమ్మెస్ ప్రపోజల్స్




అమ్మాయి కానీ, అబ్బాయి కానీ అవతలి వారికి తమ ప్రేమ తెలియజేయడానికి కొంత ఉద్విగ్నతకు లోనవుతారు. తమ ప్రేమను ఒప్పు కుంటారో లేదోనని భయపడుతుంటారు. ప్రేమను వ్యక్తపరచడానికి ఎన్నో దార్లు వెతుకు తుంటారు. ప్రేమను తెలియజేయడానికి ఎన్ని మార్గాలున్నా ఈ ఆధునిక యుగంలో ఎసెమ్మె స్‌లే ప్రధాన భూమిక పోషిస్తున్నాయంటున్నారు పరిశోధకులు. సాధారణంగా ఎసెమ్మెస్‌లు పంపే వారు 13 శాతం పెద్దలకు పంపిస్తుంటే, 8 శాతం మంది ప్రేమికులకు పంపుతున్నారు. అది కూడా తమ గురించి, తమ ప్రేమ గురించి ఇక మరచి పొమ్మంటూ ఎక్కువగా అమ్మాయిలే మెసేజ్‌లు పంపిస్తుంటారని సర్వేలో వెల్లడైంది. చైనాలో 58 శాతం, భారత్‌లో 54 శాతం మంది పురుషులు మొబైల్ ఫోన్ల ద్వారానే పెళ్లి ప్రస్తావన చేస్తున్నా రని సర్వేలో తేలింది. ఢిల్లీ, ముంబై వంటి ప్రధాన నగరాల్లో ఈ సమాచారం సేకరించినట్టు సర్వే సంస్థలు పేర్కొన్నాయి. ఇతర నగరాలు, పట్ట ణాలు, చివరికి పల్లెల్లో కూడా పరిస్థితి ఇదేవి ధంగా ఉంటోందని పరిశోధకులు అభిప్రాయప డుతున్నారు.



# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 36

(గతవారం తరువాయి)

**ఈ మాట నేను ఇప్పుడు చెప్పేది కాదండీ...చాలా ఏళ్ల నుంచి చెబుతున్నాను. ఎందుకంటే మద్రాసు నుంచి హైదరాబాద్‌కి చలనచిత్ర పరిశ్రమ తరలి వచ్చేటప్పుడు తెలుగు నిర్మాతలు అందరూ 'మీరు రండి మేమున్నాం.. మీరు రండి మేమున్నాం' అని నటీనటుల్ని, సాంకేతిక నిపుణుల్ని పిలిపించారు. అందుకు ప్రత్యక్షసాక్ష్యం నేనే. అయితే తీరా ఇక్కడికి వచ్చాక ఆ మాటలేవీ అమలు కాలేదు. 'అదేంటి మరి అలాగన్నారే..' అని ప్రశ్నించినవారూ లేరు.**

## ఆదరించిన అభిమానులందరికీ అభివాదాలు

అప్పటి నుంచీ నేననేది ఒక్కటే...తెలుగు వాళ్ల టాలెంట్‌ను అనవసరంగా తొక్కేస్తున్నారూ..అని. మన దగ్గర ఎవరైనా నోరు తెరిచి ఓ మాట మాటా డితే 'ఫలానా టెక్నీషియన్ బ్రహ్మాండమండీ' అని పొరుగువారిని పొగుడుతుంటారు. 'ఏం టెక్నీషియన్ అండీ...? అవకాశం ఇస్తే ఎవరు టెక్నీషియన్ కాదూ..? ఎవరు ఆర్టిస్ట్ కాదూ..?' అని నేనంటాను. తెలుగు



టెక్నీషియన్స్ అందరూ అవగాహనాశక్తి గలవారే! మహానుభావులు రామానాయుడుగారూ, జగపతి రాజేంద్రప్రసాద్‌గారూ, పీఏపీ సుబ్బారావుగారూ.. వంటివారు తెరకెక్కించిన అమోఘమైన సినిమాలు చాలా ఉన్నాయి. మరి ఆ చిత్రాలకు పనిచేసిన వారు మన తెలుగువారు కాదా? 'కోట శ్రీనివాస రావు పెద్దవాడు అయిపోయాడులే.. ఇప్పుడు ఛాన్స్‌లు ఏమీ వస్తున్నట్టు లేవు.. అందుకే ఇలా మాట్లాడు తున్నాడు' అని అనుకోవద్దని పాఠకులకు మనవి చేస్తున్నా. ఇప్పుడు రన్నింగ్‌లో ఉన్న చిత్రాల్లో నేను నటిస్తూనే ఉన్నా. మొన్నటికి మొన్న కూడా షూటిం గ్‌లో పాల్గొన్నా. అయినా ఈ మాటలు నేను ఇప్పుడు అంటున్నవి కాదు. నా కెరీర్ పీక్‌లో ఉన్నప్పటి నుంచీ అంటున్నవి. అప్పట్లో నిరాహార దీక్ష చేసి నప్పుడు సీనియర్ జర్నలిస్ట్ గంగాధర్ శాస్త్రి ఒక మాట అడిగారు..'కెరీర్ ఇంత బిజీగా ఉన్నప్పుడు, మీరు నిరాహారదీక్ష చేయాల్సిన అవసరం ఏంటండీ' అని. అందుకు నేను 'చాలా మంచి ప్రశ్న వేశా రండీ..నాకేం వేషాలు లేక కాదు..పది సినిమాలు చేతిలో పట్టుకుని ఈ మాట అంటున్నానంటే.. ఒకటి..నేను ఎంత ఆవేదన పడుతున్నానో ఆలోచిం చండి. రెండు..నాకు ఉన్నదానికీ, నేను సంపాదించు కున్నదానికీ నేను తృప్తి పడుతున్నానని అర్థం. ఇప్పుడు నా ముందున్న ధ్యేయం..నా చుట్టూ ఉన్న వారు, నా తెలుగువారు బతకాలి' అని సమాధానం చెప్పా. అంటే ఇప్పుడు నేను గొప్పచెప్పడం కాదు. పెద్దవాడిని అయ్యా. 73 ఏళ్శొచ్చాయి. ఇకనైనా నాలాంటివాడు చెప్పకపోతే ఎవరు చెబుతారు? అందుకే నేను ఉభయ ముఖ్యమంత్రులకు, తెలుగు వారిని ప్రోత్సహించమని విన్నపం చేస్తూ ఉంటాను. ఈ విషయమై ప్రభుత్వాలకు లెటర్లు రాయడం, అవి బుట్టదాఖలు కావడం నాకు ఇష్టం లేదు. అందుకే టీవీల్లోనూ, పత్రికాముఖంగానూ ముఖ్య మంత్రులకు విన్నవించుకుంటూ ఉంటాను. ఈ రంగాన్ని నమ్ముకుని వచ్చిన తెలుగువారికి ఒక్క అవకాశాన్ని కల్పించమని నా ప్రార్థన.

### నా బాక్సు నేనే!

లోకల్ వాళ్లను తీసుకుంటే చాలా సౌకర్యాలు ఉంటాయి. బస కోసం హోటళ్లకు డబ్బులు పెట్టక్క ర్లేదు. విమానాల ఛార్జీలు అవసరం లేదు. నా వరకే తీసుకోండి... నేను భోజనప్రియుడిని. ఇంటి నుంచే భోజనం తీసుకెళ్తాను. ఒక మగవాడికి కమ్మగా వండిపెట్టే భార్య దొరకడం చాలా అదృష్టం. నాకు ఆ అదృష్టం దక్కింది. నా భార్య రుక్మిణి చేతి వంట దివ్యంగా ఉంటుంది. మా పెళ్ళై 2018 మార్చికి 50 ఏళ్లు పూర్తవుతాయి. అందుబాటులో ఉంటే క్యారియర్‌ను ఇంటి నుంచే తెప్పించుకుంటా. ఈ విషయంలో ఎవరు ఏమనుకున్నా నేను పట్టిం చుకోను. 'ప్రొడక్షన వాళ్లు ఫుడ్ పెడతారు కదా.. అలాంటప్పుడు ఇంటిదగ్గర నుంచి ఎందుకు తెచ్చు కుంటావు' అని కొంతమంది అడుగుతుంటారు.. కమ్మటి భోజనం... అందులోనూ నా భార్య చేతి వంటను నేను ఎందుకు మిస్ అవ్వాలి? అనేది నా జవాబు. అయినా ఇంట్లో వాళ్లను ఇబ్బంది పెట్టడం నాకు ఇష్టం లేదు. ఈ మాట ఎందుకు అంటున్నా నంటే నేను తింటున్నానని అనుకున్నప్పుడు మా ఆవిడ రెండు మూడు కూరలు చేస్తుంది. అదే నేను ఇంట్లో తినలేదనుకోండి.. 'ఆయన ఇంట్లో తినటం లేదు కదా..మనకోసం కూరలు ఏం వండుతాంలే' అని అనుకుని ఏదో అంత పచ్చడి వేసుకుని తినే స్తుంది. పిల్లలకూ అదే పెడుతుంది. అది నాకు ఇష్టం లేదు. నావల్ల వాళ్లు అలా పచ్చడి మెతుకులు ఎందుకు తినాలి? నాకు ఇబ్బందిగా అనిపిస్తుంది. ఇప్పటికి కూడా ఎప్పుడైనా ఒక పూట బయట భోజనం చేశా ననుకోండి, "పాపం అది ఏం తిందో ఏంటో" అని అనిపిస్తూనే ఉంటుంది. పైగా నేను ఈ స్థాయికి వచ్చానంటే అందులో నా భార్యా పిల్లల అదృష్టం



కూడా ఉన్నట్టేగా. అనుభవించాలని వాళ్లకు రాసి పెట్టి ఉంది కాబట్టి నేను ఈ స్థాయికి వచ్చి సంపాదించగలిగాను అనే విషయాన్ని ఎప్పుడూ గుర్తుంచుకుంటాను.

### ఇప్పటికి సెలవ్

ఈ ధారావాహిక ఈ వారంతో అయిపోతుందని చెప్పడం నాకు చాలా బాధగా ఉంది. ఈ మాట చెప్పుకునే అర్హత నాకు ఉందని భావిస్తున్నాను. 36 వారాలు..పాఠకులు సహృదయంతో చదవబట్టే నేను ఇన్ని అంశాలను చెప్పగలిగాను. అందరికీ నచ్చిందనే అనుకుంటున్నా. ఆదరించిన ప్రేక్షకుల మహాశయులందరికి, నా పురోగతికి సహకరించిన నిర్మాతలకు, దర్శకులకు, తోటి నటీనటులకు, సాంకేతికనిపుణులకు మనసావాచా ధన్యవాదాలు చెప్పుకుంటున్నా.

చిన్నతనం నుంచీ నేను నటననే నమ్ముకున్న మాట వాస్తవం. తిండికి లేకనో, చదువు అబ్బకనో ఈ రంగంలోకి వచ్చానని ఎవరైనా అనుకుంటే అది పొరపాటు. మరి ఈ రంగంలోకి ఎందుకు వచ్చావు? అని ఎవరైనా నిలదీస్తే నాకూ తెలియదు. నేనూ ఎంతో వెతికాను..అయినా సమాధానం నాకు దొరకలేదు. ఉద్యోగం చేస్తూ సుఖంగా ఉన్నప్పుడు సినిమానే నన్ను పిలిచింది. నటనను నమ్మి, ఇష్టపూర్వకంగా నేర్చుకుని, దాన్ని త్రికరణశుద్ధిగా ఆచరణలో పెట్టాను. నా నమ్మకాన్ని భగవంతుడు పద్మశ్రీ పురస్కారంతో ఆశీర్వదించాడు. పద్మశ్రీ పురస్కారం నా జన్మను పావనం చేసిందని భావిస్తున్నాను.

ఇక్కడ ఓ మాట చెప్పాలి..నా కన్నా సీనియర్లు..క్యారెక్టర్ ఆర్టిస్ట్ కేడర్‌లో తీసుకుంటే...ఎస్వీ రంగారావుగారు, గౌరినాథశాస్త్రిగారు, లింగమూర్తిగారు, వంగర సుబ్బయ్యగారు, గుమ్మడి వెంకటేశ్వర రావుగారు, రాజనాలగారు, నాగభూషణంగారు, రావుగోపాలరావుగారు, నవరసనటసార్వభౌమ అనే బిరుదున్న కైకాల సత్యనారాయణగారు... నూతన ప్రసాద్‌గారు, గొల్లపూడి మారుతీరావుగారు..ఇలా ఎంతోమంది...వీళ్లెవ్వరికీ దక్కని అదృష్టం నాకు దక్కడం దేవుడి ఆశీర్వాదం కాక మరేమిటి? ఇది నా మనసులోనుంచి వచ్చిన మాట. పద్మశ్రీ తీసుకునేటప్పుడే నాకు నాటకాలు నేర్పిన తొమ్మిది మంది గురువులూ వరుసగా గుర్తుకొచ్చారు. ఒక్కసారి వాళ్లందరూ నాకు కళ్లల్లో నిలిచారు. వారు నేర్పిన విద్య వల్లే ఇది సాధ్యమైంది. ఇవాళ ఒక సీరియల్‌కి, ఒక ఎపిసోడ్‌కి దర్శకత్వం చేయాలంటే ఇంత అని ఎంతో కొంత మొత్తాన్ని తీసుకుంటారు. కానీ నాకు విద్య నేర్పిన గురువులు అలా కాదు. ఒక్కొక్కరూ ఒక్కో ఉద్యోగం చేసుకునేవారు. అందరూ గౌరవనీయమైన స్థానాల్లోనే ఉండేవారు. అలా మహానుభావులు వాళ్ల ఉద్యోగాలు వాళ్లు చేసుకుంటూ, మా రిహార్సల్ టైమ్ ఎప్పుడో మేం చెబితే, మా రిహార్సల్స్ దగ్గరకు ఆ టైమ్ ప్రకారం వచ్చి, ఆ టైమ్‌లో మేం ఇచ్చేటువంటి టీ తాగేవారు. ఎప్పుడైనా అరటిపండ్లు తినేవారు. అంతేగానీ... ఏనాడూ ఒక్క రూపాయి తీసుకున్న చరిత్ర లేదు. అలా వాళ్లకున్న విద్వత్తును నాలాంటి వాడికి నేర్పితే ఇవాళ వాళ్ల కంటే ఎంతో గొప్ప స్థాయిలో నేనున్నాను. విద్య నేర్పిన గురువులను, పురోగతికి పునాదిరాయిని వేసిన వారిని మర్చిపోకూడదని సాటి నటులకు మనవి చేస్తున్నా. 'నీవల్ల నేనింత గొప్పవాణ్ణి అయ్యాను' అని గుర్తుపెట్టుకుంటే చాలు. అంతకు మించిన గురుదక్షిణ ఈ లోకంలో లేదు. ఎవరూ ఏమీ ఆశించరు కూడా...నా కెరీర్‌లో నటనకు సంబంధించినంత వరకు నాకు తెలిసి ఏ తప్పులూ చేయలేదు. మనిషిగా నాకున్న ఇబ్బందులు నాకున్నాయి. వ్యక్తిగతంగా ఏవైనా తప్పులు ఎప్పుడైనా దొర్లి ఉంటాయేమో!

**బాల్యంనుండీ నటననే నమ్ముకున్నారు కోట శ్రీనివాసరావు. తిండికిలేకో, చదువు అబ్బకో ఆయన ఈ రంగంలోకి రాలేదు. మంచి ఉద్యోగం చేస్తూ సుఖంగా ఉన్న సమయంలో సినిమారంగమే ఆయన్ను పిలిచింది. ఆయనకంటే సీనియర్లు, గొప్ప క్యారెక్టర్ ఆరిస్టులు ఉన్నప్పటికీ పద్మశ్రీ వంటి ఉన్నత పురస్కారం కోటగారినే వరించింది. అయినా గానీ నటుడుగా ఆయన దాహం తీరలేదు. ఇంకా ఏం కోరుకుంటున్నారాయన?**





కంకిపాడులో పురుడుపోసుకున్న నా జీవితం దేశరాజధానిలో పద్మశ్రీ పురస్కారం అందుకునే వరకు సాగడమనేది నాలాంటి వాడికి చాలా గొప్ప విషయం. మీ అందరి ఆశీర్వాదాలు నాకుంటాయని నమ్మకం ఉంది. నేను, నా పిల్లలు, నా కోడలు, మనవలు చల్లగా ఉండాలని అందరూ ఆశీర్వదిస్తారని కోరుకుంటున్నా.. ఆఖరిగా ఒక్క మాట. నేను మరణించేంతవరకూ నటించాలి. నేను మరణించిన తర్వాత నటుడిగా బతకాలి. పాఠకులకు వేనవేల నమస్కారాలు. ఉంటాను మరి. సెలవ్!!

**(అయిపోయింది)**

—డా.చల్లా భాగ్యలక్ష్మి
సెల్: 88850 55528



# పరిపూర్ణం

తాటవర్తి నాగేశ్వరి

**నేను చాలా అదృష్టవంతురాలినండీ.**
**ఊహు..నీకన్నా నేనే ఎంతో అదృష్టవంతుణ్ణి.**
**ఎలా?!**
**నీలాంటి అందమైన సుందరీ, పరువాల పందిరీ ప్రతీరోజూ ఇలా అందాలవిందు చేస్తూవుంటే... ఉంటే....?**

మగాడికి స్వర్గంతో పనేముంది, హాయిగా...

హాయిగా....?

నీ అధరామృతాన్ని గ్రోలుతూ, నీ కౌగిలిలో బందీ అవుతూ...

అవుతూ....?

రసకేళీ చక్కర కేళీల్ని తనివితీర్చే వలపుల తేనెల ఊటలతో కలిపి ఆస్వాదిస్తూ, ఇంకా...

ఇంకా....?

సరస కవిత్వం చెప్పుకుంటూ మన్మథ చరితం చదువుకుంటూ...

అబ్బా....?

ఏమైందీ.....?

ఓ వైపు రసకవిత్వం చెబుతూనే మరోవైపు నా ఒళ్ళంతటినీ తెల్లకాగితం చేసుకుని కవ్వింతల కలంతో రాసేస్తున్నారుగా...అబ్బా...ఊఁ...

అలాగా....?!

ఊ...ఏం తెలియనట్టు...నంగనాచి...సరస సవ్యసాచి.

ఓహో, నీకూ కవిత్వం వచ్చేస్తోందే....?!

సహవాసం సమభాగం కదూ మరి....

టక్...టక్....టక్....

***

అమ్మగారూ...అమ్మగారూ...టక్...టక్...టక్...

తుళ్ళిపడింది లత!

నేనండీ పనిమనిషిని. తలుపుతియ్యండి అమ్మగారూ!

***

ఆ ముఖ్యమైన కాగితాలు తన టేబుల్‌మీద పదిగంటలకల్లా ఉండాలన్న ఆదేశం అమలు జరగలేదు! పంక్చువాలిటీలో గడియారం ముల్లంత కచ్చితత్వం..పనిపట్ల ఉడుముపట్టులాంటి అంకితభావం.. ప్రణాళికల్లో యుగంధరుడి మనస్తత్వం... అన్నీ కలగలిసి అతన్ని ఓ బట్టల దుకాణం గుమాస్తా స్థాయి నుండి క్యూ... క్యూ...ఎక్స్‌పోర్ట్స్ అండ్ ఇంపోర్ట్స్ సంస్థ అధిపతిస్థాయికి తీసుకువచ్చి గౌరవించాయి!

అతను ఇంటర్‌కమ్‌లో మళ్ళీ అడిగాడు.

ఆమె ఇంకా రాలేదు సర్

లీవు పంపించారా...?

లేదు సర్!

ఎక్స్‌ప్లనేషన్ కాల్ఫర్ చేయండి. ఈ రోజు శాలరీ కూడా డిడక్ట్ చెయ్యండి. అలాగే సర్.

సర్, ఇప్పుడే ఆమె వచ్చారు సర్.

గెట్ హర్ ఇంటూ మై ఛాంబర్...ప్లీజ్ ఫాలో హర్.

కృష్ణదేవ్‌లో ఒక రాక్షసుడున్నాడు. అతడిపేరు పని. అతనిలో ఒక దేవుడున్నాడు. పనిమంతులకు వరాలిచ్చే వరదుడు! ఇప్పుడు అతనిలో రాక్షసుడే ఉన్నాడు!

మే ఐ కమిన్ సర్.

..........

మే...ఐ...

గెటిన్...టైమ్ ఎంతైందో చూసుకున్నారా?

స...స్సారీ సర్...వెరీ సారీ సర్!

సారీస్ నెవర్ ఎచీవ్ ద టార్గెట్స్. వేరీజ్ పేపర్స్ ఇన్‌పుట్...?

ఇప్పుడే తెస్తాను సర్.

వాటిని అప్‌డేట్‌గా కనెక్ట్‌చేసి అప్‌లోడ్ చేశారా?

చేస్తాను సర్..సారీ సర్...నిన్ననే చేసేశాను సర్....

పుట్ దెమ్ హియర్ ఇమ్మీడియట్లీ..!

ఎస్సర్..

మరో రెండు నిమిషాల తర్వాత...

ఆల్‌రైట్.. ఆల్‌రైట్... ఓకే...

నౌ యు కెన్ గో...

థాంక్యూ సర్!

ఓ ఎస్ గారూ, సిబ్బందిలో మంచీ చెడూ రెండూ ఉంటాయి. వారిలో మంచిని పెంచేలా చేయండి. చెడును ఎప్పటికప్పుడు తుంచేస్తూ ఉండండి.

అలాగే సర్!

మీరిక వెళ్ళండి. ఆ చూడండీ..ఈ రోజు ఆవిడ శాలరీ కట్ చేయమన్నాను. చేయొద్దు.

అలాగే సర్!

***

లంచ్ అవర్‌లో..

పెరుగు అన్నం, ఉండికించిన బీన్స్, కరివేపాకు పచ్చడి, అరటికాయ మెంతికూర, కాసిని కీరా ముక్కలు, ఇదే భోజనం. దేంట్లోనూ తగినంత ఉప్పు ఉండదు. జిహ్వకు 'తీపి' లేకుండాపోయి ఏడేళ్ళయింది. బ్రతుకులో తీపి మరచిపోయి పాతికేళ్ళు దాటిపోయింది.

ఒంటరి భోజనం ముగించి కాసేపు తన పర్సనల్ గదిలో మేనువాల్చాడు కృష్ణదేవ్.

ఆఫీస్ క్యాంటీన్‌లో అందరిలానే షడ్రుచులతో భోజనం చేస్తాడు రవీంద్ర. ఆ సంస్థలో రవీంద్ర ఓ విభాగానికి చిన్నస్థాయి అధికారి! పనివేళలు పాటించడంలో కృష్ణదేవ్‌ను ఆదర్శంగా తీసుకుంటాడు. ఆ ఆఫీసులో కృష్ణదేవ్ అంటే భయంతో కూడిన గౌరవం, రవీంద్ర అంటే అభిమానంతో కూడిన గౌరవం చూపిస్తుంటారు.

రవీంద్రగారు...ఎలాగైనా నా లీవ్ శాంక్షన్ అయ్యేలా చూడండి సర్..

ఏమిటి విశేషం?

రేపు మా మేరేజ్ డే సర్, సరదాగా ఆరకు వెళ్ళి రావాలని ప్లాన్ చేసుకున్నాం సర్.

అలాగా... హ్యాపీ మేరేజ్ డే! కానీ నేను అడుగుతున్న విశేషం అదికాదు. లీవ్ లెటర్ని ఓయస్‌గారికి ఇవ్వకుండా నాకు ఇచ్చి శాంక్షన్ అయ్యేలా చూడమంటున్నావే?

ఓయస్‌గారికి ఇస్తే తీసుకోను అన్నారు సర్. ముందుగా బాస్‌కు ఇన్ఫార్మ్ చేసి ఆయన ఓకే అంటేనే తీసుకుంటారట సర్.

అదెప్పటినుండీ...?

## అనుపమ రూటే సెపరేటట!

**టాలీ**వుడ్‌లో ప్రస్తుతం ఉన్న హీరోయిన్లలో చాలా మంది పరభాషా నాయికలే! వారిలో చాలామందికి అవకాశాల గోలే తప్ప తెలుగు భాష నేర్చుకోవాలన్న ఆసక్తి లేదు. కానీ అలాంటి వారికి తను భిన్నం అంటోంది అనుపమా పరమేశ్వరన్. అనుపమ తెలుగులో చేసినవి తక్కువ సినిమాలే అయినప్పటికీ తెలుగు భాష మీద మక్కువ పెంచేసుకుంది. ఎలాగైనా భాష నేర్చేసుకుని తన డబ్బింగ్ తనే చెప్పుకోవాలని డిసైడ్ అయిపోయిందట! అందుకోసం ప్రత్యేకించి ట్యూషన్ కూడా పెట్టించుకుందట! గతంలో ఓ తెలుగు సినిమాకి డబ్బింగ్ చెప్పినా, అది అంత బాగాలేదని అనిపించిందట! ఈ సారి అలా కాకుండా పర్‌ఫెక్ట్‌గా తెలుగు నేర్చుకోవాలని డిసైడ్ అయిపోయిందట! ఎంతైనా అనుపమ రూటే సెపరేటు అంటున్నారు సినీ జనాలు.



ఉదయం లాజిస్టిక్స్ సెక్షన్ లతగారి విషయంలో డ్యూటీ నెగ్లిజెన్స్ మీద కోప్పడ్డారట సర్. మళ్ళీ ఆయన చెప్పేవరకు తన అనుమతి లేనిదే ఎవరికీ లీవ్ శాంక్షన్ చేయొద్దన్నారట సర్.

అవును. మనకు కొత్త క్లయింట్స్ రేపు రాబోతున్నారు. ఆ సందర్భంగా ఏ ఇన్ఫర్మేషన్ అవసరం అవుతుందో అని ముందు జాగ్రత్త చర్య కాబోలు, అందుకే అలా అని ఉంటారు.

నా సీటుకు సంబంధించిన వివరాలు అన్నీ ఫీడ్ చేసే ఉంచాను సర్. పాస్‌వర్డ్ బాస్‌కు లేదా మీకు ఇస్తాను సర్...సాఫ్ట్ కాపీ తీసుకోవచ్చు. లీవ్ శాంక్షనయ్యేలా చూడండి సర్...ప్లీజ్!

నిట్టూర్చాడు రవీంద్ర.

మీది ఎన్నో మేరేజ్ డే మేడమ్?

పదోది సర్. కాస్త సిగ్గుపడుతూ అంది రజని.

తను ప్రేమిస్తున్న శ్రీజతో పెళ్ళై ఉంటే ఈ పాటికి తను మూడో పెళ్ళిరోజు చేసుకుని ఉండేవాడు! కానీ కాలం కరుణించలేదు. కాలం కాదు... ఆయనే కరుణించలేదు! నిరాశగా నిట్టూర్చాడు రవీంద్ర!

రికమెండేషన్స్ ఆయన అంగీకరించరని మీకు ముందే తెలుసుగా అన్నాడు. ఇక నేనేం చేయగలను అన్నట్టుగా చూశాడు.

తల వాల్చేసింది రజని.

అలా అప్‌సెట్ కావద్దండీ. ఐదు గంటలు దాటాక మీరే ఛాంబర్‌లోకి వెళ్ళి ప్రయత్నించండి. ఆ పైన నేను ప్రయత్నం చేస్తాను.

ఉత్సాహం తెచ్చుకుంది రజని.

బాస్ ఛాంబర్‌లో....

సర్...రేపు మా మేరేజ్ డే...

గుడ్....హ్యాపీ మేరేజ్ డే!

థాంక్యూ సర్...రేపు ఒక్కరోజు లీవు...

సారీ రజనిగారూ. వుయ్ హేవ్ టు రిసీవ్ అవర్ న్యూ క్లయింట్స్ టుమారో. ఉయార్ షుడ్ బి ఇన్ ద ఆఫీస్ టు ఆనర్ దెమ్.

రజని కళ్ళనీళ్ళు గమనించాడు కృష్ణదేవ్.

అందమైన ముఖం, తీరైన శరీరం, కళ్ళల్లో కాంతి దాచిన దైన్యం...

మీకు ఎంతమంది పిల్లలు...?

ఒక్కడే సర్.

ఏం చదువుతున్నాడు?

థర్డ్ స్టాండర్డ్ సర్...

మీ వారు మీ పట్ల ఎలా ఉంటారు? ఐ మీన్ ఫ్రెండ్లీగా, హెల్ప్‌ఫుల్‌గా, కార్డియల్‌గా లేదా రిజర్వ్‌డ్‌గా, ఒక బాస్‌లా....?

చాలా ఫ్రెండ్లీగా, కార్డియల్‌గా ఉంటారు సర్

మరి మీరు...?

ఒక్క క్షణం అర్థం కానట్టు చూసింది రజని.

మీరు....మీవారిపట్ల అలానే ఉంటారా?

ఎస్సర్....మా వారంటే నాకు పంచప్రాణాలు సర్. ఒకరిపట్ల మరొకరం డెడికేటెడ్‌గా ఉంటాం సర్.

రజనీ మాటల్లో ఉద్వేగం గమనించాడు కృష్ణ దేవ్. రెండు క్షణాలు ఆమె ముఖం చూస్తూ ఉండి పోయాడు. బాస్ తననే చూస్తున్నట్టు గమనించి తలదించుకుంది రజని.

అరకు వెళుతున్నామని రాశారు. ఒక్కరోజులో వెళ్ళిరావడం ఇబ్బంది కావచ్చు. కనుక....

ఉత్కంఠతో తలెత్తి చూసింది రజని.

రెండు రోజులు లీవు తీసుకోండి. మీ పాస్‌వర్డ్ ఇచ్చి వెళ్ళండి.

ఉక్కిరి బిక్కిరైపోయింది రజని. కలా నిజమా అన్న విభ్రమలో పడిపోయింది.

"మీరు విన్నది నిజమే రజనిగారూ! మీ కుటుంబ జీవితంలో మీరు ఎంత నిజాయితీగా ఉంటున్నారో అలాగే మీ ఉద్యోగ జీవితంలోనూ ఉండాలని గట్టిగా నిర్ణయించుకోండి

తప్పకుండా సర్!

యు కెన్ గో నౌ, వన్స్ ఎగైన్ హ్యాపీ మేరేజ్ డే

థాంక్యూ సర్...థాంక్యూ సర్...

***

"రేపు శ్రీజ బర్త్ డే. తను మన ఆఫీస్‌లో చేరి సరిగ్గా రేపటికి రెండేళ్ళు పూర్తవుతున్నాయి.

నీవు ప్రేమించి రెండేళ్ళు దాదాపు పూర్తవుతున్నాయని ఇన్‌డైరెక్ట్‌గా చెబుతున్నావని నాకు తెలుసు...

నేల చూపులు చూస్తూ తల ఊపాడు రవీంద్ర.

చూడు రవీంద్రా! ఆమెను నువ్వు ప్రేమించడంలో తప్పులేదు. నిన్ను ఆమె ప్రేమించడంలోనూ వింతలేదు. కానీ మీరు పెళ్ళి చేసుకున్న తర్వాత జరగబోయేవేవీ 'వింత' కాకూడదు. ఆమె నిన్ను చేసుకుంటే వైఫ్ ఆఫ్ రవీంద్ర అవుతుందని నీవూ, నీలానే చాలామందీ అనుకుంటారు. కానీ నేను ఈ కృష్ణదేవ్‌కి తగ్గ కోడలు, మన కంపెనీకి భవిష్యత్ యజమానికి తగిన భార్య కూడా కావాలని కోరుకుంటాను. ఆ స్థాయికి ఆమె చేరుకునేందుకు కావాల్సిన క్వాలిటీస్ కొన్ని ఇంకా ఆమెలో డెవలప్ కాలేదనిపిస్తోంది. త్వరలో వాటిలో "స్కిల్ అండ్ పర్ఫెక్షన్ సాధిస్తుందని నమ్ముతున్నాను.

నాన్నగారూ...

రవీంద్రా, నేను బతుకుతున్నది, నిస్సారమైన

**బాల్యంలోనే కన్నతండ్రి మరణించడంతో త్యాగమూర్తిగా మారిందామె. ఇద్దరు చెల్లెళ్ళను, తమ్ముణ్ణి చదివించి పెళ్ళిళ్ళు చేసింది. ఇప్పుడు అంతా హ్యాపీ. కానీ ఆమె యవ్వనం కాలంతోపాటే కరిగిపోయింది. ఇక అతని సంగతి. పేదరికం భరించలేక వదిలి వెళ్ళిపోయిందతని భార్య. కోరికలన్నీ వదులుకుని కసితో సంపాదించి ఎదిగాడతను. స్త్రీలంటే ద్వేషం పెంచుకున్నాడు. చివరికి వీరి జీవితాల్లో కొంచెమైనా వెలుగు ప్రసరించిందా?**

నా బ్రతుకును ఇంకా పొడిగించుకునేందుకు మాత్రం కాదు. మారిపోతున్న ఈ వ్యవస్థలో నా జీవితం సుఖమయంగా మధురంగా కడదాకా సాగాలన్నదే నా తపన. తొందరపడి తీసుకునే నిర్ణయాలు పశ్చాత్తాపానికి కారణం కాకూడదు. దయచేసి అర్థం చేసుకో. తల ఊపాడు రవీంద్ర. బరువుగా నిట్టూర్చాడు కృష్ణదేవ్!

***

ప్రముఖ గైనకాలజిస్ట్, సెక్సాలజిస్ట్ స్నేహదీపిక పర్సనల్ ఛాంబర్‌లో సంభాషణ...

లతా, నువ్వు నా క్లాస్‌మేట్‌వి. నీ గురించి నాకు నీ చిన్నప్పటినుంచీ తెలుసు. నా గురించి నీకూ తెలుసు. ఒక డాక్టరుగా నీ విషయంలో అన్ని పరీక్షలు చేశాను. ఆ పరీక్షల గురించి డాక్టరుగా కాదు, నీ స్నేహితురాలిగా, నీ శ్రేయోభిలాషిగా చెబుతున్నా, విను.

నీలో రెండు లక్షణాలు కనిపిస్తున్నాయి. మొదటి రకం వయోసహజమైనది. రెండో రకం ఏదైతే స్త్రీకి పరిపూర్ణత్వాన్నీ మాతృత్వాన్నీ ప్రసాదిస్తుందో ఆ జీవితాన్ని కోల్పోయావు! నీకు నిజానికి ఆ జీవితం పట్ల విముఖత లేదు. అవకాశం లేక ఆగిపోయింది ఆ జీవిత దశ! ఇప్పటికీ దాన్ని పొందాలన్న కోరికైతే నీలో ఇంకా బలంగానే ఉంది. కానీ మన వ్యవస్థలోని కట్టుబాట్లు, నియమాల కారణంగా ఆ కోరికలు తీరే అవకాశంలేక వాటిని బలవంతంగా అణిచిపెట్టుకున్నావు. డిప్రెషన్...ఆత్మహత్యావాంఛ.. శరీరంలో అబ్‌నార్మల్ టెంపరేచర్ భ్రాంతి, నీ మీదే నీకు కోపం, తీరని కోరికలు కలల్లా మారి నిన్ను కవ్విస్తూ ఉండటం...ఇవన్నీ వాటి లక్షణాలే! వాటిలోని వయోసహజ లక్షణాల వల్ల కలిగే బాధలకు సమస్యలకు మందులు ఇవ్వగలను. కానీ రెండోరకమైన లక్షణాలకు మందులు ఉన్నాగానీ పూర్తిగా




వాటికి ఫలితం లభించదు. పైగా అవాంఛితమైన తీవ్ర పరిణామాలు నీలో సంభవించవచ్చు!

లతా, నిన్నొక త్యాగశీలిగా గుర్తిస్తాను. అభినందిస్తాను. తండ్రి చిన్నప్పుడే పోయినా కుంగిపోకుండా నిలదొక్కుకున్నావు. ఇద్దరు చెల్లెళ్ళు, తమ్ముడి బాధ్యతలు భుజాన మోశావు. వాళ్ళని చదివించావు. వాళ్ళకు పెళ్ళిళ్ళు చేశావు. ఇప్పుడు అందరూ ఒక ఒడ్డుకు చేరుకున్నారు. హాయిగా బతుకుతున్నారు. ఈ బాధ్యతలన్నీ తీరేసరికి నీ యవ్వనదశ కాలంతో పాటు కరిగిపోయింది. ఆ దశ మరిక తిరిగిరాదు. ఒక విషయం తెలుసుకో. చాలామందిలో శరీర దశలు మారినంత వేగంగా మానసిక దశలు మారవు! కనుకనే వయసు మీరినా శృంగార కోరికలు తీరని వారు చాలామంది ఉన్నారు. ఒకవిధంగా అది ఆరోగ్య లక్షణం కూడా! ఆలా అని ఆ కోరికలు మరీ ప్రకోపించి 'ఎరోటిక్ మానియా'కు గురిచేస్తే అవి వాళ్ళనే అనేక సమస్యల్లో పడేస్తాయి. అవమానాలకు గురిచేస్తాయి. లత తదేకంగా డాక్టర్‌నే చూస్తూ, ఆమెలో ఉన్న తన స్నేహితురాలి మాటల్ని శ్రద్ధగా వింటోంది.

లతా, నీలో కోరికలు సజీవంగానే ఉండటం తప్పుకాదు. సహజవిరుద్ధమూ కాదు. కానీ సవ్యమైన మార్గంలో ఈ కోరికలు తీరే అవకాశం లేక శారీరకంగా, ముఖ్యంగా మానసికంగా చాలా నలిగిపోతున్నావు. స్నేహదీపిక కాసేపు ఆగి ఒక నిట్టూర్పు విడిచింది.

దానికి ఒకటే పరిష్కారం! నీకు నచ్చిన, నిన్ను కోరిన వ్యక్తి ఎవరైనా సంసిద్ధత వ్యక్తం చేస్తే పెళ్ళి చేసుకోవడం మంచిది. నీకు ఇక పిల్లలు కలిగే అవకాశం లేదు. ఆ కోరిక తీరకపోయినా హాయిగా దాంపత్య జీవితాన్ని మాత్రం కొనసాగించవచ్చు. అంతేకాదు, మిగిలిన నీ జీవితానికి ఒక తోడూ, నీ కష్టసుఖాల్లో పాలు పంచుకునే భాగస్వామీ కావాలిగా! నువ్వు ఊc అంటే ఆ ప్రయత్నంలో ఉంటాను నేను.

***

కృష్ణా! నీ బాల్య స్నేహితుడిగా నాకు నీవంటే ఏమిటో పూర్తిగా తెలుసు. నువ్వు ఏ స్థితి నుంచి ఏ స్థితికి చేరుకున్నావో కూడా తెలుసు. అందుకు నువ్వు సాగించిన నిరంతర కృషీ తెలుసు నాకు. లేమి, కలిమి, కష్టం, సుఖం అన్నిటినీ సమభాగంగా పంచుకోవల్సిన నీ సహధర్మచారిణి లేమిని, కష్టాలను మాత్రం నీకు వదిలేసి కలిమికోసం, సుఖాలకోసం వెంపర్లాడుతూ నిన్ను వదిలి వెళ్ళిపోయింది. ఒంటరివైపోయిన నీవు కుంగిపోకుండా కసితో కష్టాలకు ఎదురీది కృషిచేసి సుఖాల తీరం

చేరుకున్నావు. ఒక్కగానొక్క కొడుకు రవీంద్రను ప్రయోజకుణ్ణి చేశావ్. ఒకనాటి లేమికీ...నేటి కలిమికీ మధ్య పాతికేళ్ళు గడిచిపోయాయి. ఆడవాళ్ళంటే ఓ రకమైన కసి పెంచుకుని నిన్ను నీవు మానసికంగా చంపుకున్నావు. ఒక స్నేహితుడిగా నీకు చెబుతున్నాను. ఈ దశలో నువ్వు నీకు తెలియకుండానే ఒక తోడు కోసం తపిస్తున్నావు. నేనున్నాను అని చెప్పే ఒక ప్రేమమూర్తి కోసం ఎదురు చూస్తున్నావు. ఇదోరకమైన డ్యూయల్ మెంటాలిటీ! భార్యాభర్తలు ఎవరైనా అన్యోన్యంగా ఉంటే, నీకు దక్కనిది వాళ్ళకు దక్కుతోందన్న కసి నీలో బుసలు కొడుతోంది. కానీ కొంత సమయం గడిచాక నీలో మంచి మనిషి, ప్రేమమూర్తి మేల్కొంటున్నాడు. అన్యోన్యంగా ఉన్నవాళ్ళను చూసి అభినందిస్తున్నాడు. అవసరమైన సందర్భాల్లో సహాయపడుతున్నాడు. ఇది చాలా గొప్ప విషయం. కానీ నీలోని 'మగాడు' మాత్రం నిద్రాణంగా పురుష సంబంధ వాంఛలకూ, సహజమైన అనుభూతులకూ దూరమైపోతున్నాడు. ఈ అనుభూతులు తీరని జీవితం ఎప్పటికీ పరిపూర్ణం కాదు! నీవు ఎంత స్థాయికి ఎదిగినా అది అసంపూర్ణమే అవుతుంది! కనుక నువ్వు బాగా ఆలోచించుకో. ఇప్పటికీ మించిపోయింది లేదు. కేవలం యాభై దాటినవాడివి. ఇప్పుడు నువ్వు చేయాల్సింది నీకు తగ్గ స్త్రీని నువ్వు పెళ్ళి చేసుకోవడం. ఆ తర్వాత నీ కొడుకు ప్రేమించిన అమ్మాయితో అతనికి పెళ్ళి జరిపించడం! ఇవి జరిగితే మీ ఇద్దరి జీవితాలూ పరిపూర్ణం అవుతాయి. నువ్వు సరేనంటే ఆ బాధ్యత నేను తీసుకుంటా ముగించాడు కృష్ణదేవ్ స్నేహితుడు రామకృష్ణ. రామకృష్ణ ప్రముఖ సైకియాట్రిస్ట్ మాత్రమే కాదు, సైకాలజిస్టు కూడా. అతని భార్య డాక్టర్ స్నేహదీపిక.

***

లతా...

ఊ..

ఐ యామ్ వెరీ లక్కీ...

నేను...నేనూ చాలా లక్కీ..

మనం చాలా పోగొట్టుకున్నాం కదూ..

............

చెప్పు లతా...

పోగొట్టుకున్నదంతా వడ్డీతో కలిపి పొందబోతున్నాంగా..

కమర్షియల్‌గా చెప్పినా ఎంతబాగా చెప్పావ్. అన్నట్టు నీకు మంచి మంచి స్వీట్ డ్రీమ్స్ వచ్చేవట కదా...ఎవరా డ్రీమ్ హీరో..?

.............

ఏంటలా ఆశ్చర్యంగా చూస్తున్నావు. నాకు ఎలా తెలిసిందనా?

నా స్నేహితురాలు స్నేహ చెప్పింది కదూ...

భలే కనిపెట్టేశావే! తెలివైనదానివే.

సిగ్గుపడుతూ తల ఊపిందామె. కాంప్లిమెంట్‌కు పొంగిపోతూ చూసింది.

మరి ఆ హీరో ఎవరో చెప్పవూ? ప్లీజ్!

ఆ హీరో చాలా మంచి మనిషి. మాట చురుక్కుమనిపించినా మనసు వెన్న...!

తీరైన ఫిజిక్. ప్రవర్తనలో ఎవరినైనా ఇట్టే ఆకర్షించే గుణం ఉన్న మనిషి.

అంతేనా...పేరు చెప్పలేవా?

ఆయన గురించి ఎంతచెప్పినా తక్కువే.

ప్లీజ్...పేరు...?

క్రిష్...అయినా కౌగిట్లో బందీ చేసినవారి పేరెలా చెప్పను?

అంతే! ఇరువురిలోని తీయని భావాలు, ఎదలో రాగాలు కలిసి ఒక్కటై 'శృతి' చేసుకున్నాయి. ఆ పై ప్రణయ గీతాలను ఆలపించాయి. ఆ రేయంతా అవి కొనసాగుతూనే ఉన్నాయి. ఆ ఇరువురి భాషకు లిపి లేదు చిలిపితనం తప్ప! ఆ ఇరువురి తనువుల భాషకూ వ్యాకరణం లేదు. రస (క)రణం తప్ప....! ఆ తనువూ మనసుల సరసతకు పలుకుబడి లేదు. ఒకరి నుండి ఒకరు నేర్చుకునేందుకు తెరుచుకున్న మన్మథుడి 'బడి' తప్ప!

సెల్: *99897 73549*

## మనమీదేనట్రోయ్!

సరసి





# బ్లాక్ బ్యూటీ



**తెల్లని చర్మం వ్యసనపరులున్న ప్రపంచం మనది. వైటెనింగ్ ట్రీట్మెంట్లు, ఫొటో ఎడిట్ యాప్‌లతో ఆ వ్యసనానికి బానిసలైన ఈ విశాల విశ్వంలో ఓ సుడానీస్ మోడల్ నల్లని ఒంటి రంగుతో సంచలనం సృష్టిస్తోంది. తెలుపు కంటే నలుపే అందం అంటూ నల్లని చర్మం, అంతకుమించిన ఆత్మవిశ్వాసంతో ప్రపంచాన్ని తన వైపు తిప్పుకుంది. 'క్వీన్ ఆఫ్ డార్క్' అనే ముద్దు పేరుతో మెరిసిపోతున్న ఈ బ్లాక్ బ్యూటీ గురించి మరిన్ని విశేషాలు.**

ఆఫ్రికా దేశాల్లో ప్రజలు రంగు తక్కువగా ఉంటారనే విషయం అందరికీ తెలిసిందే! కానీ ఆ నలుపును తలదన్నే కారు నలుపుతో పుట్టేసిందో అమ్మాయి. పేరు...'న్యాకిమ్ గట్వెచ్'. పుట్టింది మొదలు 24 ఏళ్ల వయసుకి చేరుకునే వరకూ తన శరీర రంగు వల్ల ఎన్నో అవమానాలకు గురైంది. అలా అవమానించిన వారిలో స్వదేశీయులూ ఉండటంతో ఆ అమ్మాయికి చర్మపు రంగు గురించి ప్రపంచవ్యాప్తంగా పాతుకుపోయిన అభిప్రాయాల్ని విదిల్చి కొట్టాలనిపించింది. అంతే! ఇక అప్పటినుంచి తన చర్మపు రంగునే మరింత హుందాగా ప్రదర్శించటం మొదలుపెట్టింది. ఆమె ప్రయత్నం వృథా కాలేదు. అతి కొద్ది కాలంలోనే ఆమె రంగును, ఆ రంగులోని మెరుపుకు ప్రపంచ దేశాలన్నీ హారతిపట్టి మరీ స్వాగతించాయి. దాంతో న్యాకిమ్ గట్వెచ్ ఇప్పుడు ప్రపంచస్థాయి మోడల్‌గా ఎదిగిపోయింది.



## ఉబర్ డ్రైవర్‌కు షాకిచ్చిన న్యాకిమ్

ఇన్‌స్టాగ్రామ్‌లో ఎప్పటికప్పుడు ఫొటోలు, వివరాలు అప్‌డేట్ చేసే న్యాకిమ్ తాజాగా తన అనుభవాన్ని పోస్ట్ చేసింది. ఓసారి ఉబర్ కారులో ప్రయాణించిన న్యాకిమ్ గమ్యం చేరుకోగానే కారు దిగబోతుంటే ఆ ఉబర్ కారు డ్రైవర్ ఆమెతో ఓ మాటన్నాడట. 'మీరేమీ అనుకోనంటే మిమ్మల్నో మాటడుగుతాను. పదివేల డాలర్లిస్తానన్నా మీరు మీ ఒంటిని బ్లీచ్ చేసుకోవటానికి ఒప్పుకోరా? అని అడిగాడట ఆ డ్రైవర్. దానికి న్యాకిమ్ పగలబడి నవ్విందట. అప్పుడా డ్రైవర్ ఆ నవ్వుకి అర్థం 'నో' అనేగా అన్నాడట. అందుకామె 'అవును, కచ్చితంగా 'నో' నే! దేవుడి దయ వల్ల నాకు సంక్రమించిన ఇంత అందమైన చర్మాన్ని బ్లీచ్ ఎందుకు చేసుకోవాలి? అని అడిగిందట. అప్పుడా డ్రైవర్ 'నీ ఒంటి రంగు దేవుని దయా?' అని ఆశ్చర్యంగా అడిగాడట. 'అవును'...నాలాంటి చర్మం ఎందరికుంటుంది? అని సమాధానమిచ్చిందట. ఈ సంభాషణనంతా ఇన్‌స్టాగ్రామ్‌లో పోస్ట్ చేసిన న్యాకిమ్ మరో మాట కూడా చెప్పింది. తనకున్న ఈ ప్రత్యేకత, తనను తాను ప్రేమించుకునేతత్వాలే అందం గురించి తాను మరింత కాన్ఫిడెంట్‌గా ఫీలయ్యేలా చేశాయట.



## యువతకు న్యాకిమ్ సలహా

తమ ఒంటిరంగు చూసుకుని కుంగిపోయే అమ్మాయిలకు న్యాకిమ్ అమూల్యమైన సలహా ఇస్తోంది. 'మీరు అందంగా ఉన్నారు. మీకు మీరే ప్రత్యేకం. మీకు మీలా ఉండే మీలాంటి వాళ్లనే ప్రజలు ప్రేమిస్తారు. ఎదుటి

వారి కోసం మిమ్మల్ని మీరు మార్చుకోకండి. మీరు మీకోసం జీవించండి. సహజసిద్ధమైన శరీర వర్ణంతోనే గుర్తింపు తెచ్చుకునే ప్రయత్నం చేయండి. మిమ్మల్ని విజయం తప్పక వరిస్తుంది' అంటూ బ్లీచింగ్‌ల మీద ఆధార పడి చర్మాన్ని పాడుచేసుకుంటున్న యువతులకు సలహా ఇస్తోంది న్యాకిమ్.



## అవమానాలెన్నో!

న్యాకిమ్ చిన్నతనం నుంచీ పొందిన అవమానాలతో పోల్చుకుంటే క్యాబ్ డ్రైవర్ విషయం ఎంతో చిన్నది. ఈ విషయం న్యాకిమ్ స్వయంగా చెప్పింది. అంతకంటే అవమానకరమైన, భయంకరమైన ప్రశ్నలెన్నో ఎదుర్కొందట న్యాకిమ్. యాహూ బ్యూటీతో న్యాకిమ్ మాట్లాడుతూ మరీ ముఖ్యంగా అమెరికాకు వచ్చాక ఎన్నో సందర్భాల్లో ఆమె ఒంటి రంగు గురించి విమర్శలను ఎదుర్కొందట. దాంతో తన స్వీయానుభవాలను షేర్ చేస్తూ తన ఆత్మవిశ్వాసం ఎంత ఉన్నతమైనదో తెలియజెప్పటంతోపాటు ఆత్మన్యూనతతో బాధపడే అమ్మాయిల ఆత్మవిశ్వాసం పెంచే ప్రయత్నాలు మొదలుపెట్టింది న్యాకిమ్. ప్రస్తుతం 'మిన్నెపోలిస్'లో ఉంటున్న న్యాకిమ్ ఇప్పుడెంత స్కిన్ పాజిటివిటీని ప్రమోట్ చేస్తున్నా తనను తాను యాక్సెప్ట్ చేసుకునే క్రమంలో సాగిన జీవన ప్రయాణం అంత సజావుగా లేదని ఓపెన్‌గా చెప్పుకొచ్చింది. అబ్బాయిలకు అందంగా కనిపించటం కోసం, అసహ్యించుకునే చూపులు, ఎగతాళి, అవమానాలు తప్పించుకోవటం కోసం ఓ సమయంలో బ్లీచింగ్‌ను ఆశ్రయించిందట.



## న్యాకిమ్ సహచరి 'ఖోడియా డియోప్'

న్యాకిమ్‌లాగే ఆమెతో పనిచేసే మోడల్ ఖోడియా డియోప్ కూడా చర్మం రంగు గురించి ఎన్నో అవహేళనలు ఎదుర్కొంది. నల్లనిచర్మంతో ఈ మోడల్ 'డార్కీ', 'డాటర్ ఆఫ్ ది నైట్' అనే నిక్‌నేమ్స్ కూడా పొందింది. ఈమె కూడా ఆ అవమానాలకు ఫుల్‌స్టాప్ పెట్టాలని నిర్ణయించుకుని తనను తాను ప్రేమించటం మొదలు పెట్టింది. ఫలితం...ఇప్పుడామె ఓ హై ఫ్యాషన్ మోడల్. 'పెరిగేకొద్దీ నన్ను నేను ఇష్టపడటం మొదలు పెట్టాను. నన్ను చూసి గేలి చేసే వాళ్ల మాటలు పట్టించుకోవటం మానేశాను. ఈ నైజం నా ఎదుగుదలకెంతో సహాయపడింది. ఈ అనుభవంతోనే న్యాకిమ్‌కు ఒకే మాట చెప్పాను. అంతర్గతంగా అందంగా ఉన్నంతవరకూ పైకి నువ్వెలా కనిపిస్తున్నావనేది ముఖ్యం కాదు'...ఇలా ఖోడియా చెప్పిన మాటలు న్యాకిమ్‌మీద గొప్ప ప్రభావాన్నే చూపాయి. ఆమె అడుగుజాడల్లో నడిచిన న్యాకిమ్ ఇప్పుడో సూపర్‌మోడల్. ఇన్‌స్టాగ్రామ్‌లో 65 వేల మంది ఫాలోవర్లకు ఆమె ఒకటే మాట చెప్తోంది.... 'నా చర్మం సూర్యకిరణాలను పీల్చుకుంటూ ఉంటే, నా వెంట్రుకలు భూమ్యాకర్షణకు వ్యతిరేకంగా సంచరిస్తుంటాయి. మరి ఇప్పుడు చెప్పండి...నేను ఓ అద్భుతాన్ని కానా?'



- గోగుమళ్ల కవిత







8

# మనసుగతి ఇంతే!

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**టిఫిన్ ముగించి, కాఫీ తాగి, తల్లిదండ్రుల్నీ సుధనూ కలయజూశాడు వినయ్. "ఇప్పుడు చెప్పండి. ఏమిటంత ఎమర్జెన్సీ? ఏమిటంత కొంపలంటుకునే పరిస్థితి?"**

**"సంధ్య వస్తున్నట్టు నువ్వు ఫోన్ చేశావు. అమ్మాయి వచ్చిన రోజు ఫోన్ చేసి మాట్లాడాం. రెండో రోజు ముగ్గురం వెళ్ళాం. సంధ్య ఇంట్లో లేదు. ఎక్కడికో వెళ్ళిందన్నారు. రెండు గంటలు వెయిట్ చేసి, సంధ్య రాగానే మనింటికి తీసుకురమ్మని చెప్పి వచ్చేశాం. రాలేదు. రెండ్రోజులాగి నేను వెళ్ళాను. అప్పుడూ అమ్మాయి లేదు. ఆనందరావూ, అతని భార్యా ఎందుకో ముభావంగా కనిపించారు. నేను పలకరిస్తే తప్ప మాట్లాడలేదు. సంధ్య గురించి అడిగితే ఎక్కడికెళ్ళిందో తెలీదు; ఎప్పుడొస్తుందో తెలీదు అన్నారు. మన ఇంటికి తీసుకురమ్మన్నాను. 'తను వస్తానంటే తీసుకొస్తాం' అన్నాడా పెద్దమనిషి. వాళ్ళ వరస ఆడపిల్ల తల్లిదండ్రుల వరసలా లేదు. ఆ ఆనందరావు ముందు గంటసేపు లింగం ముందు బసవడిలా కూచుని, చిన్నతనమనిపించి వచ్చేశాను. తరువాత..."**

"సంధ్య వదిన నాకు కనిపించింది" సుధ కల్పించుకుంటూ అంది.

వినయ్ సుధ వైపు తిరిగాడు. "ఎక్కడా? వాళ్ళింటికెళ్ళావా?"

"లేదు. హోటల్ డెక్కన్ ప్యారడైజ్‌లో. మా ఫ్రెండు మధుర నీకు తెలుసుగా. దానితో వెళ్ళాను. దాన్ని చేసుకోబోయే కుర్రాడు కూడా వచ్చాడ్లే. ముగ్గురం టిఫిన్ తింటూ కూచున్నాం. అప్పుడొచ్చింది ఒకతనితో కలిసి. లేచి, ఎదురుగా పరుగెత్తాను. 'వదినా' అంటూ పలకరించాను. మొదట్లో ఇబ్బందిగా షాక్ తగిలినట్లు చూసింది. క్షణంలో సర్దుకుని, నవ్వే ప్రయత్నం చేసింది. 'అమెరికా నుంచి వచ్చాక ఫోన్ చేయలేదేం? ఇంటికి రాలేదేం?' అని అడిగాను. తీరికలేదంది. నిజం చెప్పమని రెట్టించాను. 'మా మీద అలిగావా?' అని కూడా అడిగాను. తోడుగా వచ్చినతన్ని వెళ్ళి కూచోమంది. అతను వెళ్ళిపోయాడు. 'ఎవరతను?' అని అడిగాను. 'మా ఫ్యామిలీ ఫ్రెండ్' అంది. ఇంటికి ఎందుకు రాలేదని పదే పదే అడిగాను. నేను అక్కడ కనిపించడం తనకి నచ్చలేదని నాకు అర్థమైపోయింది. మళ్ళీ అడిగాను. ఎందుకు రాలేదు వదినా? అని. 'రాను' అంది విసుగ్గా. 'అన్నయ్యతో గొడవ జరిగిందా?' అని అడిగాను. లేదంది. అమెరికా ఎప్పుడెళ్తావని అడిగాను. 'వెళ్ళను!' అంది కాసేపు ఆలోచించి. షాకైపోయాను. 'ఎందుకొదినా? ఏం జరిగింది?' అని గుచ్చి గుచ్చి అడిగాను. అసహనంగా, విసుగ్గా తల విదిల్చింది. 'వెళ్ళను తెలుసా? వెళ్ళను!' అంది బిగ్గరగా.

ఎందుకని నిలదీశాను. "ఏమందో తెలుసా?" సుధ ప్రశ్నించి, ఆగి ఉద్రేకంగా చూసింది.

"ఏమందీ?" వినయ్ అడిగాడు.

"పెళ్ళి చేసుకున్న ఆడదాన్ని భార్యగా చూడని మగాడితో కాపురం చేయను! అందుకే వెళ్ళను!" అంది.

వినయ్ అర్థం కానట్టు మౌనంగా చూస్తూ ఉండిపోయాడు. సుధ ఏం చెప్పింది? సుధ చెప్పిన దాన్ని తను సరిగ్గా విన్నాడా?!

"నువ్వు సరిగ్గా విన్నావా?"

"స్పష్టంగా చెప్పింది. స్పష్టంగా విన్నాను!" సుధ కంఠంలో ఉద్రేకం గంటలా పలికింది.

"సంధ్య అన్నది నిజమేనా? సుధ విన్నది నిజమేనా? అని మేం కూడా సతమతమయ్యాం నాయనా" శాంతమ్మ అంది.





## జరిగిన కథ

అమెరికాలో ఉన్న వినయ్ ఇండియా వచ్చి సంధ్యని పెళ్ళి చేసుకుంటాడు. శోభనం రాత్రే ఆమె స్పృహతప్పి పడిపోతుంది. ఆ తరువాత రెండోసారి ఏర్పాటుచేసిన మొదటిరాత్రి, అమెరికా వెళ్ళిన తరువాత కూడా ఇద్దరూ దూరంగానే ఉంటారు. దాంతో సంధ్యని ఒప్పించి సెక్సాలజిస్ట్ డాక్టర్ జాన్‌డేవిడ్ దగ్గరకి తీసుకెళతాడు. వారి అనాలిసిస్ ప్రకారం ఆమెకు ఫ్రిజిడిటీ అని తెలుస్తారు. ఫ్రెండు పెళ్ళి ఉందంటూ ఇండియాకు వస్తుంది సంధ్య. సడన్‌గా వినయ్‌ని ఇండియాకు వచ్చేయమంటూ ఫోన్ చేస్తుంది అతడి చెల్లెలు సుధ. **ఆ తర్వాత....**

వినయ్ లేచి, మౌనంగా పచార్లు ప్రారంభించాడు. సీరియస్‌గా తయారైన అతని ముఖం వైపే చూస్తూ ఉండిపోయారు అతని తల్లిదండ్రులూ, చెల్లెలూ. తటాలున పచార్లు ఆపి, తండ్రి వైపు తదేకంగా చూశాడు వినయ్.

"సంధ్య సుధతో ఆ మాటన్నాక మీరు వెళ్ళి పెద్దవాళ్ళతో మాట్లాడారా?"

"లేదురా. నువ్వొస్తే అందరం వెళ్ళి మాట్లాడ్డం మంచిదనుకున్నాం" శ్రీనాథరావు జవాబిచ్చాడు.

"అందరం వద్దు, అమ్మా మీరూ వెళ్ళండి"

***

"మేమే రావాలనుకున్నాం. మీరే వచ్చారు. కూచోండి" ఆనందరావు సాదాగా అన్నాడు.

సుమిత్ర వియ్యంకుల్ని మౌనంగా చూసి, ఒక సోఫాలో కూచుంది.

"కోడలు పిల్లేది?" శాంతమ్మ కూచుంటూ అడిగింది.

ఆనందరావు భార్య వైపు చూశాడు, చెప్పమన్నట్టు.

"మా అమ్మాయి ఎక్కడికో వెళ్ళిందిలెండి" సుమిత్ర ముక్తసరిగా అంది.

"సంధ్య మా సుధను హోటల్లో చూసినప్పుడు 'పెళ్ళి చేసుకున్న ఆడదాన్ని భార్యగా చూడని మగాడితో కాపురం చేయను' అందట. ఆ మాట..." శ్రీనాథరావు ఇంకా ఏదో చెప్పబోయాడు. ఆనందరావు ఆయనకి అడ్డు తగిలాడు.

"మాతో ఎప్పుడో అంది లెండి. లేకపోతే ఆ మాటలో కొద్దిగా తేడా ఉంది. మీకు చెప్పిందాంట్లో 'లే' అని ఒక అక్షరం ఎక్కువగా ఉంది. అంతే తేడా"

శ్రీనాథరావు అర్థంకానట్టు చూశాడు. "అక్షరం తేడానా? 'లే' అనే అక్షరమా? ఏమిటో అర్థం కాలేదు..."

"మీ అమ్మాయితో చెప్పినప్పుడు 'పెళ్ళి చేసుకున్న ఆడదాన్ని భార్యగా 'చూడని మగాడితో' అంది. మాతో చెప్పుకుని బాధ వెళ్ళబోసుకున్నప్పుడు 'పెళ్ళి చేసుకున్న ఆడదాన్ని భార్యగా చూడలేని మగాడితో కాపురం చేయను' అంది. అర్థమైందిగా?" ఆనందరావు వెటకారంగా అన్నాడు.

"ఏమిటి మీరంటోంది?" శాంతమ్మ గద్దించింది.

"మేమంటోంది కాదమ్మా. మా అమ్మాయి మాతో అన్నమాట! ఆ!" సుమిత్ర అంది. "అయినా పెళ్ళి చేసే ముందు కొడుకు ఎలాంటివాడో, పెళ్ళికి పనికొచ్చేవాడో కాదో తెలుసుకోవాలిగా తల్లీ దండ్రీ అన్నాక! ఏలుకోలేని వాడి చేత మెడలో తాడు ముడేయించి, ఆడపిల్ల గొంతు కొయొచ్చా?"

"ఏమిటమ్మా అది? మీ నిందకు అర్థం ఉందా?" శ్రీనాథరావు కోపంగా అడిగాడు.

"అది మేం వేస్తున్న నింద కాదు. పది నెలల పాటు, దేశం కాని దేశంలో మొగుడితో ఒంటరిగా అఘోరించిన ఒక పసిది చెబుతున్న నిజం! అది నింద కాదండీ నిజం!" ఆనందరావు పళ్ళు కొరుకుతూ అన్నాడు.

"ఇదేదో అభూతకల్పనే! మీరంటున్న ఆ లోపం మా ఇంటా వంటా లేదు! ఆ!"

ఆనందరావు ఎగతాళిగా నవ్వాడు. "ఎవడన్నారండీ మీ ఇంటా వంటా? మీరూ, మీ కొడుకూ కూతురూ కాని కొడుకు! మీలో అలాంటి లోపం లేదని మీ సంతానం చెబుతోంది. ఇంక మీ వంశాంకురం గురించి ఆ భగవంతుడికే తెలియాలి!"

"నా బిడ్డ మీద వేయరాని అభాండాలు వేస్తున్నారు. ఈ పాపం ఊరికే పోదు!" శాంతమ్మ ఉద్రేకంతో అంది.

"బాగుందమ్మా బాగుంది! ఉన్నమాట అంటున్న మాది పాపం! లేని మగతనం అంటగట్టి మా పిల్లదాని గొంతుకోయడం పాపం కాదు!" సుమిత్ర శాంతమ్మకు దీటుగా అంది.

"ఆనందరావుగారూ... ఇందులో ఏదో పొరపాటు ఉంది. తొందరపడి నిర్ణయాలకి రావడం మన రెండు కుంటుంబాలకీ మంచిది కాదు..." శ్రీనాథరావు ఓర్పుగా అన్నాడు.

"అయ్యా, మీకూ, మీ కుటుంబానికీ ఒక నమస్కారం! మా అమ్మాయి మాటను మేం నమ్ముతున్నాం."

"దయచేసి తొందరపడి నమ్మకండి. ఈ కాలం పిల్లలు..."

""శ్రీనాథరావుగారూ, ఒక ప్రశ్నకు సమాధానం చెప్తారా?" ఆనందరావు అడ్డు తగిలాడు.

"...అడగండి"

"మాట వరసకి మీ అమ్మాయికి పెళ్ళయింది అనుకుందాం. కొన్ని నెలల తర్వాత మీ అమ్మాయి తిరిగొచ్చి, తన మొగుడు మగాడు కాదనీ, తనతో కాపురం చేయడంలేదనీ, తనింకా కన్యగానే ఉన్నాననీ కన్నీళ్ళుకారుస్తూ చెబితే మీరు నమ్ముతారా లేదా?"

"....ఆనందరావుగారూ?"

"నమ్ముతారా లేదా? ఆ ఏడుకొండల వాడి మీద ప్రమాణం చేసి, నిజం చెప్పండి!" ఆనందరావు తీక్షణంగా చూస్తూ అన్నాడు.

"నమ్ముతాను.." శ్రీనాథరావు తగ్గుస్వరంతో అన్నాడు.

"మా కన్నకూతురు, ఒక్కగానొక్క కూతురు చెప్పిందాన్ని మేమూ నమ్ముతాం శ్రీనాథరావుగారూ! నమ్ముతున్నాం కూడా!" ఆనందరావు నిష్కర్షగా అన్నాడు. "మీకో సలహా ఇస్తాను. తాను సంసారానికి పనికిరానన్న సత్యం పెళ్ళయ్యాక మాత్రమే తెలిసిందనీ, సంధ్య భవిష్యత్తును నాశనం చేయడం ఇష్టం లేదనీ,



ఆమె పునర్వివాహం చేసుకోవచ్చనీ, భార్యాభర్తలుగా ఆమెకూ తనకూ ఎలాంటి సంబంధం లేదనీ మీ అబ్బాయిని స్టాంప్ పేపరు మీద రాసివ్వమనండి. మీరు సాక్షి సంతకం చేయండి."

"ఆనందరావుగారూ!"

"ఆ విధంగా రాసిచ్చి, పరువు కాపాడుకుంటారో, కోర్టుకు వచ్చి పరువుని బజారు పాలు చేసుకుంటారో మీ ఇష్టం!" ఆనందరావు సోఫాలోంచి లేచాడు. సుమిత్ర అతని నీడలా లేచింది. తమను 'దయచేయమంటున్నా'డని అర్థం చేసుకున్న శ్రీనాథరావు లేచి నిలుచున్నాడు.

పునరాలోచన చేయండి.

కోర్టు లోపలా? కోర్టు బయటా? ఏదో ఒకటి తేల్చుకోండి!"

***

తల్లిదండ్రులు చెప్పిందంతా ఆశ్చర్య విగ్రహంలా అయిపోయి విన్నాడు వినయ్. మొదట్లో తల తిరుగుతున్నట్టూ, తరువాత తను కూచున్న గది గోడలు తన చుట్టూ తిరుగుతున్నట్టూ అనిపించింది వినయ్‌కి. సంధ్య అంత దారుణమైన అబద్ధం ఎందుకు ఆడింది? ఇంకా నెల తప్పలేదేమని తల్లిదండ్రులు అడిగినందుకా? పెళ్ళయ్యాక ఏళ్ళతరబడీ గర్భవతులు కాని వాళ్ళు ఎందరో ఉన్నారు! తన అసమర్థతని భర్త మీదికి నెట్టేందుకా? వినయ్ తల విదిల్చాడు. అది కూడా సరికాదు! తన అసమర్థత బైట పడినప్పుడు కదా కప్పిపుచ్చుకునే ప్రయత్నం! తను ఆరోప్రాణంగా ప్రేమించిన, ప్రేమించి పెళ్ళాడిన, పెళ్ళాడి కూడా ప్రేమిస్తున్న సంధ్య తనను దారుణంగా, హీనంగా అవమానించే అబద్ధం ఎందుకాడింది? సంధ్య అబద్ధమాడింది. ఎందుకో తెలుసుకోవాలి.

"ఇంతకీ అక్కడ మీ ఇద్దరి మధ్యా ఏం జరిగింది నాయనా!" మౌనంగా ఉన్న కొడుకుని చూస్తూ అడిగింది శాంతమ్మ.

"ఏమీ జరగలేదమ్మా.." వినయ్ అన్నాడు. ఏం జరిగింది కనుక చెప్పాలి!

"ఏదో జరగకపోతే సంధ్య ఇంతకి తెగించదన్నాయ్. బాగా గుర్తు చేసుకో. తనని ఎప్పుడైనా హర్ట్ చేశావా? అవమానించావా?" సుధ అడిగింది.

"నిజం సుధా! మా మధ్య ఇంత వరకూ ఏమీ జరగలేదు. నేను సంధ్యని హర్ట్ చేయలేదు; అవమానించలేదు..."

"అయితే ఆ పిల్ల నీమీద ఈ అభాండం ఎందుకు వేసింది?" శ్రీనాథరావు అడిగాడు.

"అది తనకూ, ఆ దేవుడికీ తెలియాలి నాన్నా!" వినయ్ విరక్తిగా నవ్వుతూ అన్నాడు.

"సుధా, నువ్వెళ్ళి కాస్త కాఫీ కాచుకురామ్మా. తల పగిలిపోతోంది" శ్రీనాథరావు సుధను చూస్తూ అన్నాడు.

సుధ లేచి వంటగదిలోకి వెళ్ళింది.

శ్రీనాథరావు వినయ్ ముఖంలోకి తదేకంగా చూశాడు. "వినయ్, ఇన్నేళ్ళ జీవితంలో నువ్వు ఏనాడూ మాతో అబద్ధాలాడలేదు. నేనిప్పుడు అడిగే ప్రశ్నకి నిజమైన సమాధానం చెప్పాలి."

"అబద్ధమెందుకు చెప్తాను, నాన్నా? అడగండి!"

"తను ఇంకా కన్యనే అని సంధ్య తన తల్లిదండ్రులకి చెప్పింది. ఆనందరావు చెప్పాడు. అది ఎంత వరకూ నిజం?"

వినయ్ మౌనంగా చూస్తూ ఉండిపోయాడు. తను నిజం చెప్పాలి. ఆ నిజానికి కారణం చెప్పాలి. తప్పదు.

"చెప్పు వినయ్. ఆ పిల్ల ఎందుకు అబద్ధం చెప్పింది?" శాంతమ్మ వినయ్‌ని హెచ్చరించింది.

**తల్లిదండ్రులు చెప్పినదంతా విగ్రహంలా అయిపోయి విన్నాడు వినయ్. తల తిరుగుతున్నట్టు అనిపించింది. తను ఆరోప్రాణంగా ప్రేమించి పెళ్ళాడిన సంధ్య తనను దారుణంగా, హీనంగా అవమానించే అబద్ధం ఆడింది. ఎందుకు? ఎందుకో తెలుసుకోవాలి అనుకున్నాడతను. ఇంతకీ సంధ్య ఆడిన అబద్ధం ఏమిటి? ఆ తరువాత వినయ్ ఏం చేశాడు?**

"సంధ్య...అబద్ధమాడలేదు.." వినయ్ పైకి లేస్తూ అన్నాడు.

"వినయ్!" శ్రీనాథరావు ఆశ్చర్యంతో అరిచాడు.

శాంతమ్మ నోరు తెరుచుకునే ఉండిపోయింది.

"అయితే...అయితే...నీకు సంబంధించి సంధ్య చెప్పిన విషయం నిజమేనా?" వినయ్ ముఖంలోకి చూస్తూ అడిగాడు శ్రీనాథరావు.

శాంతమ్మ కళ్ళని గిన్నెల్లా చేసి, ఇంకా తెరుచుకునే ఉన్న నోరుని అరచేత్తో మూసింది.

వినయ్ తండ్రివైపు తిరిగాడు. ఎరుపు రంగు పులుముకుని, ప్రశ్నలు రువ్వుతున్న తండ్రి కళ్ళల్లోకి నిదానించి చూశాడు. "సంధ్య తన గురించి చెప్పుకున్నది నిజం. నా గురించి చెప్పింది అబద్ధం!"

శ్రీనాథరావు, శాంతమ్మ అయోమయంగా చూశారు.

"వినయ్...సంధ్య తన విషయంలో చెప్పింది నిజమైతే, నీ విషయంలో చెప్పింది కూడా నిజమయ్యే ఉండాలి..." శ్రీనాథరావు తగ్గు స్వరంతో అన్నాడు.

"ఎందుకలా అంటున్నారు?" వినయ్ ప్రశ్నించాడు.

"భర్త మగవాడై ఉంటే, పెళ్ళయిన తొమ్మిదినెల్ల దాకా భార్య కన్యగా ఉండిపోదు" శ్రీనాథరావు అన్నాడు. "ఒకటి జరిగితే తప్ప"

"ఏమిటది నాన్నా?" వినయ్ చిరునవ్వుతో అడిగాడు.

"భర్త, భార్యకు దూరంగా ఉండిపోవడం అనేది జరిగితే.."

"దూరంగా ఎందుకుంటాడు నాన్నా, కట్టుకున్న భర్త?"

"భార్యంటే ఇష్టం లేనప్పుడు. లేకపోతే, మరొక ఆడదాని వలలో పడినప్పుడు..."

"నాకు సంధ్య అంటే చాలా ఇష్టం. నేనామెను ప్రేమించాను. పెళ్ళి చేసుకున్నాను. నిజం చెబుతున్నాను. మరో స్త్రీతో నాకు ఆ విధమైన పరిచయం లేదు!" వినయ్ అన్నాడు.

శ్రీనాథరావు అసహనంగా కదిలాడు.

"సరే..అలా అయితే సంధ్య... కన్యగానే ఎందుకు ఉండిపోయింది?"

వినయ్ సందేహిస్తూ చూశాడు. "అది... అది ఇప్పుడు అవసరమా నాన్నా?"

"అవసరమో లేదో నువ్వే చెప్పు. తన భర్త పురుషుడు కాదు అని సంధ్య చెబుతోంది. కోర్టుకు ఎక్కుతామని ఆనందరావు హెచ్చరిస్తున్నాడు. మా



## పేరు తప్పుగా పిలుస్తున్నారట!

తన పేరు అందరూ తప్పుగా పిలుస్తున్నారంటూ వాపోతోంది దిశా పాట్నీ. తన అసలు పేరు దిశా పాట్నీ అయితే దిశా పటానీ అంటున్నారనీ, ప్రారంభంలో ఒకటి రెండు సార్లు దాన్ని సరిచేసినా అదే విధంగా పిలవడంతో ఏం చేయలేక ఊరుకున్నానని చెప్పుకొచ్చింది. ఇటీవల ఓ మ్యాగజైన్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలో తన పేరును పిలుస్తున్న వైనాన్ని చెప్పి వాపోయింది. దయచేసి ఇక నుంచి అయినా అందరూ తనను దిశా పాట్నీ అని పిలవాలని కోరింది.

ముందొక బేతాళ ప్రశ్న ఉంది. దానికి సమాధానం నూటికి నూరుపాళ్ళూ నిజమైన సమాధానం కావాలి!" శ్రీనాథరావు సీరియస్‌గా అన్నాడు.

"బంగారంలాంటి నా కొడుకు మీద నీలాప నింద పడింది. మాకు నిజం తెలియాలి! చెప్పు!" శాంతమ్మ ఆవేశంగా అంది.

"ఏం చెప్పాలమ్మా?"

"నిజం!" శ్రీనాథరావు ఉద్వేగంతో అన్నాడు. "అది నిప్పులా కాల్చేసినా ఫరవాలేదు. ఏం చెప్పాలని అడుగుతున్నావ్ వినయ్! సంధ్య ఎదిగిన యువతి. నువ్వు ఎదిగిన యువకుడివి; ముఖ్యంగా మగాడివి. మీ ఇద్దరికీ పెళ్ళయి పదినెలలు దాటింది. హనీమూన్‌కి పంపుతున్నట్లు ఇద్దర్నీ మేం అమెరికా పంపించాం. అయినా సంధ్య కన్యగానే ఉండిపోయింది. ఎందుకు? ఏం జరిగింది మీ మధ్య?"

"ఏమీ జరగలేదనీ చెప్పానుగా నాన్నా..."

'ఏమీ...జరగలేదా?" శ్రీనాథరావు విసుగ్గా అరిచాడు. కొడుకుని చూస్తూ కళ్ళు చిట్లిస్తూ ఆలోచిస్తూ ఉండిపోయాడు. కొన్ని క్షణాల తరువాత ఆయన పెదవులు కదిలాయి. "ఇద్దరి మధ్యా..ఏమీ...జరగ... లేదు.... అర్థమైంది వినయ్! ఏమీ జరగలేదని నువ్వు అంటూంటే ఏ గొడవా జరగలేదని అర్థం చేసుకున్నాం. ఇప్పుడు అర్థమవుతోంది. మీ ఇద్దరి మధ్యా భార్యాభర్తల మధ్య జరగాల్సింది ఏమీ జరగలేదని అర్థమవుతోంది! అవునా?"

వినయ్ అవునన్నట్టు తలాడించాడు.

"ఎందుకు జరగలేదు?" శ్రీనాథరావు ఉద్రేకంతో అడిగాడు.

"నాన్నా...అది..."

"అబ్బాయ్, నువ్వేదో దాస్తున్నావు. మేం భయపడం. బాధపడం. నిజం చెప్పు!" శాంతమ్మ అంది.

"ఎస్! నువ్వు చెప్పక తప్పదు!" శ్రీనాథరావు అన్నాడు. "మళ్ళీ అడుగుతున్నా. చివరిసారిగా అడుగుతున్నా. దంపతుల మధ్య సహజంగా జరగాల్సిన ప్రక్రియ మీ మధ్య ఎందుకు జరగలేదు?"

"నాన్నా, అది చెప్తే..."

"ఎందుకు జరగలేదు?"

"సంధ్య మానసికంగా అందుకు సిద్ధంగా లేదు."

"అంటే...?"

"సంధ్య ఫ్రిజిడ్. ఆమె జడత్వంతో బాధపడుతోంది..."

"అదేం మాయదారి రోగంరా నాయనా?" శాంతమ్మ రాగం తీస్తూ అంది.

"ఫ్రిజిడిటీ..." శ్రీనాథరావు సాలోచనగా అన్నాడు. "అది నీకెలా తెలుసు?"

"డాక్టర్లు చెప్పారు.."

"ఎవరా డాక్టర్లు?"

"డాక్టర్ జాన్, డాక్టర్ జలజ..."

"ఏం చెప్పార్రా నాయనా?" శాంతమ్మ ఆదుర్దాగా అడిగింది.

"సంధ్య మీద సందేహం కలిగింది. ఆమెను శాన్‌ఫ్రాన్సిస్కోలో ఉన్న డాక్టర్ల వద్దకు తీసుకువెళ్ళాను." కాఫీ ట్రేతో వస్తున్న సుధను చూస్తూ ఆపాడు వినయ్.

"మీ మాటలన్నీ వినిపించాయి. నన్ను చూసి,




## అనాదిగా ఆటబొమ్మ

"కొడుకు భుజాలపైన
కూతురు నేలపైన"
నానుడి వేదంగా భావించే
ఇంటిలో జనియించి
అన్న కార్పొరేట్ స్కూల్‌లో
నేను మున్సిపాలిటీ స్కూల్‌లో
తొలి ఓటమి!

చదువుకుంటానన్నా
గుండెల్లో కుంపటి దించుకోవాలని
మెడలో పలుపు(పసుపు)తాడు పెళ్ళి
రెండో ఓటమి!



ఆడపిల్ల పుట్టిందని
కట్టుకున్నోడు వదిలేశాడు
మూడో ఓటమి!

ఆదుకుంటారని ఆశతో
పసికందును చేతబట్టి
పచ్చి బాలింత
అమ్మగారింటికొస్తే

పెళ్ళి కావలసిన ఆడపిల్ల
ఉందని అమ్మనాన్నల
అడ్డగింతలు.
అప్పగింతలు అయ్యాక
అడుగిడ వద్దని!

"ఇక ఓటములు అనంతం"
ఓర్పే ఆయుధం అని
సమాజంలో అడుగిడితే
అడుగడుగునా సంకటం!

ఆసరా ఇచ్చిన మగాడు
ఆదుకున్నాడు అనుకుంటే
ఉంపుడుగత్తె బిరుదునిచ్చింది
ఈ సమాజం!
బిరుదును నిజం చేశాడు
మగ మహారాజు.

పిల్ల ఎదిగింది ... ఉంపుడుగత్తె
కూతురుకి పెళ్ళి సంబంధాలు
రావడమే లేకుంది!

వయసొచ్చిన కన్న పేగు
కన్నతల్లి కన్నీటికి
ఖరీదు కడుతూ
వలచినవాడితో లేచిపోయింది

మరో "ఆటబొమ్మ"
ఆట మొదలు ....!

**—సురేంద్ర రొడ్డ**
**సెల్: 94915 23570**

సందేహించే పని లేదు!" సుధ చిరునవ్వుతో అంది.

"అబ్బాయ్...ముందు నాకో విషయం చెప్పు" శాంతమ్మ అంది. "జడత్వమో, గిడత్వమో ఆ రోగమేదో ఆ పిల్లకి ఉన్నట్టు చెప్పడానికి ఎందుకు తటపటాయించావ్?"

"...సంధ్యను మనస్ఫూర్తిగా ప్రేమించాను. ఆమెలోని లోపాన్ని అందుకే చెప్పలేకపోయాను.."

"ఊ...నీది మేం కుదిర్చిన పెళ్ళి అనుకున్నాం; ప్రేమ పెళ్ళి అనుకోలేదు" శాంతమ్మ ఉక్రోషంతో అంది.

"మీరు కుదిర్చిందే; మీరు జరిపించిందే. మీరు ఏర్పాటు చేసిన పెళ్ళిచూపుల్లో మొట్టమొదటి సారి చూసిన క్షణంలోనే ప్రేమించాను.."

"లవ్ ఎట్ ఫస్ట్‌సైట్‌లేమ్మా!" సుధ కాఫీలు అందిస్తూ అంది. "నువ్వు చెప్పన్నాయ్. డాక్టర్లు ఏమన్నారు?"

వినయ్ చెప్పమంటారా అన్నట్టు తండ్రి వైపు చూశాడు. శ్రీనాథరావు సరే అన్నట్టు తల ఊపాడు.

"డాక్టర్ జాన్ డేవిడ్, డాక్టర్ జలజ ఫేమస్ సెక్సాలజిస్టులు. ఒక మిత్రుడి సలహా ప్రకారం సంధ్యను వాళ్ళ వద్దకు తీసుకెళ్ళాను.." వినయ్ చెప్పడం ప్రారంభించాడు.

వినయ్ చెప్పిందంతా ముగ్గురూ మౌనంగా, ఏకాగ్రతతో విన్నారు. ముగ్గురిలో ముందుగా శాంతమ్మ స్పందించింది.

"సంసారానికి పనికిరాని ఆడదైపుట్టి, నా బిడ్డనంటుందా? నా బిడ్డ మీద కోర్టుకెక్కుతానంటాడా ఆ పెద్దమనిషి? దాని రుగ్మతని ఏకరువు పెడుతూ విడాకుల కేసు మీరే వేయండి!"

"ఔను. ఇప్పుడు మనం చేయాల్సింది అదే!" శ్రీనాథరావు ఉద్రేకంతో అన్నాడు. "అమెరికా డాక్టర్లతో మాట్లాడు. కేసు హిస్టరీకి సంబంధించిన పేపర్లూ, ఆ అమ్మాయి ఫ్రిజిడ్ అనే సర్టిఫికెట్లూ ఆన్‌లైన్లో తెప్పించు. కోర్టులో తైతక్కలాడించే చాకులాంటి లాయరున్నాడు. ఎవరి పరువు బజార్న పడుతుందో చూద్దాం!"

"నాన్నా...తొందరపడకండి.." వినయ్ నెమ్మదిగా

అన్నాడు.

"మనం తొందరపడకపోతే, ఆ ఆనందరావు పడతాడు!" శ్రీనాథరావు అన్నాడు.

వినయ్ మాట్లాడకుండా చూశాడు.

"ఏమిటి నాయనా, ఆలోచిస్తున్నావు?" శాంతమ్మ అడిగింది.

"సంధ్య మీద కేసు వేయడం నాకు ఇష్టం లేదు..!"

"ఎందుకు?" శ్రీనాథరావు అడిగాడు.

"సంధ్యను నేను ప్రేమిస్తున్నాను నాన్నా."

"ఏమిట్రా ఈ విడ్డూరం? నీకేమైనా మతి పోయిందా?" శాంతమ్మ అంది.

"నువ్వు మగవాడు కాదనీ, తనను ఏలుకోవడం లేదనీ ఆ పిల్ల కోర్టుకెక్కుతూంటే, ప్రేమించడమేంటి ఇంకా?" శ్రీనాథరావు ఆశ్చర్యంగా అన్నాడు.

"అవునన్నాయ్!" అంది సుధ.

వినయ్ సుధ దగ్గరగా నడిచి, తల వంచి ఆమె ముఖంలోకి చూశాడు. "సుధా నీకు తెలుసు; నా కళ్ళముందు నిలుచున్న క్షణం నుంచీ నేను సంధ్యను నా ప్రాణం కన్నా అధికంగా ప్రేమిస్తున్నాను. నాది నిజమైన ప్రేమ సుధా. నిజమైన ప్రేమకు చావు ఉంటుందా, సుధా?"

"అన్నాయ్..."

"తన కొడుకు గొప్పవాడైనా, హంతకుడైనా తల్లి ప్రేమిస్తూనే ఉంటుంది. ఆ ప్రేమ చావదు. ఎందుకంటే అది నిజమైన స్వచ్ఛమైన ప్రేమ!" వినయ్ తల్లి ముందుకు నడిచాడు. తల వాల్చి ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"అమ్మా, ఒకటడుగుతాను సమాధానం చెబుతావా?"

"ఏమిటది?"

"కన్నప్పట్నుంచీ ఇంకా చెప్పాలంటే కడుపులో పడ్డప్పట్నుంచీ నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు. నేను అందరిలాగే మగవాడినని నమ్మి నాకు పెళ్ళి చేశావ్. మాట వరసకి ఇప్పుడు సంధ్య ఆరోపిస్తున్నట్టు నేను నపుంసకుడినని తెలిసిందనుకో.... నన్ను ప్రేమించడం మానేస్తావా? నా పట్ల నీలో ఉన్న ప్రేమ చచ్చిపోతుందా, అమ్మా."




సోఫాలో కూచుని, తల పైకెత్తి కొడుకు ముఖంలోకే చూస్తున్న శాంతమ్మ పెదవులు అదిరాయి. క్షణంలో ఆమె కళ్ళు నీళ్ళతో నిండాయి. కన్నీళ్ళు గీతలుగా కిందికి జారుతూ ఆమె సమాధానాన్ని తడిగా రాస్తున్నాయి.

"నీలోని ప్రేమ చావదని నీ కన్నీళ్ళు నాకు చెబుతున్నాయమ్మా! అది నిజమేగా?" వినయ్ చిరునవ్వుతో అడిగాడు.

శాంతమ్మ తల అవునన్నట్టు ఊగింది. చలనచిత్రంలో ఏదో దృశ్యాన్ని చూస్తున్న వాడిలా తన ముందు జరుగుతున్న దాన్ని మౌనంగా చూస్తూ ఉండిపోయాడు శ్రీనాథరావు. వినయ్ ఆయన ముందుకెళ్ళి చిరునవ్వుతో చూశాడు.

"నాన్నా, ఒక సినిమా పాటలోని 'మనసిచ్చుటే నిజమైతే, మన్నించుటయే రుజువు కదా!' అన్న పంక్తులు నీకు గుర్తున్నాయా?"

"ఎందుకు గుర్తు లేవురా? నీ సుఖమే నే కోరుతున్నా, నిను వీడి అందుకే వెళుతున్నా!' అనే పల్లవితో మొదలయ్యే పాటలోని పంక్తులవి. మనసు కవి ఆచార్య ఆత్రేయగారి రచన...ఘంటసాలగారు పాడిన పాట అది..."

"ఆత్రేయగారి లాంటి మనసుకవి అసత్యాలు రాస్తాడా నాన్నా?"

"రాయడు" శ్రీనాథరావు మెల్లగా అన్నాడు. "ఆ భావం అక్షరసత్యం"

"అమెరికా నుంచి ఆఘమేఘాల మీద నన్ను పిలిపించి, మీరు చూపించిన సంధ్యకు నేను చూసిన క్షణంలోనే మనసిచ్చాను నాన్నా. ఆమె ఏం చేసినా సరే మన్నించడం నేను మనసిచ్చినందుకు రుజువు కదా?"

"వినయ్...."

"ప్రేమించిన వ్యక్తిని మన్నించడం తప్పా నాన్నా?"

శ్రీనాథరావు ఒక విధమైన ఉద్వేగంతో చూశాడు. ఆయన పెదవులు వణికాయి. భార్య వైపూ, కూతురి వైపూ చూశాడు. ఇద్దరి కళ్ళూ మెరుస్తున్నాయి. చూపుల్ని మెల్లిగా వినయ్ వైపు తిప్పాడాయన.

"మన్నించి ఏం చేస్తావ్?"

"ఆనందరావుగారు మిమ్మల్ని అడిగినట్టు, నాతో వివాహబంధం నుంచీ ఆమెకు విడుదల ఇస్తూ పత్రం రాసిస్తాను.."

"అంటే...అంటే....నువ్వు భర్తగా పనికిరావని..." శ్రీనాథరావు ఏదో అడగబోయాడు.

"ఇంక ఆ దృష్టితో ఆలోచించను నాన్నా. ఒకసారి సంధ్యను కలుసుకుంటాను. ఆమెకు కావాల్సింది అదేనేమో కనుక్కుంటాను. అదీ ఆమె నోటమ్మట స్వయంగా విన్నాక, ఎలా కావాలంటే అలా రాసిస్తాను.."

మూడు జతల కళ్ళు వినయ్ వైపే చూస్తున్నాయి. వినయ్ హాల్లోంచి బయటికి నడిచాడు.

***

గదిలోకి వస్తున్న వినయ్‌ని చూస్తూ, చదువుతున్న కథల పుస్తకాన్ని బల్ల మీద బోర్లించింది సుధ. కూచున్న చోటు నుంచి లేచి, వినయ్‌కి ఎదురుగా వచ్చి కూర్చుంది. వినయ్ ముఖంలో ఓటమి ఛాయలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"అన్నాయ్..."

వినయ్ సుధ ముఖంలోకి చూశాడు. ఆమె అడగని ప్రశ్నను అర్థం చేసుకున్నాడు. "సంధ్య ఇంట్లో లేదు..."

"ఇంట్లో లేదా? లేదని ఆమె అమ్మానాన్నా చెప్పారా?" సుధ అడిగింది.

"చెప్పారు" వినయ్ నిరుత్సాహంగా అన్నాడు. "సంధ్య నాన్నగారు గడప ముందే నన్ను నించోబెట్టి మాట్లాడాడు. సంధ్యతో ఒకసారి మాట్లాడి, ఆమె మనసు తెలుసుకుని ఆమె అడిగితే 'పెళ్ళి రద్దు పత్రం' రాసిస్తానన్నాను..."

"ఏమన్నాడా పెద్దమనిషి?"

"సంధ్య మనసే తన మాటల్లో ఉందన్నాడు. సంధ్య ఇంక స్వయంగా మాట్లాడదనీ, లాయరు ద్వారా మాట్లాడుతుందనీ అన్నాడు...."

"అమ్మానాన్నా, అమ్మాయీ ఒకే మూస మనుషుల్లా ఉన్నారు" సుధ కసిగా అంది.

"పెద్దవాళ్ళను అనాల్సిన పనిలేదు సుధా! నన్ను నా తల్లిదండ్రులు నమ్మినట్టే, సంధ్యను ఆమె తల్లిదండ్రులు నమ్ముతారు. అది సహజం!"

"అయితే పత్రం రాసి వాళ్ళకే ఇచ్చేస్తావా?" సుధ అడిగింది.

"ఎలాగైనా సరే, నేను సంధ్యను కలుసుకోవాలి" వినయ్ కంఠంలో పట్టుదల ధ్వనించింది.

"కలుసుకుంటే మనసు మార్చుకుంటుందన్న ఆశా" సుధ ప్రశ్నించింది.

"కారణం అది కాదు. ఆమె నిర్ణయాన్ని ఆమె చెప్తే వినాలనుకుంటున్నాను. నా మీద అపనింద వేయకుండా అడిగి ఉంటే పత్రం రాసి ఇచ్చేవాడినని చెప్పాలనుకుంటున్నాను. జీవితానికి సంబంధించిన విషయాల్లో అబద్ధాలు కూడదని చెప్పాలనుకుంటున్నాను."

"సంధ్య కోసం నేను ప్రయత్నించనా?" సుధ అడిగింది.

"ఎలా?"

"తెలీదు. నువ్వు సరేనంటే ప్రయత్నిస్తాను."

"సరే..."

***(ఇంకా వుంది)***



'ఫైటింగ్ ఫూల్' పేరిట నవల రాస్తానని ఇరవై ఏళ్ళుగా పాఠకులను ఊరించి ఊరించి రాయక, ఇప్పుడు రాసి ఉర్రూతలూగించేందుకు సిద్ధమైన షాడో సృష్టికర్త

# మధుబాబు

మరో సీరియల్

# స్టార్ ఫైటర్

అనబడే ఫైటింగ్ ఫూల్

## త్వరలో మీకోసం..




# హెచ్చరిక

**'మీకు నా అవసరం కన్నా మానసిక వైద్యుడి అవసరం ఎక్కువ ఉన్నట్టు అనిపిస్తోంది. మీ అబ్బాయిని మానసిక వైద్యుడికి చూపించండి. లేదా మీరే గట్టిగా అడగండి' నవ్వుతూ అన్నాడు డిటెక్టివ్ శరత్.**

'మీకు నా సమస్య అర్థం కావటంలేదు. నవ్వుతూ, తుళ్ళుతూ ఉండే నా ఒక్కగానొక్క కొడుకు ఈ మధ్య ఎవ్వరితో మాట్లాడకుండా గదిలో ఒంటరిగా కూర్చుంటున్నాడు. బాధపడుతున్నట్టు ఉంటాడు. బెదురుచూపులు, పలకరిస్తే ఉలికిపడటం..ఎందుకలా ఉంటున్నాడో, ఎవరైనా భయపెడుతున్నారో తెలుసుకోవాలి. ముఖ్యంగా, వాడికి ఏమైందో తెలుసుకోవాలి. నేను, వాళ్ళమ్మ అడిగినా చెప్పటం లేదు. వాడి ప్రవర్తన అనుమానం కలిగిస్తోంది. డాక్టర్లు జబ్బేమీ లేదంటున్నారు. అందుకే మీ దగ్గరకు వచ్చాను' చెప్పాడు భార్గవ్.

'అబ్బాయిమీద మీకు ఎలాంటి అనుమానం కలుగుతోంది?' అడిగాడు శరత్.

'తలవంచుకుని మెల్లిగా చెప్పాడు భార్గవ్. సంవత్సరంలో ఐదారు నెలలు నేను విదేశాల్లో ఉంటాను. ఫోను, స్కైప్, వాట్సప్ వీడియోకాల్స్ సంబంధంతప్ప ప్రత్యక్షంగా ఇంట్లో ఏం జరుగుతోందో నాకు తెలిసే అవకాశం లేదు. నేను లేని సమయంలో నా భార్యకు ఎవరితోనైనా సాన్నిహిత్యం ఏర్పడిందేమో, అది వీడు చూశాడేమో!' మాట్లాడలేకపోయాడు.

సానుభూతిగా తల ఊపాడు శరత్.

'మీ కేసు నా అసిస్టెంట్ రాముకి అప్పగిస్తాను. అతనికి వివరాలు చెప్పి వెళ్ళండి' అన్నాడు శరత్.

***

'బాస్, భార్గవ్, గౌరిలది అన్యోన్య దాంపత్యం. ఏవో చిన్నగొడవలుతప్ప సమస్యలేమీ లేవు. వాళ్ళ ఏకైక సంతానం పన్నెండేళ్ల ప్రియదర్శన్. స్కూలు టాపర్. ఆర్నెల్లుగా అన్యమనస్కంగా ఉంటున్నాడు. ఏదో కోల్పోయినట్టు ఆలోచనల్లో ఉంటున్నాడట. ఎవ్వరితో మాట్లాడటంలేదు, ఏం చెప్పటం లేదట' చెప్పాడు రాము.

'అతని దినచర్య ఏమిటి?'

'ఉదయం ఏడింటికి స్కూలు బస్సు వస్తుంది. వెళ్తాడు. మళ్ళీ రాత్రి ఏడింటికి బస్సు ఇంటిదగ్గర దింపుతుంది. తాళం పక్కింటివాళ్ళ దగ్గర ఉంటుంది. వాళ్ళమ్మ వచ్చేసరికి తొమ్మిదిన్నర దాటుతుంది. అప్పటివరకూ పిల్లాడు ఒక్కడే ఉంటాడు ఇంట్లో' చెప్పాడు రాము.

'అతని తల్లి గౌరి గురించి?'

'యెస్ బాస్. ఆమెకు ఆఫీసులో మంచిపేరు ఉంది. ఎవ్వరితోనూ ఎక్కువ మాట్లాడదు. ఎవరైనా భర్తకు కల్పించి ఏవైనా చెప్తారేమోనని భయం. చాలా జాగ్రత్తగా ఉంటుంది'.

కుర్చీలో వెనక్కివాలి ఆలోచనలో ఉండిపోయాడు శరత్.

'బాస్, ఆమె ఫోన్‌కాల్స్ సేకరించాను. పరిశీలించాను. ఏదైనా పార్టీకి వెళ్ళినప్పుడు కూడా ఆడవాళ్ల గుంపులోనే ఉంటుంది. మగవాళ్లు పలకరించినా మొహమాటానికి నవ్వుతుందంతే. 'భర్తలేని మహిళల సమస్యలు ఒకరకమైతే, ఉద్యోగరీత్యా భర్తకు దూరంగా ఒంటరిగా ఉండే మహిళల సమస్య మరో రకం' అని స్నేహితురాళ్లతో అంటుందట'.

తల ఊపాడు శరత్. 'పిల్లాడికి సెల్‌ఫోన్ ఉందా?'

'ఉందిగానీ అది ఇంట్లోనే ఉంటుంది. ఓన్లీ ఇన్‌కమింగ్'.

'ఆ ఫోను వివరాలు సేకరించు' ఇంట్లో కంప్యూటర్ ఉందా?'

'ఉంది బాస్'

'రేపు వాళ్లిద్దరూ ఇంట్లోంచి వెళ్ళిపోగానే మనం ఇంట్లోకి అడుగుపెడదాం. కత్తి ఉమేశ్ కుమార్‌కి కబురు పెట్టు' చెప్పాడు శరత్.

> పన్నెండేళ్ళ కుర్రాడు ప్రియదర్శన్. నవ్వుతూ తుళ్ళుతూ ఉండేవాడు. ~~ఈ~~ మధ్య చదువులో వెనకబడ్డాడు. ఏదో పోగొట్టుకున్న వాడిలా బాధపడుతున్నాడు. ఎంత బుజ్జగించి అడిగినా సమాధానం మౌనమే. ఆ తండ్రి తట్టుకోలేకపోయాడు. మానసిక వైద్యుల దగ్గరకు తీసుకెళ్ళాడు. ఏమీ లేదన్నారు వాళ్ళు. ఆ తండ్రికి ఏదో సందేహం వచ్చి డిటెక్టివ్ శరత్‌ను ఆశ్రయించాడు. ఇంతకీ ఆ కుర్రాడి సమస్యేంటి?

***

'బాస్..ఇలా అనుమతి లేకుండా ఇంట్లోకి చొరబడటం నేరం కదా? గౌరి ఇంట్లో కంప్యూటర్ ముందు కూర్చుంటూ అడిగాడు ఉమేశ్.

'నేరం జరిగిపోయింది. పట్టుబడకుండా త్వరగా మన పని పూర్తిచేసి బైటపడాలి' నవ్వుతూ అన్నాడు శరత్.

పనిలో మునిగిపోయాడు ఉమేశ్.

'బాస్...ప్రియదర్శన్ ఫోన్‌కాల్స్‌లో ఈ నెంబరు రిపీట్ అవుతోంది. అబ్బాయి ఒంటరిగా ఉన్నప్పుడు లేదా రాత్రి పన్నెండు దాటాక ఫోన్‌కాల్ వస్తోంది'. నేను చేశా. స్విచాఫ్ ఉంది. ఆ నెంబరు వివరాలు సేకరించమని నా అసిస్టెంట్లకు చెప్పా'.

'ఫోన్ ఇంట్లోనే ఉంటుంది కదా! వెతుకు చూద్దాం' అన్నాడు శరత్.

ఉమేశ్ తనపనిలో ఉండగా, రాము, శరత్ ఫోనుకోసం వెతకటం ఆరంభించారు. అది ప్రియదర్శన్ బెడ్‌రూమ్‌లో దొరికింది.

ఫోను రాముకి ఇచ్చి, గదిని పరిశీలించాడు శరత్.

నోట్‌బుక్స్ చూశాడు. చేతిరాత ఆరంభంలో బాగుందిగానీ, ఇటీవల మాత్రం పుస్తకంలో రాత బదులు పిచ్చిగీతలు అధికంగా ఉన్నాయి. వాటిని పరిశీలనగా చూశాడు. ఆ గీతలు చూస్తుంటే పిల్లవాడు ఏదో సందిగ్ధంలో, ఆందోళనలో ఉన్నట్టు తెలుస్తోంది. పుస్తకాల అరలో అడుగున కొన్ని 'సీడీ'లు దొరికాయి.

వాటిని తీసుకుని ముందుగదిలోకి వచ్చాడు శరత్. 'ఎంతవరకూ వచ్చింది?' అడిగాడు ఉమేశ్‌ని.

'అవుతోంది బాస్. అతడి చాటింగ్ హిస్టరీ చూస్తున్నాను. పేరుకి పిల్లవాడేగానీ, బోలెడంత మంది ఫ్రెండ్స్ ఉన్నారు. చాటింగ్‌లు జోరుగానే ఉన్నాయి. పిల్లవాడికి వయసుకి మించిన ఊహలు బాగానే ఉన్నట్టున్నాయి' అన్నాడు ఉమేశ్.

'నువ్వు ఆ విషయం చూడు' అంటూ సోఫాలో కూలబడ్డాడు శరత్. ల్యాప్‌టాప్‌తీసి సీడీని దానిలో ఉంచాడు.

ఇంగ్లీష్ సినిమా సీడీ. దాన్ని తీసి మరో సీడీ పెట్టాడు. తెలుగు సినిమా సీడీ అది. ఇంకో సీడీలో యూరోపియన్ మూవీ ఉంది.

'బాస్... ఇతని చాటింగ్ హిస్టరీ స్టీఫెన్ అనే వ్యక్తితో అనుమానంగా ఉంది' పిలిచాడు ఉమేశ్.

ల్యాప్‌టాప్ పక్కనపెట్టి కంప్యూటర్ దగ్గరకు వెళ్ళాడు శరత్.

'బాస్... స్టీఫెన్ చాట్ హిస్టరీ డిలీట్ చేశాడు. దానిని రిట్రీవ్ చేస్తున్నాను'.

'గుడ్..' అన్నాడు. అంతలో రాము పిలిచాడు.

'బాస్.. ఇతడి వాట్సప్ మెసేజీలు చాలా అనుమానాస్పదంగా ఉన్నాయి. వీడియోలు డిలీట్ చేశాడు. రిట్రీవ్ చేస్తున్నాను'.

'మొత్తానికి ఏదో ఉందన్నమాట' అంటూ ల్యాప్



టాప్ దగ్గరకు వెళ్లాడు శరత్. ల్యాప్‌టాప్ తెరపై చూసి ప్రాన్పడిపోయాడు. తేరుకుని ఉమేశ్, రాములను పిలిచాడు. 'ఇటు చూడండి' అన్నాడు.

'ఇది మన చెయ్యి దాటిపోయింది' అన్నాడు శరత్, ఇన్‌స్పెక్టర్ విజయ్‌కి ఫోను కలుపుతూ.

***

'నాకు అయోమయంగా, ఆశ్చర్యంగా ఉంది. ఇదెలా సాధ్యం? ఇంపాజిబుల్. వాడికి ఇంకా పన్నెండేళ్ళే' ఆందోళన, అయోమయం కలగలసిన గొంతుతో అంది గౌరి.

'మీరు సంయమనం పాటించాలి. మీకే కాదు మాకు కూడా 'షాకింగ్'గానే ఉంది ఇది. కానీ ఇప్పుడు మనం పాటించాల్సింది సంయమనం. మీరు అనుమతిస్తే మీ కంప్యూటర్ హార్డ్‌డిస్క్ తీసుకెళ్తాం. మీ అబ్బాయిని ప్రశ్నించేందుకు అనుమతి కావాలి. మీరు ఏమీ తెలియనట్టే ఉండండి' అన్నాడు శరత్. ఆమె తల ఊపింది. వాడికేం కాకుండా చూడండి, ఆయనకి తెలిస్తే...అంటూ ఏడవటం ప్రారంభించింది.

***

'ఇవి టాంపరింగ్ సీడీలు కాదు, ఒరిజినలే' నిర్ధారించింది వీణ.

తల ఊపాడు శరత్. 'ఈ వీడియో తీసింది ప్రియదర్శన్ ఇంట్లోనే కదా?'

'యెస్ బాస్. ఇది ఆ స్టీఫెన్సన్ పేరుమీద రిజిస్టరై ఉంది. అడ్రస్ ఇదిగో' అందించాడు రాము.

ఇంతలో ఉమేశ్ పిలిచాడు. 'బాస్... ఇటు చూడు' ప్రింటౌట్ చూస్తున్నాడు ఉమేశ్.

శరత్‌వెళ్ళి చూశాడు. ఆ ప్రింటౌట్ చదువుతుంటే జరిగింది అర్థమైంది శరత్‌కి.

'బాస్. స్టీఫెన్సన్ అనేది నిజం పేరు కాదు. ఫేక్ ఐడి. వాడు ఎకౌంట్ క్లోజ్ చేశాడు' చెప్పాడు ఉమేశ్.

'బాస్... నా అసిస్టెంట్లు ఫోను చేశారు. ఫోను రిజిస్టరైన అడ్రస్ ఫేక్ అడ్రస్' చెప్పాడు రాము.

తలఊపాడు శరత్. వాడిని పట్టుకునేందుకు మనకున్న ఆధారం ప్రియదర్శన్!' అన్నాడు శరత్.

***

తల వంచుకుని కూర్చున్నాడు ప్రియదర్శన్.

ఏం అడిగినా సమాధానం లేదు. మౌనమే.

మరో గదిలోంచి ఇక్కడ జరుగుతున్నది చూస్తున్న గౌరి కన్నీరు మున్నీరుగా ఏడుస్తోంది.

'నిన్ను ఏమీ అడగను. స్టీఫెన్సన్‌ని ఎలా పట్టుకోవాలో చెప్పు చాలు. వాడు నీలాంటి ఇంకొంత మంది అమాయకులను ఇలాగే మోసం చేస్తున్నాడు'.

ప్రియదర్శన్ మాట్లాడలేదు.

ముందుకు రాబోతున్న విజయ్‌ని వారించాడు శరత్.

'ఇప్పుడు మాకీ విషయం ఎలా తెలిసిందో తెలుసా? ఈ వీడియోలో నీతో ఉంది చూడు, ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకుంది. వాడు ఈ వీడియోను బహిర్గతం చేశాడు'.

శరత్‌వైపు అపనమ్మకంగా చూశాడు ప్రియదర్శన్.

'నీకు నమ్మకం లేకపోతే స్టీఫెన్సన్‌నే అడుగు. మేమందరం వెళ్ళిపోతాం' అన్నాడు శరత్ బయటకు నడుస్తూ. గది దాటుతూ రాముకి సౌంజ్ఞ చేశాడు శరత్.

***

వాళ్ళు గదిదాటి వెళ్ళగానే 'అక్కా' అని అరుస్తూ మళ్ళీ మళ్ళీ ఏడ్చాడు ప్రియదర్శన్. తరువాత కన్నీళ్ళు తుడుచుకుని తన సెల్‌ఫోనులో ఓ నెంబరు కలిపాడు.

అతడినే గమనిస్తున్న శరత్, రామువైపు చూశాడు. ఫోన్ టాపింగ్ రెడీ అన్నట్టుగా రాము తల ఊపి నెంబరు విజయ్‌కి అందించాడు. విజయ్ ఫోనులో ఆ నెంబరుని ఎవరికో వినిపించాడు. ఫోను కనెక్టయింది.

'అత్యవసరమైతేతప్ప ఈ నెంబర్‌కి ఫోను చేయవద్దన్నావా?' కర్కశంగా వినిపించింది గొంతు.

'అక్కకి ఏమైంది?' ఏడుస్తూ అడిగాడు ప్రియదర్శన్. 'నువ్వు ఎవరికీ చూపించనన్నావు' అతడి మాట పూర్తికాకముందే ఫోను 'కట్' అయింది.

విజయ్ ఫోను మోగింది. 'చలో' అన్నాడు విజయ్ బయటకు పరుగెడుతూ.

***

'పిల్లల భవిష్యత్తుపై ఆందోళన కలిగించే అంశం ఇది. పిల్లలకు ఫేస్‌బుక్ ఎకౌంట్లు ఉండటం, సెల్‌ఫోన్ వాడకం వంటివి వారికి ఏ మాత్రం పరిచయంలేని ఘోరమైన ప్రమాదాల్లోకి నెడుతోంది. 'విల్సన్' అనే వాడు 'స్టీఫెన్సన్' అనే మారు పేరుతో ఫేస్‌బుక్‌లో టీనేజ్ పిల్లలకి చాటింగ్‌ద్వారా సన్నిహితుడవుతాడు. పలు పోర్న్ వీడియోలు అందించి వారిని ఉద్రేకపరుస్తాడు. తరువాత లైవ్ వీడియో చాటింగ్ ద్వారా పిల్లలతో లైంగికచర్యలు చేయిస్తాడు. అలా వాళ్ళని తన గుప్పెట్లోకి తెచ్చుకున్న తరువాత బ్లాక్‌మెయిల్ చేస్తాడు. అలా ఓ పద్నాలుగేళ్ళ అమ్మాయిని బ్లాక్‌మెయిల్‌చేసి, ఆమెతో ప్రియదర్శన్‌ను బలవంతపెట్టి లైంగికంగా కలిసేట్టు చేసి, దాన్ని వీడియో తీశాడు. ఆ వీడియోను రహస్యంగా ఉంచుతానన్నాడుగానీ, వీడియోని పోర్న్ సైట్లకు అమ్ముకున్నాడు. ప్రియదర్శన్ తల్లిదండ్రులు ఇంట్లో ఉండకపోవటంవల్ల ఈ లైంగిక చర్యల రికార్డింగ్ కూడా అక్కడే చేశారు. ఇలా దేశవ్యాప్తంగా పిల్లలను లోబరుచుకుని, ఆ సీడీలు సొమ్ము చేసుకునే పెద్ద నెట్‌వర్క్ చేస్తున్నాడు విల్సన్. అతని అరెస్టుతో ఈ నెట్‌వర్క్‌లో ఉన్న వాళ్ళంతా దొరికే వీలుచిక్కింది. వీరి గాలంలో చిక్కిన వాళ్ళ వివరాలు సేకరిస్తున్నాం. వారందరినీ కౌన్సెలింగ్‌కు పంపుతున్నాం. తల్లిదండ్రులకు ఇదొక హెచ్చరిక. పసిపిల్లల్ని పసిపిల్లలుగా ఉండనివ్వని రాక్షసుల నెట్‌వర్క్ 'నెట్'లో పొంచి ఉంది. పిల్లలను వారి నుండి కాపాడుకోవాల్సిన బాధ్యత మనందరిది' కేసు వివరాలు తెలియజేశాడు శరత్.

***—కస్తూరి మురళీకృష్ణ***

*సెల్: **98496 17392***



# ఆ ఆలయాల్లో పురుషులకు నో ఎంట్రీ

**ఆలయాలు దేవుని నివాసాలు. గుడిలోని దేవుణ్ణి దర్శించటానికి భక్తులు ఎక్కడెక్కడి నుంచో వస్తుంటారు.. లింగ భేదం లేకుండా దేవుణ్ణి మొక్కుతారు. ప్రసాదాలు తీసుకెళ్తారు. తీరా ఆ కోరిక సఫలమైన తర్వాత మొక్కు తీర్చుకోవటానికి వస్తుంటారు. అయితే కొన్ని ఆలయాల్లో ఆడవారికి ప్రవేశం లేదు. అలాంటి ఆలయాల గురించి మనకు తెలుసు. ఇటీవలే సుప్రీంకోర్టు జోక్యంతో కొన్ని ఆలయాల్లో స్త్రీలకు ప్రవేశం కల్పించారు.**

కానీ ఇక్కడే ఒక గమ్మత్తైన విషయం ఉంది. మీకు తెలుసా? కొన్ని ఆలయాల్లో మగవారికి ప్రవేశం నిషిద్ధమని! అదేంటి... మగవారు ప్రవేశించలేని ఆలయాలున్నాయా మనదేశంలో అని ఆశ్చర్యపోతున్నారా? అవును! మీరు విన్నది కరెక్టే. మహిళలను ఎట్టి పరిస్థితుల్లోనూ అనుమతించని ఆలయాల గురించి మనకు తెలుసు కానీ పురుషులను అనుమతించని ఆలయాలు కూడా కొన్ని ఉన్నాయి. అక్కడ కేవలం ఆడవాళ్ళకు మాత్రమే ప్రవేశం ఉంటుంది. మగవాళ్ళు అడుగుపెట్టడానికి వీల్లేదు. గుడిలోకి మగవాళ్ళు రాకుండా ఉండేందుకు అక్కడ కాపలాదారులు పహారా కాస్తుంటారు. ఇంతకీ ఆ ఆలయాలు ఏంటో మీరూ తెలుసుకోండి మరి!

### రాజస్థాన్

బ్రహ్మదేవుడికి ఆలయాలు చాలా అరుదు. మన దేశంలోని రాజస్థాన్‌లో ఉన్న బ్రహ్మ పుష్కర్‌లో బ్రహ్మదేవుడి ఆలయం ఉంది. ఈ ఆలయంలో మగవాళ్లకు ప్రవేశం లేదు. అదేంటి... బ్రహ్మ పురుషుడే కదా మరి పురుషులకు ప్రవేశం లేదని అంటారేంటి? అంటే, దీనికి కారణం బ్రహ్మ యజ్ఞం చేయాలనుకుని నిశ్చయించుకున్నప్పుడు సరస్వతీదేవి ఆ సమయంలో అతని పక్కన ఉండదు. బ్రహ్మ గాయత్రిని పెళ్ళి చేసుకుని యజ్ఞాన్ని పూర్తి చేస్తాడు. అందువల్ల సరస్వతీదేవికి ఆగ్రహం వచ్చి ఈ ఆలయంలోకి పురుషులు ప్రవేశించకూడదని, ఒకవేళ ప్రవేశిస్తే వారికి దాంపత్య సమస్యలు వస్తాయని శపిస్తుంది. అందుకే ఈ ఆలయంలోకి మగవాళ్ళు వెళ్లరు.



### చెంగన్నూర్ భగవతీ ఆలయం, కేరళ

చెంగన్నూర్ భగవతీ ఆలయం కేరళలో ఉంది. ఇక్కడ అమ్మవారు ప్రతినెలా రుతుస్రావాన్ని ఆచరిస్తుంది. ఆలయ స్థలపురాణం ప్రకారం, పార్వతీ దేవితో శివుని వివాహం తర్వాత ఆ కొత్త దంపతులు మొదటిసారిగా చెంగన్నూర్‌ను సందర్శించారట. అంతేకాక ఇక్కడ మరో కథ కూడా ప్రచారంలో ఉంది అమ్మవారికి గుడ్డకప్పినప్పుడు అది ఎర్రగా మారుతుంది. దీంతో అమ్మవారు రుతుస్రావం ఆచరించారని తెలుసుకుని గుడిని ప్రతినెలా మూడురోజుల పాటు మూసివేస్తారు. ఆ సమయంలో కేవలం ఆడవారిని మాత్రమే లోనికి అనుమతిస్తారు. నాలుగోరోజు ఆడవారు రహస్యంగా విగ్రహానికి పవిత్రజలంతో శుద్ధి చేస్తారు. ఆ తర్వాత పూజారులు వచ్చి అభిషేకం నిర్వహిస్తారు. తర్వాత అందరికీ గుడిలోకి ప్రవేశించడానికి అనుమతినిస్తారు. ఇలా ప్రతి నెలా మూడురోజులు కేవలం మహిళలు మాత్రమే గుడిలోకి వెళ్లడానికి అర్హులు. ఈసమయంలో ఆలయం అంతా మహిళామణులతో కిటకిటలాడుతూ ఉంటుంది.

కేవలం ఇదే కాకుండా 108 శక్తిపీఠాలలో ఒకటిగా చెప్పబడే ఆలయం కన్యాకుమారిలోని కన్యకాపరమేశ్వరి ఆలయం. మూడు సముద్రాల మధ్యన కొలువైన ఈ ఆలయంలోని ప్రధాన దేవతను భగవతీమాతగా పిలుస్తారు. ఆ ఆలయంలోకి కూడా పురుషులు వెళ్లరు.

## అక్కడ పురుషులకే తాళిబొట్టు!

భారతీయ సంప్రదాయం ప్రకారం స్త్రీ మెడలో పురుషుడు తాళిబొట్టు కట్టడం ఆనవాయితీ. కానీ ఓ గ్రామంలో సీన్ రివర్స్. అక్కడ పెళ్ళిలో ఆడవారే మగవారికి పుస్తెలు కడతారు. విచిత్రంగా అనిపించినా ఇది నిజం.

శ్రీకాకుళం జిల్లా వజ్రపుకొత్తూరు మండలంలో ఉంది నువ్వలరేవు గ్రామం. ఇక్కడ ఎక్కువగా మత్స్యకార కుటుంబాలు నివసిస్తుంటాయి. అయితే ఇక్కడ పెళ్ళి విషయానికి వచ్చేసరికి స్త్రీకి అధిక ప్రాధాన్యం ఇస్తారు. ఆడపిల్ల ఇష్టపడిన సంబంధాన్నే పెద్దలు కుదురుస్తారు. పైగా కొన్ని తరాలుగా ఇక్కడ ఆడవారే పురుషులకు తాళి కడుతున్నారు. ధాన్యం గింజ ఆకారంలో ఉండే బంగారు ఆభరణాన్ని పసుపుతాడుకు గుచ్చి కడతారు. అయితే మూడు నెలల లోపు స్త్రీలు తిరిగి ఆ తాళిబొట్టును తమ మెడలో వేసుకుంటారట. స్త్రీ, పురుషులు ఇద్దరూ సమానం అని చెప్పడమే ఈ ఆచారం వెనకున్న ఉద్దేశం అట.



### ఆట్టుక్కాల్ ఆలయం, కేరళ

కేరళ రాష్ట్రం, తిరువనంతపురానికి సుమారు రెండు కిలోమీటర్ల దూరంలో ఆట్టుక్కాల్ అమ్మ వారి దేవాలయం ఉంది. కేవలం పురుషులకు శబ



రిమలై ఆలయంలో ప్రవేశమున్నట్లే ఈ ఆట్టుక్కాల్ దేవాలయంలో కేవలం స్త్రీలకు మాత్రమే ప్రవేశం ఉంటుంది. ఈ ఆలయంలోకి పురుషులు అస్సలు వెళ్లరు. కాదని వెళితే పాపాలు చుట్టుకుంటాయని వారి భావన. ప్రతి ఏటా నిర్వహించే ఉత్సవాలకు, ఊరేగింపులకు కేవలం మహిళలు మాత్రమే వెళ్తారు. ప్రతీ సంవత్సరం వారం రోజుల పాటు అమ్మవారికి నారీ పూజ చేస్తారు. మహిళలు వారం రోజుల పాటు నిష్టతో ఉపవాసం ఉండి అమ్మ వారిని పూజిస్తారు. అప్పుడు కేవలం మహిళలు మాత్రమే ఆలయంలో ఉండాలి. మగవాళ్లు ఉండ కూడదు. ఇక్కడ ప్రధానంగా జరిగే ఉత్సవం పేరు 'పొంగా ఉత్సవం'. పొంగా పండుగనాడు ఆట్టు క్కాల్ అమ్మవారి దేవాలయం మహిళలతో కిటకిట లాడుతుంది.

ఫిబ్రవరి, మార్చి నెల మధ్యలో ఈ దేవాల యంలో పొంగా ఉత్సవం చాలా వైభవంగా జరుగు తుంది. ఎంతో మంది మహిళా భక్తులు ఈ ఉత్స వంలో పాల్గొని అమ్మవారికి ప్రత్యేకంగా పొంగల్ నైవేద్యాన్ని సమర్పించుకుంటారు. ఆ నైవేద్యాన్ని అప్పటికప్పుడే తయారుచేసి అమ్మవారికి నివేదన చేస్తారు. ఆ ప్రసాదం తయారుచేసే పద్ధతి కూడా చాలా సంప్రదాయంగా, శుచిగా ఉంటుంది. దాని కన్నా ముందు పొంగా ఉత్సవం ఏ తేదీన జరిగేదీ, ముహూర్త సమయం ఎప్పుడన్నదీ పూజారులు ముందుగా ప్రకటిస్తారు. ఆ ముహూర్త సమయా నికి ముందుగానే, అక్కడ ప్రదేశాన్ని శుభ్రపరచి చక్కగా ముగ్గువేసి, ఇటుకలతో పొయ్యిని పేర్చు కుంటారు. ఎండు కొబ్బరి, కొత్త కుండ, కొత్త బియ్యం, బెల్లం, కొబ్బరి ఆకుతో కూడిన కొబ్బరి మట్టను, పూజాసామాగ్రిని తమ వెంట తెస్తారు. ఈలోగా తమ వెంట తెచ్చుకున్న కొత్త కుండకు పసుపు రాసి, కుంకుమబొట్లు పెట్టి అందంగా అలంకరిస్తారు.

పూజారి ముహూర్త సమయం ఆరంభమైందని చెప్పగానే, మహిళలు తాము ముందుగా అమర్చుకున్న పొయ్యి వెలిగిస్తారు. బియ్యం కడిగి కుండలో పోసి, తగినంత నీరు పోసి, ఆ పొయ్యిమీద పెడతారు. బియ్యం ఉడకగానే అందులో పాలు పోసి నైవేద్యం తయారు చేస్తారు. నైవేద్యం తయారైన తర్వాత ఒక అరటి ఆకును శుభ్రపరచి, కుండలోని అన్నాన్ని ఆకులో ఉంచుతారు. పొంగా ఉత్సవ గీతాలు, అమ్మవారిని స్తుతించే పాటల సందడితో ఆ ప్రాంతం మారుమోగుతుంది. అమ్మవా రిని కీర్తిస్తూ ఎన్నెన్నో దండకాలు, పాటలు... స్త్రీలంతా కలిసి పెద్ద గొంతుతో వినిపిస్తూండగా, అర్చకులు ఆ ప్రాంతమంతా తిరుగుతూ, పవిత్రోదకంతో ప్రసాదాలను సంప్రోక్షిస్తారు.



స్త్రీలందరూ ఎంతో భక్తితో ఆ నైవేద్యం స్వీక రించి, అమ్మవారికి పూజ జరిపిస్తారు. కేరళీయులే కాక ఇతర ప్రాంతాల నుంచి కూడా ఎందరో స్త్రీలు పొంగా పండుగ సమయానికి అక్కడకు చేరుకొని, తామూ అమ్మవారికి నైవేద్యం అర్పించి, పూజ జరి పిస్తారు. ఆ దేవత కరుణా కటాక్షాల కోసం, ప్రార్థ నలు, భజనలు జరుపుతారు.

### బీహార్‌లో

మాతా ఆలయం బీహార్ రాష్ట్రంలోని ముజఫర్‌పూర్ పట్టణంలో ఉంది. అమ్మ వారికి ఏటా కొన్ని ప్రత్యేక రోజులలో పూజలు నిర్వహిస్తారు. ఆ సమ యంలో కేవలం ఆడవారిని మాత్రమే గుడిలోనికి అనుమతిస్తారు. మగవా రిని అనుమతించరు.

**–దహగం విజేత**

## మగవారి కోసం

**చ**రిత్రలో ఎంతోమంది తమ భార్యలు, ప్రియురాళ్ళ జ్ఞాపకార్థం ఎన్నో ప్రసిద్ధ కట్టడా లను నిర్మించారు. కాని మగవారి జ్ఞాపకార్థం, మగవారి కోసం కూడా ఆడవారు పలు కట్ట డాలు నిర్మించడం జరిగింది. అయితే అవి పెద్దగా ప్రాచుర్యంలోకి రాలేదు. అవేమిటో చూద్దాం...

**మొదటి ఉద్యానవన సమాధి:** మొఘల్ చక్ర వర్తి హుమయూన్ చనిపోయాక, ఆయన



భార్య హమీదాబాను బేగం అతడి జ్ఞాపకార్థం ఒక పెద్ద సమాధి నిర్మించారు. భారతదేశంలో మొదటి ఉద్యానవన సమాధిగా దీనికి గుర్తింపు ఉంది. ఆ సమాధి ఇప్పటికి కూడా చాలా ఫేమస్. హుమయూన్ సమాధికి చాలా ప్రత్యే కతలు ఉన్నాయి.

**ఇత్మద్ ఉద్ దౌలా:** నూర్జహాన్ తన తండ్రి మరణించిన కొన్ని సంవత్సరాలకు, ఆయన



జ్ఞాపకార్థం, 'ఇత్మద్ ఉద్ దౌలా' అనే కట్టడాన్ని అద్భుతమైన పాలరాతితో నిర్మించింది. తాజ్ మహల్ ఆకారంలో ఉంటుందీ కట్టడం! ఇది కూడా ఆగ్రాలోనే యమునా నదీతీరంలోనే ఉంది. ఈ కట్టడాన్ని దూరం నుంచి చూస్తే పెద్ద నగలపెట్టెను తలపింపజేస్తుంది.

**రాణీ కి వావ్:** సోలంకి రాజు భీమదేవుడి జ్ఞాపకార్థం ఆయన భార్య ఉదయమతి గుజరా త్‌లో ఏడు అంతస్తుల బావి 'రాణీ కీ వావ్'ను నిర్మించింది. ఈ బావి అప్పట్లో కొన్ని వేల ఎక రాలకు నీటిని అందించేది అని స్థానికులు చెబుతూ ఉంటారు. ప్రతి అంతస్తులో కూడా ఎన్నో అద్భుతమైన శిల్పాలు ఉంటాయి. దీనిని హెరిటేజ్ కట్టడంగా కేంద్ర ప్రభుత్వం గుర్తిం చింది.

**విరూపాక్ష దేవాలయం:** రెండో విక్రమాది త్యుడి భార్య లోకమహాదేవి కర్ణాటకలోని పట్ట దకల్‌లో విరూపాక్ష దేవాలయాన్ని నిర్మింప జేసింది. ఈ దేవాల యంలో అద్భుతమైన శిలలు, శిల్పాలు కొలు వుదీరి ఉంటాయి. తన



భర్త పల్లవుల సామ్రాజ్యంపై దండెత్తి, సాధిం చిన విజయానికి చిహ్నంగా విరూపాక్ష దేవాల యంను కట్టించింది లోకమహాదేవి.

**మిర్జాన్ కోట:** కర్ణా టకలోని మిర్జాన్ కోటను కూడా ఒక మహిళే కట్టించింది. ఆమే చెన్నమహాదేవి.






**‘అస్సలు పోలికేలేదు, కిరణ్ ఎక్కడ బావ ఆనంద్ ఎక్కడ. కిరణ్ ఓ జలపాతం, బావ ఓ సెలయేరు. కిరణ్ మాటవిన్నా, మనిషి కనపడినా మనసు ఉప్పొంగుతుంది. అదే బావ ఎదురుగా ఉండి మాట్లాడినా కూడా ఉత్సాహం చల్లారుతుందే తప్ప ఉద్వేగం కలగదు’ ఇవీ స్వాతి ఆలోచనలు.**

బావ ఆనంద్‌తో చిన్నతనంనుంచీ కలిసిమెలిసి ఒకేచోట పెరిగింది స్వాతి. అతని మంచితనం, నెమ్మది తెలుసు. అతని విషయంలో తన తల్లి దండ్రులకి ఉన్న అభిప్రాయమూ తెలుసు. పుట్టినప్పటినుంచీ తామిద్దరూ భార్యాభర్తలనే తమ పెద్దల అభిప్రాయంతో తనకీ అభ్యంతరం ఉండేది కాదు. కానీ కిరణ్ పరిచయం అయినదగ్గరనుంచీ తన ఉద్దేశం మారిపోయింది.

స్వాతికి కిరణ్ పరిచయమే చిత్రంగా జరిగింది. ఒకరోజు పొద్దున్నే ఫోన్ చేశాడు కిరణ్. అదే మొదటి ఫోన్‌కాల్.

‘నా పేరు కిరణ్. నేను ఇంజనీరింగ్ పూర్తి చేశాను. బాగానే అందంగానే ఉంటానని అందరూ అంటుంటారు. మీరు నన్ను తప్పుగా భావించకపోతే ఒక్కమాట. మీరంటే నాకు ప్రాణం. మిమ్మల్ని తొలిసారి చూసినదగ్గర్నించీ నాకు మీ స్మరణే. అలా అని నావల్ల మీకు కష్టం కలుగుతుందని అనుకోవద్దు. నా వల్ల మీకు ఆనందం సంతోషమే ఉండాలి. ఉంటుందని హామీ ఇస్తున్నాను. మీకు సమ్మతం కాకపోతే మరోసారి మీకు ఫోన్ కూడా చెయ్యను’ అంటూ అదే పద్ధతిలో చాలాచాలా మాట్లాడాడు.

స్వాతి అప్పుడే చెప్పింది... తనకి ఆనంద్ అనే బావ ఉన్నాడనీ, తనను అతనికే ఇచ్చి పెళ్ళి చేద్దామనుకుంటున్నారనీ అందువల్ల తన మీద ఆశలేమీ పెట్టుకోవద్దనీ.

కానీ కిరణ్ స్వాతిని వదల్లేదు. ‘మీరు ఏమైనా చెయ్యండి. మీకు అడ్డురాను. కానీ మీ మీద ఆరాధన చావదు. నా దారిన నేను మీకు కష్టం కలగకుండా ఆరాధిస్తూనే ఉంటాను’ అంటూ ఓ గమ్మత్తైన పద్ధతి అవలంబించాడు.

రోజూ ఎన్నోసార్లు ఫోన్ చేసేవాడు. స్వాతి వేసుకున్న దుస్తులు, పెట్టుకున్న పువ్వులు, తొడుక్కున్న జోళ్ళు... ఎప్పుడు ఎలా నవ్విందో, ఏ సమయంలో ఎలా కోపం వచ్చిందో, ఇలా ఆమె ప్రతి వివరం చెప్పటమే పనిగా పెట్టుకున్నాడు.

కొన్నాళ్ళకి స్వాతి మనసు మారింది. ఇంతగా అనుక్షణం తన ధ్యాసగానే ఉంటున్న కిరణ్‌ని చూడాలనిపించింది. ఇద్దరూ కలుసుకున్నారు. కబుర్లు చెప్పుకున్నారు. క్రమేపీ కిరణ్ అంటే అపరిమితమైన అభిమానం ఏర్పడింది స్వాతికి.

ఇప్పుడు కిరణే సర్వస్వంగా అనిపిస్తున్నాడు స్వాతికి. అతనితో ఆనంద్‌ని పోల్చి చూసుకుంటే, తన బావ తీసికట్టుగా అనిపిస్తున్నాడు. ఏ అమ్మాయికైనా, కిరణ్‌లాంటి వ్యక్తి ఓ అదృష్టం.. మహా భాగ్యం. ఆ భాగ్యం తనకే దక్కింది. తన అదృష్టానికి తనే పొంగిపోయింది స్వాతి.

స్వాతి మనసులో ఓ నిర్ణయం జరిగిపోయింది. కిరణే తన జీవితం, అతనితో భావి జీవితం ఓ అందమైన భావనగా నిరంతర చింతనగా మారింది.

కిరణ్, స్వాతి నువ్వు నువ్వు అనుకుంటున్నారు ఒకరినొకరు స్పృశించుకుంటున్నారు. ఆ స్పర్శానందం బావుంటోంది. కిరణ్ నెమ్మదిగా స్వాతి అంగాంగ వర్ణనలు చెయ్యటం, దానికి స్వాతి మురిపెంగా సిగ్గుపడటం జరుగుతోంది. శృంగార సంభాషణలు, చిన్నాపెద్దా సరసాలు, వాళ్ళు కలిసి గడిపే సమయం ఉత్సాహంగా సాగిపోతోంది.

ఎప్పుడు ఏం జరుగుతుందో వాళ్ళకే తెలియని పరిస్థితి. అవకాశం అనువైనచోటు కుదిరితే, ఇద్దరి శరీరాలు కలిసి పోవటానికి ఏ అభ్యంతరం లేదు.

అటువంటి సమయంలో ఆనంద్ ఒకరోజు స్వాతిని పిలిచాడు. ‘నీతో ఓ విషయం మాట్లాడాలి’ అన్నాడు. ‘ఏమిటీ?’ అంది విసుగ్గా స్వాతి.

ఆమె అలా విసుక్కున్నా, ఆనంద్ నొచ్చుకోలేదు. నెమ్మదిగా తను చెప్పదలుచుకున్నదంతా చెప్పే



## అనుష్కశర్మకు ఏమైంది?

ఈ అనుష్క టాలీవుడ్ జేజమ్మ కాదు. బాలీవుడ్ అనుష్కశర్మ. అనుష్క, విరాట్‌లు త్వరలోనే పెళ్ళి చేసుకోవచ్చు అన్న ఊహాగానాలు వినిపిస్తున్న సమయంలో మళ్ళీ ఇద్దరి మధ్యా భేదాభిప్రాయాలు పొడసూపాయా? అన్న అనుమానాన్ని బాలీవుడ్ జనాలు వ్యక్తం చేస్తున్నారు. ఇంతకీ అసలు సంగతేమిటంటే....అనుష్కశర్మ, విరాట్‌లు కలిసి ఓ సినిమా ప్రీమియర్ షోకి వెళ్ళారు. వెళ్ళినప్పుడు బాగానే ఉన్నారు. తిరిగి వచ్చే సమయంలోనే ఇద్దరిలోనూ ఏదో తేడా కనిపించింది అంటున్నారు. ఇద్దరినీ ఆ సినిమా గురించి మాట్లాడమంటే అనుష్కశర్మ విరాట్‌తో కలిసి మాట్లాడ డానికి నిరాకరించింది. దాంతో విరాట్ ఒక్కడే మాట్లాడాడు. విరాట్ మాట్లాడుతున్న సమయంలోనే అనుష్క శర్మ విస విసా అక్కడి నుంచి వెళ్ళిపోయిందట!

**సొంత బావే ఆమెకు కాబోయే భర్త. ఆ విషయం చిన్నప్పుడే ఫిక్స్ అయిపోయింది. ఆమెకీ అభ్యంతరం లేదు. కానీ జలపాతంలా ఆమె జీవితంలోకి ప్రవేశించాడు కిరణ్. అతని మాటలు ఆమెను కట్టిపడేస్తాయి. సమ్మోహనంగా ఉంటాయి. అతని స్పర్శ ఎంతో బాగుంటుంది ఆమెకి. కోరికలతో రగిలిపోతున్నారు ఆ ఇద్దరూ. ఎప్పుడు అవకాశం వచ్చినా ఏకాంతంగా ఒకచోట చేరుతున్నారు. కానీ అంతలో ఏం జరిగిందంటే....**

శాడు. చెప్పాక "చూడు స్వాతీ, నువ్వంటే నాకు ఇష్టం. కానీ ఇదంతా అందుకు చెప్పలేదు. నువ్వు ఏ నిర్ణయం తీసుకున్నా, ఏ అడుగువేసినా సరైనదై ఉండాలి. అందుకు నీకు నిజమేమిటో అబద్ధం ఏమిటో తెలియాలి. అందుకే ఈ వివరాలు చెప్పాను. నేను చెప్పినట్టు చెయ్యి. దానివల్ల నిజం తెలుస్తుంది. ఆ తర్వాత నీ ఇష్టం" అన్నాడు.

ఆనంద్ చెప్పింది వినగానే స్వాతికి ముందు చిరాకేసింది. ఆ తర్వాత అతను చెప్పింది సబబే అనిపించింది. అలా చెయ్యటం వల్ల నష్టమేం లేదు అనిపించింది.

***

"కిరణ్ నేనంటే నీకున్న ఆరాధన గొప్పది. అందుకు నాకెంతో సంతోషం. ఆడదానికి అంతకన్నా కావాల్సిందేముంది. నీకు నామీద ఎంతమోజో, నాకు నీ మీద అంతకన్నా ఎక్కువ. ఏ క్షణంలో మనం తొందరపడిపోతామో అనిపిస్తోంది. నువ్వు నిగ్రహించుకున్నా, నేను నిగ్రహించుకోలేనేమో అనిపిస్తోంది. అందుకని వెంటనే పెళ్ళి చేసేసుకుందాం. ఆ తర్వాత ఏం జరిగినా ఏ ఇబ్బందీ ఉండదు" అంది స్వాతి.

ఆ మాటలకు ఉలికిపడ్డాడు కిరణ్. "పెళ్ళా! చేసుకోవచ్చుగానీ, ఇంతవెంటనే అంటే అమ్మా నాన్న ఒప్పుకోరు. వాళ్ళకి నా పెళ్ళిమీద చాలా కోరికలు ఉన్నాయి. ఒక్కణ్ణే కొడుకుని కదా. పైగా ఇప్పుడు మనకేం తక్కువైందని ఈ తొందర. కొన్నాళ్ళు రొమాంటిక్‌గా, హాయిగా ఉందాం. పైగా ప్రీ-మారిటల్ సెక్స్ ఓ గొప్ప థ్రిల్. అది మిస్ అవకూడదు. స్వాతీ... జీవితమంటే అన్నిరకాల అనుభూతుల్ని అనుభవించాలి" అన్నాడు ఆమెను దగ్గరకి తీసుకోబోతూ.

స్వాతి దూరంగా జరిగింది. కిరణ్ మీద అంత వరకూ ఉన్న గుడ్డి నమ్మకం కొంచెం సడలింది.

ఒక్కక్షణంలో స్వాతి మనసు చెదిరిపోయింది. ఇంతవరకూ కిరణ్ పూర్తివ్యక్తిగానే తనను ఆరాధించాడనుకుంది. పెళ్ళిని, శరీరకాంక్షని వేరువేరుగా వ్యక్తీకరిస్తాడనుకోలేదు.

"అయితే, పెళ్ళికిముందు సెక్స్ ఉంటేతప్ప మన అనుభవం పండదని నీ అభిప్రాయం, అంతేనా..?" కిరణ్‌ని అడిగింది స్వాతి.

"నువ్వంటే ఇంతగా పడి చస్తున్నాను. ఆ మాత్రం ముందడుగు వెయ్యలేవా?" అని బదులు ప్రశ్నవేశాడు కిరణ్.

"నేనంటే నేనొక్కదాన్నేనా! ఇంతకుముందు ప్రమీల, ఇందిర, జ్యోత్స్న వీళ్ళంటే కూడా ఇలాగే పడి చచ్చావుగా?" అంది కోపంగా స్వాతి.

కిరణ్ ఉలికిపడ్డాడు. స్వాతి కోపం చూస్తుంటే మాట పెగలలేదు అతనికి. అతికష్టంమీద "వాళ్ళ గురించి నీకెవరు చెప్పారు?" అన్నాడు.

"ఎవరు చెపితేనేం... నిజమేగా.? నీలాంటి వెధవల వల్లే మన యువతీయువకుల్లో ఒకళ్ళంటే ఒకళ్ళకి నమ్మకం పోతోంది. ఆడపిల్ల అందులో యవ్వనం తొలిరోజుల్లో పొగడ్తలకి పొంగి పోతుంది. నీలాంటి వాళ్ళ దొంగవేషాలు చూసి అమోఘమైన ఆరాధన అని భ్రమిస్తుంది. నిజం తెలుసుకుని మేలుకోకపోతే, శరీరం మలినమై, మనసు చెదిరి, మగవాడంటనే భయపడే స్థితికి చేరుతుంది. నువ్వు ఎర్ర చీరలో బావున్నావు, నీ తలలో ఒంటరి గులాబీ, నీ పాదాలు వెన్నెల రూపాలు అంటూ పిచ్చివాగుడు వాగే బదులు, ఆరాధనంటూ మోసగించి బతుకు నాశనం చేసే బదులు, ధైర్యంగా నీ శరీరంమీదే నాకు కోరికుంది అని చెప్పే మగాడివై ఉంటే ఇంతగా బాధపడేదాన్ని కాదు. ఓ మగతనం లేని వాడిలా ప్రవర్తించావు. నువ్వు నన్నేకాదు జీవితంలో ఎవరినీ ప్రేమించలేవు. ఆ నైజం నీలో లేదు. ఇంకెప్పుడూ నా జోలికి రాకు. పో.. నాకళ్ళ ముందు నుంచి పో" అంది.

కిరణ్... సారీ అంటూ ఏదో చెప్పబోయాడు. స్వాతి వినిపించుకోకుండా అతన్నించి దూరంగా వచ్చేసింది. అతని నోరు నిజం చెబుతుందన్న నమ్మకం పూర్తిగా పోయింది.

***

"చాలా మంచిపని చేశావు బావా... నేను నిన్ను నిర్లక్ష్యం చేసినా, నా పట్ల అభిమానంతో, కిరణ్ గురించి వివరాలు సేకరించి నాకు చెప్పి, నా జీవితాన్ని రక్షించావు" అంది స్వాతి ఆనంద్‌తో.

"నువ్వంటే ఇష్టపడిన వాడిగా ఇది నా బాధ్యత స్వాతి. ఆడదాన్ని కావాలనుకోవటమేకాదు ప్రమాదాల నుంచి రక్షించుకోవటం కూడా మగాడి కర్తవ్యం" అన్నాడు ఆనంద్.

"నిజం బావా.. తను ప్రేమించిన ఆడదానికి ఏ రకంగానూ కష్టం కలగకూడదనుకోవటమే నిజమైన ప్రేమ. అబద్ధం కాకుండా, నిజంతో కంటికి రెప్పలా కాపాడుకోవటమే సరైన ఆరాధన" అంది స్వాతి, ఆనంద్ కౌగిలిలోకి చేరుతూ.

"కల్లబొల్లి కబుర్లకి, అబద్ధాల పొగడ్తలకి లొంగిపోవటం ఆడవాళ్ళ వయసు లక్షణం. అది సహజం. కానీ తమ రక్షణ గురించి తాము పట్టించుకోనంతగా లొంగిపోవటం పెద్ద తప్పు. ప్రేమ మోహం మనల్ని సంతోషపరచాల్సిన సరసంలో ఓ భాగం. అంతేకానీ, జీవితాల్ని నాశనం చేసేది సరస శృంగారం కాదు. ఏమైతేనే నువ్వు నాకేదక్కటం ఎంతో ఆనందంగా ఉంది" అన్నాడు.

స్వాతికి ఆ చేరువ ఉపశాంతిగా, ప్రశాంతంగా ఉంది. చక్కటి సెలయేరులాంటి తృప్తేతప్ప ఉధృతంగా ముంచెత్తే జలపాతం అలజడికాదు.

నవ్య



5

# ప్రయాణం

(రాచెల్ కలోఫ్ ఆత్మకథ)

-బాలి

సెల్: 98499 63082

**ఎలా ఆశలు నింపుకోవాలో తెలియడం లేదు. పక్కకు తిరిగి చూస్తే ముసలామె హాయిగా నిద్రపోతోంది. ఆ రాత్రి నా నిద్ర కలత నిద్రే అయింది.**

**వీరి మాటల్లోనూ చేతల్లోనూ తెలుస్తున్నదేమంటే అబ్రహం ఒక్కడే కొంచెం సంపాదనా పరుడు. అందువల్లనే అతను న్యూయార్క్ నగరంలో ఉండి ఆ పనీ, ఈ పనీ చేస్తూ ఇంటికి కొంత మొత్తం పంపుతున్నాడు. ఛార్లీని చూస్తే అతనికి కష్టపడాలన్న ఆలోచన ఉన్నట్టు లేదు. ప్రతి చిన్న విషయానికి తమ్ముడు అబ్రహం వైపు చూస్తుంటాడు. పైగా అబ్రహం తల్లిదండ్రులంటే గౌరవమూ భక్తీ ఉన్నవాడు. అందువల్ల తన నిర్ణయాన్ని స్పష్టంగా తల్లిదండ్రులకు చెప్పలేనివాడు.**

తనలా ఆలోచనల్లో ఉండగానే తెల్లవారింది.

అందరూ కాలకృత్యాలు తీర్చుకున్న తరువాత చిన్న సమావేశం. కుటుంబ సభ్యులందరూ కూచున్నారు. నేనో బల్లచివర కూచున్నాను. వారి మాటలు వింటూ.

"వచ్చేది చలికాలం. దాన్ని తట్టుకోవాలి, ఇల్లు గడవాలంటే ముందు కొంత డబ్బు సంపాదించి, రేషన్ ముఖ్యంగా కిరసనాయిలు కొని ఇంట్లో డబ్బాలో నిలవచేయాలి. పిండి గింజలూ, కాఫీపొడీ మామూలే! ఇరవై లేక ముప్ఫయి మైళ్ళ దూరంలో వీరిలాగే వీరికంటే ముందే వలసొచ్చిన రైతు ఉన్నాడు. అతని వద్ద భూమిని దున్నే గుర్రాలు, ఇనుప పనిముట్లు అన్నీ ఉన్నాయి. పొలం మీద సోయా, మొక్కజొన్న వంటి పంటలు కోతకు వచ్చి ఉన్నాయి. అతనికో మనిషి అవసరం. అతని వద్ద మూడు నెలలు ఉంటే చాలు. వారాంతంలో ఇంటికి వెళ్లి రావచ్చు. మొత్తం డెబ్బై డాలర్లు ఇస్తాడు.

ఇదీ వీరి మాటల సారాంశం. దానికి అబ్రహం వెళ్ళాలి. నాకు గుండెల్లో రాయి పడింది. నేను ఎవరి కోసం ఆలోచిస్తున్నానో ఆ మనిషి వారం దినాల పాటు కనపడడు. మిగిలిన ఇద్దరన్నదమ్ములూ వెళితే ఇంకా ఎక్కువ డబ్బు రాదా? సరే, ఆ రైతుకు ఒక్క మనిషే కావాలనుకున్నా, అతనికి నచ్చచెప్పి నలుగురూ గబగబా పనులు చేస్తే అనుభవం వస్తుందీ, డబ్బూ వస్తుంది కదా! ఇంత పెద్ద ఫ్యామిలీ కోసం ఒక్క మనిషి మీద ఆధారపడడం ఏం న్యాయం? ఇదేమిటి అని ప్రశ్నించే హక్కు ఇంకా నాకు లేదే?

అబ్రహం వెళ్లిపోతే నేను ఒంటరిని అయిపోతానని నాకు భయం. అతడు ఏ విషయమూ నాతో మాట్లాడలేకపోవచ్చు. కానీ ఆ పరిసర ప్రాంతాల్లో ఉంటే నాకు కొంచెం ధైర్యం. నా రోదన అరణ్య రోదనే అయింది.

అబ్రహం కూలీ కోసం వెళ్లిపోయాడు. ఆ వారాంతం వరకూ అలాగే గడిపాను. ఇక ఆ సాయంత్రం అతడు రావాలి. ఎదురు సన్నాహమా అన్నట్టు ఆ ఇంటికి కొంచెం దూరంలో ఆ గడ్డి దుబ్బుల మధ్య ఉన్న పెద్ద రాయి ఎక్కి కూచున్నాను. చీకటి చిక్కబడుతోంది. ఎదురు చూస్తున్న కొద్దీ విసుగుతో పాటు కళ్ల వెంబడి నీళ్ళు తిరుగుతున్నాయి. ఇంత వరకూ ఇన్ని దేశాలు దాటి వచ్చిన దాన్ని ఇలా భయపడితే ఎలా? నాకు నేనే ధైర్యాన్ని చిక్కబట్టుకొని రాయి దిగాను. ఆకాశంలో చుక్కలు మిలమిల మెరుస్తున్నాయి. ఎక్కడో ఆ గడ్డి మైదానంలో తోడేలు అరుస్తోంది. అబ్రహం జాడ లేదు. ఇంటికి మళ్లాను. నాకు కాబోయే అత్తగారు పొయ్యి దగ్గర చేతులు వేడి చేసుకుంటూనే, నా ముఖంలోకి చూసింది. కళ్లు ఎంత తుడుచుకున్నా బుగ్గల మీద కన్నీటి చారికలు కనిపించాయి కాబోలు "అదేమిటి? ముఖం అలా ఉంది?" అంది.

"ఏం చెప్పను?"

"ఏదో పురుగు కళ్ల మీద పడింది." అన్నాను ముఖం దింపుకుంటూ. చిన్న అబద్ధం!

"అవును. ఈ గడ్డిభూముల్లో చాలా పురుగు లుంటాయి. చూసుకోవాలి" అంది ఓదార్పుగా.

హమ్మయ్య అబద్ధం రక్షించింది. అయితే ఇలా చీకటిలో బయటకు వెళ్లడం, ఆ గడ్డి బీడుల మధ్య కూర్చోవడంలో మరో సంగతి తెలిసింది. ఇంట్లో



కిరోసిన్ లేదు సరే! సబ్బత్ (శుక్రవారం) రోజన్నా ఓ కొవ్వొత్తి వెలిగించి గుమ్మంలో పెట్టలేకపోతున్నామని ఈమె ఎన్నోసార్లు అనడం విన్నాను. ఇప్పుడీ గడ్డిభూమిలో నేను కూచున్న రాయి దగ్గర మెత్తని ఒండ్రుమట్టి చూశాను. దాన్ని ప్రమిదలుగా చేసి, ఎండలో పెడితే! (యూదులకు ప్రతి శుక్రవారం పవిత్రమైనరోజు, ఆరోజు సంధ్యవేళ గుమ్మంలో దీపం పెడతారు). రాత్రి ఎంత గడిచినా అబ్రహం జాడే లేదు. దాంతో ఏం చేయాలో తోచక, నిన్న రాత్రి వచ్చిన ఆలోచనకు ఈ రోజు రూపం ఇవ్వదలిచాను. ఒండ్రుమట్టిని వత్తి ప్రమిదలు చేసి ఎండలో పెట్టాను. ఎండుగడ్డిని నరికి కుప్పగా పోసి అందులో ప్రమిదలు వేసి కాల్చాను. చక్కటి ప్రమిదలు తయారయ్యాయి. వాటిని శుభ్రం చేసి ఇంట్లో ఉన్న వెన్న వేసి దీపాలు వెలిగిస్తే ఇంట్లో కాంతీ ఉంటుంది. ఆ సబ్బత్ రోజున వెలిగిస్తే ఈ ముసలామెకు తృప్తిగానూ ఉంటుంది. పైగా ఆమె ఆలోచన ప్రకారం శుభప్రదం కూడా. రెండు ప్రమిదలు తీసుకొని ఇంత వెన్న వేసి బట్ట పీలికలతో వత్తిని చేసి వెలిగించాను. ముసలామె ముఖం ఆనందంతో వెలిగిపోయింది. నాకూ ఆనందంగానే ఉంది. ఈ రోజన్నా అబ్రహం వస్తాడేమో..ఇవన్నీ అబ్రహం చూస్తాడేమో అని...

చీకటి పడింది. ఈరోజన్నా అబ్రహం రావాలి. బయటకు తొంగి చూస్తే ఆకాశంలో చుక్కలు అక్కడక్కడా మెరుస్తున్నాయి. మామూలుగా నేను వెళ్లే ప్రాంతానికి ఆ గడ్డిలో బయలుదేరాను. చాలాసేపటి తరువాత చుక్కల వెలుగులో ఎవరో వస్తున్నట్టే అనిపించింది. రాయి మీద కూచున్న దాన్ని నిలబడి ఎలుగెత్తి అరిచాను 'అబ్రహం' అని. ఇంకా సరదాగా గట్టిగా అరిచాను. నా గొంతు నాకే చిత్రంగా అనిపించింది. అలా అరవడం వలన దగ్గు కూడా వచ్చింది. కళ్లు ఇంతింతలు చేసుకొని చూస్తుంటే అబ్రహమే వస్తున్నాడు. చేతిలోని కర్రతో పెద్ద శబ్దం చేస్తున్నాడు. అతని నడక నాకు గుర్తే!

ఇంకా గట్టిగా అరిచాను. అతను పరుగున వచ్చాడు. నా దగ్గరగా వచ్చి "ఉష్..గట్టిగా అరవకు. నా వెనక మా యజమాని ఉన్నాడు" అన్నాడు.

"నాకెవరూ కనపడలేదే?"

## జరిగిన కథ

రాచెల్ కలోఫ్ ఉక్రెయిన్‌లో పుట్టి పెరిగింది. తరువాత అమెరికా చేరింది. ఆమె రాసుకున్న ఆత్మకథే ప్రయాణం. రాచెల్ చిన్నతనంలోనే తల్లి మరణించటంతో తండ్రి తన నలుగురు పిల్లలని బంధువుల పంచనచేర్చి, అమెరికా వెళ్ళిపోతాడు. అమెరికాలో ఉంటున్న అబ్రహం రాచెల్‌ను పెళ్ళిచేసుకోదలచి, ఆమెను అమెరికా రప్పిస్తాడు. ఆమెను తన తల్లిదండ్రులుండే నార్త్ డకోటా ప్రాంతానికి తీసుకెళతాడు అబ్రహం. అక్కడి వాతావరణాన్ని, ఆ మనుషులను చూసి కలవరపడుతుంది రాచెల్. తన కలలు కల్లలవబోతున్నాయా అని ఆలోచిస్తుంది. **ఆ తర్వాత....**



"లేదు..ఉన్నాడు. ఈ మైదానంలో చిన్న శబ్ద మైనా పెద్దగా వినపడుతుంది. నన్ను కొంత దూరం దిగబెట్టడానికి గుర్రం మీద వచ్చాడు. అతని పేరు అండర్సన్" అన్నాడు.

"ఓ... మరి నా కేకలు వినపడ్డాయా?" అన్నాను సరదాగా.

"స్పష్టంగా వినపడ్డాయి తెలుసా! ఎవరో నీ పేరు పిలుస్తున్నట్టున్నారు అన్నాడు అతను."

"సరి సరి" అన్నాను నవ్వుతూ.

అతను బాగా అలిసిపోయి ఉన్నాడు. అక్కడ విశ్రాంతి లేని పని చేయాలట. ఆ యజమాని అలాగే చేస్తున్నాడు కాబట్టి తనకూ తప్పడం లేద న్నాడు. దాన్ని 'బైండింగ్' పనులంటారని చెప్పాడు. కోతలు కోయడం, కట్టలు దగ్గరగా కట్టి వేగన్ మీదకు ఎక్కించడం, గోడౌన్‌లో ఆ కట్టలను పేర్చడం, నూర్పులప్పుడు ఆ కట్టలను కళ్లంలోకి చేర్చి నూర్పిళ్లు చెయ్యడం.

ప్రస్తుతం యంత్రంతో కోతలు జరుగుతు న్నాయి. కోసినంత మేర కట్టలు కట్టి గోడౌన్‌లో వేస్తున్నాం అన్నాడు. అతని చేతులు మొండితేరి ఉన్నాయి. గెడ్డం పెరిగి ముఖమంతా చెమటతో నిండిపోయి ఉంది. ఇద్దరం ఇంటి ముఖం పట్టాము. ఇంటిలో దీపాల వెలుగులు చూశాడు. ప్రమిదల సంగతి చెప్పాను. అతని ముఖం ఆనం దంగా వెలిగిపోయింది. ఆ మరుసటి రోజు విశ్రాంతి తీసుకుని మళ్ళీ పనిలోకి వెళ్లిపోయాడు. వారాంతం వరకూ నేనూ ఏదో మామూలుగా గడ పడం, అతని రాక కోసం ఎదురుచూడ్డం అవు తోంది. ఆ రోజు అతడు రావాలి. అతని కోసం నేను బయటకు ఆ మైదానంలోకి వెళ్లడం మామూలు అయిపోయింది. ఆ ముసలామె ఏమీ అనకపోయినా అప్పుడప్పుడు 'పురుగూ పుట్రా ఉంటాయి. జాగ్రత్త! చూసుకో' అనేది. నేనూ ధైర్యంగా అది నాకు తెలి సిన దారేలే అన్నట్టు బయలుదేరాను.

అయితే ఈ రోజు బయట చాలా చల్లగా ఉంది. ఆ మైదానంలోకి పోయి ఆ రాయి ఎక్కి అత నికి ఆహ్వానం పలకాలని ఉంది. అయితే నా దగ్గర సరైన ఉన్ని బట్టలు లేవు. ఎందుకైనా మంచిదని చేతిలో ఓ పెద్ద కర్ర పట్టుకొని బయలుదేరాను.

చీకటి చిక్కగా ఉంది.

మబ్బులు తెరలు తెరలుగా ఉన్నాయి కాబోలు నక్షత్రాల వెలుగూ అంతంత మాత్రమే!

అక్కడక్కడా ఆరిపోతున్న బురద. ఆ పక్కన ఏపుగా గడ్డి బాగా బలిసి ఎత్తుగా నాకన్నా ఎత్తుగా... వాటికింద కప్పల అరుపులు, అది విసు గొచ్చే రొద. మధ్యలో నక్కల అరుపులకు లెక్కేలేదు. వీటి మధ్య నీటి పురుగుల రొదలు. నాకు కాబోయే అత్తగారు ఇలాంటిచోటే దయ్యాలుంటాయని ఓ మారు మాటల మధ్య అంది. ఆ మాటలు గుర్తొచ్చి, నాకు భయం వేస్తున్నా ధైర్యం చిక్కబట్టు కొని ఆ చీకటిలో నడుస్తున్నాను. అయినా సరైన దారా ఏమన్నానా? కనీసం మరో అరమైలన్నా వెళ్తే గానీ నేను ఎప్పుడూ కూచుని అతని కోసం ఎదురు చూసే రాయి రానేరాదు. చేతిలోని కర్రముక్కను ఆసరా చేసుకొని ఊపుతూ వెళ్లిపోతున్నాను.

**చీకటి పడింది. అబ్రహం కోసం ఎదురుచూస్తూ, ఆకాశంలో చుక్కలు లెక్కబెడుతూ ఎప్పుడూ కూర్చునే రాయిమీదకెక్కి నిలబడిందామె. అబ్రహం అని గట్టిగా అరుస్తోంది. భలే సరదాగా ఉందామెకు. తన గొంతు తనకే చిత్రంగా అనిపించింది. ఇంతలో దూరంగా అబ్రహం వస్తూ కనిపించాడు. అసలు అబ్రహం ఎక్కడికి వెళ్ళాడు? ఏ పనిమీద వెళ్ళాడు?**

ఎలాగయితేనేం.. చుక్కల వెలుగుకి నా కళ్లు అల వాటు పడిన రాయి దగ్గరకి త్వరగానే చేరుకున్నాను. 'అబ్రహం' అని గట్టిగా పిలవబోయాను. చలి భయం వల్ల కాబోలు గొంతు పెగల్లేదు. మళ్ళీ ప్రయత్నిం చాను. ఈ మారు కొంచెం ఫరవాలేదు. అయితే దారీ తెన్నూ లేని ఈ మైదానంలో ఒక వైపే అరుస్తూ పిల వడం బాగా లేదని రెండు మూడు వైపులా ముఖం తిప్పుతూ అరుస్తున్నాను. దూర దూరంగా ఆ మైదా నంలో ఉన్న ఇళ్లల్లో ఒకటి రెండు చోట్ల దీపాల వెలుగు కనిపిస్తోంది మిణుకు మిణుకుమంటూ.

నా ప్రయత్నం నేను మానలేదు.

నా కోర్కెను ఆ దేవతలు గుర్తించినట్టు సడెన్‌గా అబ్రహం గడ్డిమైదానంలోంచి గడ్డి పొరలను తప్పిం చుకుంటూ పరిగెత్తుతూ వస్తున్నాడు. అయితే అది మరో డైరెక్షన్‌లో.

దయ్యం కాదు కదా! భయపడ్డాను.

బాగా దగ్గరకొచ్చాడు.

నవ్వాడు.

ఆ నవ్వు నాకు గుర్తే! 'హమ్మయ్య' అనుకున్నాను.

నా అరుపులు విని చాలా దూరం నుండి పరిగె త్తుకొని వచ్చాడు కాబోలు... రొప్పుతున్నాడు. కొంచెం సర్దుకొని నా చేతుల్లో పెద్ద బ్రెడ్‌ని పెట్టి మరో చేయి నా భుజం మీద వేశాడు.

గొప్ప థ్రిల్‌గా అనిపించింది.

ఆ చలిలో అతని వేడినిట్టూర్పులు, మాటలు, గబుక్కున నవ్వడం భలేగా ఉంది ఆ సన్నివేశం.

నేను రాయి మీంచి లేచాను.

అతడు కూర్చుండిపోయాడు నవ్వుతూ. ఎలాగో నవ్వు ఆపుకుంటూ జేబు మీద చేయి వేసుకుంటూ క్షణం తరువాత అన్నాడు. "ఈరోజు నా జీతం ఇచ్చాడు మా బాస్ అండర్సన్" అన్నాడు.

"మంచిది" అన్నాను మెల్లిగా, చేతిలోని బ్రెడ్‌ను ఇంకా గట్టిగా పట్టుకొని.

"నీవు ఇంటికి వెళ్లగానే కాఫీ చెయ్యి. ఈ బ్రెడ్‌తో తాగుదాం" అన్నాడు.

నాకింకా సంతోషం కలిగింది.

## అదే కలం




ఆ కలం
కవి సమయంలో
కావ్యాన్ని సృజిస్తుంది
రసహృదయాలను మీటి
అణువణువులో
హృదయోల్లాసాలను జనియిస్తుంది
బుద్ధి వికాసాలకు మెరుగులద్ది
జ్ఞానవృక్షమై ఎదుగుతుంది
మనిషిలో
మానవతను మేల్కొలిపి
రహదారిలో నడిపిస్తుంది



మేలు సమాజానికి
మైలురాయిలా నిలుస్తుంది

అదే కలం
వాణిజ్య విపణిలో
లాభాలు లెక్కిస్తుంది
ఒప్పందాలపై సంతకమౌతుంది
చివరకు తేడాలొస్తే
ప్రాణాంతకమౌతుంది
మారణహోమమై
మానవత్వాన్ని మంటగలుపుతుంది

ఒకే కలం
రెండు పార్శ్వాలు
మానవత్వానికి
దానవత్వానికి !

**నూనెల శ్రీనివాసరావు**
**సెల్ : 9492970231**

ఇంటికి బయలుదేరాం. గబగబా అడుగులు వేస్తున్నా చేరుకోలేకపోతున్నాం ఏమిటీ? ఇల్లు ఇంత దూరంగా ఉందా? అదంతా నా అనుమానం. ముస లామె బయట వెలిగించి పెట్టిన దీపం మిణుకు మిణుకుమని కనిపిస్తోంది.

జీతం మొత్తం 75 డాలర్లు.

మూడు కుటుంబాలు ఆ డబ్బులతో బతకాలి. అంటే చిన్నా పెద్దా కలిపి తొమ్మిది మంది. ధరలు నిల కడగా ఉన్నాయి కాబట్టి ఫరవాలేదు. 90 సెంట్లకు వంద పైనుల పిండి వస్తుంది. ఇంకా బొగ్గు, కిరసనాయిలు, వెన్న కొనాలి. మిగిలిన ఖర్చులు మామూలే!

ఇంటికి చేరుకున్నాం.

అబ్రహం కోరినట్టే కాఫీ తయారు చేశాను. రొట్టెతో కాఫీ తాగుతూ అన్నాడు. "మనం త్వరలో పెళ్ళి చేసుకోవాలి."

నేను నవ్వుతూ అతని వేపు చూశాను.

కనీసం నన్ను పెళ్ళి చేసుకోవాలని అతను గుర్తు పెట్టుకున్నందుకు మరోసారి నాలో నేనే నవ్వాను. చివరకు అతను చెప్పిన తేదీ నవంబర్ 8. "అంటే దగ్గరలోనే ఉందన్నమాట" అన్నాను. నవ్వాడు ఏదో నిశ్చయానికి వచ్చినవాడిలా. (అది 1894వ సంవత్సరం. శుక్రవారం వచ్చింది. శుక్రవారం యూదులకు పవిత్రమైన సబ్బత్ రోజు) నేను తల ఊపుతూ అన్నాను "మనం ముందు నుయ్యి తవ్వు కోవాలి."

అవును. అది ఎప్పటినుంచో వస్తున్న ఆలోచన. అంతవరకూ అక్కడక్కడ ఉన్న నీటి గుంతల్లో ఉన్న నీటిని చుట్టూ పెరిగి ఉన్న గడ్డిని నరికి చిన్నగా దారి చేసుకొని జారిపడకుండా రాతిపలకలు అడ్డం పెట్టి రేకుల డబ్బాలతో నీరు తోడి ఇంటికి తెచ్చి బయట ఉన్న గాబుల్లో నింపుతున్నారు. ఈ గుంత ఎండి పోతే మరో గుంతకు పోవడం తప్ప మరోదారి లేదు. అదైనా ఎనిమిది లేక పది మైళ్ళు పోవాలి. పట్టి తెచ్చిన నీరన్నా శుభ్రంగా ఉంటుందా అంటే అదీ లేదు. దాని నిండా పురుగులు, ధూళి, గడ్డి. ఆ నీటిని ముందు వడకట్టి, మరగపెట్టి దాచుకొని వాడవలసి వస్తోంది. ఇక వేసవిలో నీళ్లు అడుగుకి పోవడం లేక ఎండిపోవడం, తిరిగి నీటి కోసం వెతుకులాట. కాబట్టి లోతుగా మన ఇంటి దగ్గర్లోనే తవ్వించుకుంటే బాగుంటుంది."

"మంచిదే గానీ ఇది మీ అన్నగారింటికీ, అమ్మానాన్నగారూ ఉన్న ఇంటికీ అందరికీ అందు బాటులో ఉండేట్టు తవ్విస్తే బాగుంటుంది" అన్నాను.

"అవునవును. దీనికి ఖర్చు ఎంతవుతుందో, ఏ స్థలంలో తవ్వితే బాగుంటుందో ఆలోచించాలి" అన్నాడు.

ఆలోచనలు ఉన్నా అవి ఖర్చుతో కూడినవి కాబట్టి వెనక్కి వెళతాయి. ఇదీ అలాగే జరుగుతుం దేమోనని అనుకున్నాను. అలాగే జరిగింది.

అబ్రహంతో నా పెళ్ళి అతను నిర్ణయించిన తేదీ కన్నా ఆరు వారాలు ముందే జరగవలసి వచ్చింది. దానికి కారణం అప్పటి అమెరికన్ ప్రభుత్వం ప్రకటించిన 'లా'. గవర్నమెంటు నుండి భూమి కొనుక్కున్న వ్యక్తి ఐదు సంవత్సరాలు పూర్తి కాగానే దాన్ని సాగులోకి తెచ్చానని, అందువల్ల తన వశం కావాలని అర్జీ పెట్టుకుంటాడు. దాని ప్రకారం ప్రభుత్వం వారు పరిశీలించి అతడికి ఆ భూమిని రిజిస్టర్ చేస్తూ అతడు వివాహితుడు అయి ఉంటే, ఆమె పేరూ ఆ పక్కన చేరుస్తారు. దాని వలన ముందు ముందు ఏ ఇబ్బందులూ ఉండవు. అందువల్ల అబ్రహం ఈ ఆలోచన చేసి ముందుగానే పెళ్ళి నిశ్చయం చేసుకున్నాడు.



## తాప్సీకి మత్తు దిగిందట!

కాలు జారినా తీసుకోవచ్చు కానీ, కొన్ని సార్లు మాట జారితే తీసుకోవడం కష్టం. తాప్సీ విషయంలో ఇప్పుడు అదే జరుగుతోంది. బాలీవుడ్ మత్తులో పడి దక్షిణాది పరిశ్ర మను పురుగును చూసినట్టు చూసింది. అక్కడ అసలు విషయం బోధపడేసరికి ఎక్కిన మత్తు కాస్త దిగి గోడకు కొట్టిన బంతిలాగా తిరిగి దక్షిణాదికి వచ్చేసింది. బాలీవు డ్‌కి వెళ్ళిన కొత్తల్లో దక్షిణాదిన సినిమాలు చేసే అవ కాశం దాదాపు లేదన్నట్టుగానే స్టేట్‌మెంట్లు ఇచ్చింది. బాలీవుడ్‌లో వాతావరణం ఎంత బాగుంటుందో, హీరో యిన్లకు ఎంత ప్రాముఖ్యత ఇస్తారో ప్రెస్‌మీట్లు పెట్టి మరీ చెప్పింది. ఇప్పుడు ఎక్కిన మత్తు దిగి వాస్తవాలు కళ్ళ ముందు కనిపించేసరికి దక్షిణాది గుర్తుకొచ్చి, అర్జంటుగా ఇక్కడ ఓ సినిమాకి సైన్ చేసేసింది అంటున్నారు సినీ జనాలు. మాట్లాడేప్పుడు తరువాత పర్యవసనాలు ఊహించకుండా మాట జారితే పరి ణామాలు ఇలాగే ఉంటాయి అంటున్నారు.

చివరకు ఎలాగైతేనేం మా పెళ్ళి రోజు రానే వచ్చింది. ఇక నేను పెళ్ళికూతురిగా ముస్తాబు కావాలి. సంతోషమే! ఈ పెళ్లికోసమే కదా ఏ ఆడ పిల్లయినా తీపి తీపి కలలు కనేది. అందులోనూ నాలాంటి పేదపిల్ల. అందుకనే ఇన్ని దేశాలు అట్లాం టిక్ సముద్రం సైతం దాటి వచ్చానే! ఓ పక్క ఆనం దంగా ఉన్నా మరో పక్క విపరీతమైన దుఃఖంగా ఉంది. అబ్రహం తన బంధువులెంతమందిని ఆహ్వా నించాలో వాళ్ళమ్మతో ఆలోచిస్తోంటే నా తరపు వారెవరూ లేరు కదా! నా చిన్ని తమ్ముడు, నా అక్క, అన్నయ్య ఏమయ్యారో? కళ్లముందు కనిపి స్తోంటే దుఃఖం పొంగిపొర్లింది. చాటుగా కన్నీరు తుడుచుకోవటమే నాకున్న శక్తి ఆ క్షణంలో.

"ఈ పెళ్ళి మా ఇంట్లో చెయ్యండి. ఇల్లు విశా లంగా ఉంది. హాలు, రెండు పెద్ద గదులూ ఉన్నాయి. పైగా మన మిత్రులు, బంధువులు రావ డానికి మా ఇల్లు దగ్గరగానూ ఉంది" అని అబ్రహం మేనకోడలు దోబా అన్నది. దానికి అందరూ అంగీకరించారు.

పెళ్ళి తంతు మొదలయ్యింది.

మా యూదు సాంప్రదాయం ప్రకారం పెళ్ళి కొడుకును చెయ్యడం, పెళ్ళికూతుర్ని చెయ్యడమూ ఉంటాయి. అయితే ఆరోజు మొత్తం ఈ నూతన వధూవరులు ఉపవాసం ఉండాలి. (దాన్ని యామ్ కిపుర్) అంటారు. ఆరోజు పెద్దల్ని తలచుకొని ప్రార్థన చేయాలి. వారు వీరి జీవితాల్ని సుఖప్రదం చేస్తారని, అలా ఆశీర్వదిస్తారని నమ్మకం.

ఆరోజు ప్రార్థనతో నా దుఃఖానికి అంతేలేదు. చనిపోయిన నా తల్లీ, ఎటో పరారైన తండ్రీ, ఉండీ దూరమైన తోబుట్టువులూ గుర్తొచ్చారు. నా పెళ్ళి గౌను నేనే తయారుచేసుకున్నాను పసుపు, నీలం గీతలున్న బట్ట తెచ్చుకుని. అబ్రహం సూటు బాగానే ఉంది గానీ దానికేవో నడుము దగ్గర తోక ల్లాంటివి ఉన్నాయి. అది కొత్త ఫ్యాషనట. ఇల్లంతా మిత్రులతో, బంధువులతో నిండిపోయింది. అబ్రహం మేనకోడళ్లు దోబా, సారా వారి వారి భర్తలూ, పిల్లలతో ఒకటే సందడి. అబ్రహం అన్న గారు ఛార్లీ, వదిన ఫాగా మాకు వివాహ బహుమ తులుగా నీలం పువ్వులు అద్దిన ఎర్రని టేబుల్ క్లాత్, రెండు కోడిపెట్టలను ఇచ్చారు.

ఇప్పుడు మా పెళ్ళి జరిగిన తేదీ నవంబర్ 8 –1894, శుక్రవారం నాడు జరిగిందని చెప్పాను కదా! అయితే ఆరోజు శుక్రవారం కావడం వల్ల, అతి పవిత్రమైన రోజు కావడం వల్ల మతపెద్ద ఈ తంతు అంతా సూర్యాస్తమయానికి ముందే జరిగి పోవాలన్నాడు. సూర్యాస్తమయం అయితే సబ్బత్ పవిత్ర దీపం వెలిగించాలి. అప్పుడు ఎటువంటి తంతులూ జరపకూడదు. ఈ కలోఫ్ కుటుంబం ఈ రకమయిన సాంప్రదాయ ఆచారాలు పాటిస్తు న్నట్టుంది. అందరూ అలాగే అన్నారు. నేను

నూతన వస్త్రాలు కట్టుకుని కూచున్నాను. మతపెద్ద (బెంజిమన్ గ్రీన్‌బెర్గ్) వచ్చాడు. ఆయన ఈ నార్త్ డకోటాలో ఇలాంటి శుభకార్యాలు చేయిస్తాడట. ఆయనొక రైతు, మతపెద్ద, తగవుల తీర్పరి. జీవితంలో పెళ్ళి వేడుకన్నది ఎవరికైనా గుర్తుండే వేడుక కావచ్చు. నాకైతే మరిచిపోలేని వేడుక! నన్ను హాలులో ఉన్న కుర్చీలో కూచోమన్నాడు ఆ మతపెద్ద. ఉపవాసం ఉన్నానేమో నీరసంగా అలాగే ఆయన చూపించిన కుర్చీలో కూచున్నాను. కింద పిండి పోసి దాని మీద పెద్దది, తెలుపు రంగులో ఉన్న చేతి రుమాలు పరిచి అబ్రహంను దానిపై కూచోమన్నాడు. అబ్రహం అలాగే కూచున్నాడు. నా చేతిలో ఒక ఖాళీ గిన్నె ఉంచి, మరో గిన్నెలో పిండిపోసి అబ్రహం చేతిలో ఉంచి నా వేపే చూస్తూ ఉండమని చెప్పాడు. అబ్రహం అలాగే చేస్తున్నాడు. పురోహితుడు మంత్రాలు వంటి ఆశీర్వచనాలు చదువుతూ అతని చేతిలో ఉన్న పిండిని నా చేతిలో ఉన్న ఖాళీ గిన్నెలో పోయించాడు. పెద్ద షాల్‌కు నాలుగు పక్కలా చిన్న చిన్న ముడులు వేసి వాటికి కర్రపుల్లలు గుచ్చి దాన్ని చేత్తో ఎత్తి పట్టుకొని దోబా, ఆమె భర్త నాపై గొడుగులా పట్టారు. (దీన్ని 'హుప్పాప్' అంటారు) పురోహితుడు మంత్రాలు చదవడం ఆపాడు.




అబ్రహం నా వైపు అలాగే చూస్తున్నాడు. నేనూ ఆయన వైపు చూస్తున్నాను.

మా చేతుల్లోని గిన్నెలు పురోహితుడు తీసుకొని "మీ ఇద్దరికీ పెళ్ళి అయిపోయింది. ఓ గూటి కిందకు చేరారని" ప్రకటించాడు. చుట్టూ చేరిన బంధువులూ, స్నేహితులూ ఈ వేడుకంతా నవ్వులతోనూ, కబుర్లతోనూ చూస్తున్నారు. వీరు పురోహితుని ప్రకటన వినగానే మగవారంతా టేబుల్ వేపు పరుగెత్తి అక్కడుంచిన పళ్లేలను కర్రపుల్లలతోనూ, చెమ్చాలతోనూ బాజాలుగా మోగిస్తోంటే, ఆడవారు నృత్యం చేస్తూ పాటలు పాడడం మొదలుపెట్టారు. మళ్లీ నవ్వులూ, జోకులూ.

ఈ తంతు చాలా సేపటి తరువాత ముగిసింది. అయితే చివరిలో మరో తంతు ఉంది. అంతవరకూ పిండి మీద తెల్లని రుమాలు పరుచుకు కూచున్న అబ్రహం దాని మీద నుండి లేవగానే స్త్రీలు, ముఖ్యంగా మా అత్తగారు దాన్ని తీసుకు వచ్చి, నా మెడను కొంచెం వంచి నా కళ్ళ మీద కప్పారు. ముఖమంతా పిండి పడింది. చుట్టూ చేరిన అమ్మలక్కలు నవ్వారు. ఇదేం ఆచారంరా బాబూ! అని విసుక్కుంటూ దాన్ని నా ముఖం మీద నుండి గబుక్కున తొలగించబోయాను. మా అత్తగారు కసురుకుంది. దానివల్ల భవిష్యత్తులో నాకే మంచిదనీ, చీడపీడలవంటివి దరిచేరవనీ, కొద్దిసేపు అలాగే ఉంచాలనీ చెప్పింది. "తప్పుతుందా?" అలాగే కాసేపు గడిపాను. అమ్మలక్కలు దాన్ని తొలగించి నా ఒడిలో పెట్టారు. అది జీవితకాలం నాతో ఉండవలసిన పవిత్రమైన వస్త్రమట! దానివల్ల నాకు శుభం కలుగుతుంది. మడత పెట్టి ఒడిలో భద్రంగా దాచాను.

ఇక విందు భోజనాలు...అట్టహాసంగా ఉండాలని మా అత్తగారి కోరిక.

ఉడికించిన గింజలతో చికెన్ సూపు, శనగగింజలతో కలిపి వండిన బార్లీ అన్నం, వేయించిన కోడి మాంసం. వచ్చిన అతిథులూ, బంధువులూ మా అత్తగారి చుట్టూ చేరి తెగ మెచ్చుకున్నారు. ఎందుకంటే ఆవిడే దగ్గరుండి వండించింది కాబట్టి. ఆవిడ చాలా పొంగిపోయింది.

ఇక్కడితో నేను కలలుకన్న పెళ్ళి అయిపోయింది. పేదపిల్లకు తగిన వరుడితో పెళ్ళి కావడం గొప్ప విషయమే. నా ఇంటిపేరు 'కలోఫ్'గా మారిపోయింది. అది మా అత్తగారి ఇంటిపేరు. అబ్రహం కట్టించిన చిన్న ఇంటిలో కాపురం పెట్టాం. అయితే అది నాలుగు లేక ఐదు నెలలు మాత్రమే! "చలికాలం వస్తోంది. మనం అమ్మానాన్న, తమ్ముడు ఉన్న పాత ఇంటికి మారిపోదాం" అన్నాడొక రోజు అబ్రహం.

నాకది నచ్చలేదు. మొదట "మన సంసారం మనది. అక్కడ మాత్రం ఎక్కడ పడుకుంటాం. ప్రైవసీ లేదు కదా" అన్నాను. అనడమే కాదు కొంచెం గట్టిగానే వాదించాను. కానీ అబ్రహం అంతా వివరంగా చెప్పేసరికి అతను చెప్పిందే బాగుందనిపించింది. ఇంటి ఖర్చులు తగ్గుతాయి. పైగా నేను వంటచేయడంలో బద్ధకిస్తే వంట సిద్ధం చేస్తుంది. అబ్రహం మా అత్తగారింటిలోనే కొత్తగా మరో రెండు గదులు వేయించాడు. నేల ఎత్తుగా వేయించి రాయి పరిపించాడు. ఇల్లు విశాలంగా, చలికాలంలో కాస్త వెచ్చగాఉండేటట్టు కనిపిస్తోంది. మరో వారం రోజుల్లో మేం మామూలుగా ఆ ఇంటికి మారిపోయాం. అంతే కాదు రాత్రి పూట నిద్రపోవడానికి గానూ, వండిన పదార్థాలు పెట్టుకోడానికి మరో నాలుగు చెక్క బల్లలు కొన్నాడు. వంటింట్లో గోడలకు మేకులు కొట్టి వంటసామాను పెట్టుకునేందుకు చిన్న చిన్న బల్లలతో ఏర్పాటు చేశాం.

మా భార్యాభర్తలకు, మా అత్తగారికీ, మావగారికీ రాత్రిపూట పడుకోవడానికి ఏవేవో బల్లలు అమిరాయి గానీ మరిది మోసెస్‌కి రాత్రిపూట పడుకోవడానికి ఇంకా ఎండుగడ్డే గతి అవుతోంది. మా అత్తగారిది బాగా ముందుచూపు కాబోలు పట్టుపట్టి కోడిపిల్లల్ని చేయించింది. అవి తల్లి వెనక గునగునలాడుతూ ఇంటిచుట్టూ తిరగడం మొదలెట్టాయి. నేనొక రోజు వాటినే చూస్తుంటే "గట్టిగా నాలుగు రోజులు కళ్ళు మూసుకుంటే ఈ పిల్లలే పెద్దవి అవుతాయి. చలికాలంలో కోసుకు తినవచ్చునంది. అయితే వాటిని పెంచడంలో అప్పుడే ఇబ్బంది మొదలయ్యింది. తిండి విషయంలో కాదు. రాత్రి పూట దాచడంలోనే...

బయట పశువుల గదుల్లో వీటిని ఉంచాలంటే ఆ స్థలం సరిపోదు. తొక్కి చంపుతాయేమోనన్న భయం. పోనీ ఇంటి గోడ పక్కన రేకులతో చిన్న డబ్బా వంటిది కట్టి అందులో ఉంచుదామంటే నక్కలు, తోడేళ్ళ వల్ల భయం లేదు గానీ, ఈ ప్రాంతంలో ఏ క్షణమైనా చలి జీరో పాయింట్‌కి చేరుకోవచ్చు. చెప్పలేం. ఆ చలికి ఇవి చనిపోయి గడ్డకట్టి రాళ్లయిపోతాయి.

దీనికి మా అత్తగారే మార్గం కనుక్కుంది. మేము ఎలాగూ చెక్క బల్లల మీద బొంతలు వేసుకుని నిద్రపోతున్నాం. ఆ బొంతల్నే కింద వరకూ అంటే నేలను తాకే వరకూ వేసి, నేల మీద చక్కగా ఎండుగడ్డి పరిస్తే వెచ్చగా చిన్న గదుల్లా ఉంటాయి కాబట్టి అవి సుఖంగా నిద్రపోతాయి అంటుంది ఆమె.

బాగానే ఉంది. కానీ తెల్లవార్లూ అవి చేసే చప్పుడు, రెట్ట వాసనో? రెండు రోజులు అలాగే చేసి చూశాం. అందరం బాగానే నిద్రపోయాం గానీ, పక్కన ఆ ఎండుగడ్డిలో పడుకున్న మా మరిది మోసెస్ నిద్ర పట్టలేదని గొడవ చేసేవాడు. చివరకు వాటికీ తెలిసిపోయింది కాబోలు మా అవస్థ గమనించి నిశ్శబ్దంగా పడుకునేవి.

గమనించాలే గానీ చుట్టూ ఉన్న వ్యతిరేక వాతావరణాన్ని మనిషి తనకు అనుకూలంగా మలచుకుంటాడు కాబోలు. పగలు మైదానంలో ఎండుగడ్డి నరుక్కు వచ్చి, మంటపెట్టి, వీలయినంత వరకూ ఇంటిని వెచ్చగా ఉంచేవాళ్లం.

**(ఇంకా వుంది)**




## ఒకరోజు ప్రధాని!




ఒకే ఒక్కడు సినిమాలో హీరో ఒకరోజు ముఖ్యమంత్రిగా పనిచేస్తాడు. ఇప్పుడు బెల్లా అనే ఐదేళ్ళ పాపకూడా కెనడా దేశానికి ఒకరోజు ప్రధానిగా వ్యవహరించబోతోంది. ఆశ్చర్య పోకండి. అసలు సంగతేంటంటే...కెనడాకు చెందిన సీబీసీ కిడ్స్ ఎడ్యుకేషనల్ ప్రోగ్రామ్‌లో భాగంగా ఇటీవల ఓ పోటీ నిర్వహించారు. 'పీఎం ఫర్ ఏ డే(ఒకరోజు ప్రధాని)' పేరుతో జరిపిన ఈ పోటీలో థంప్సన్‌కు చెందిన ఐదేళ్ల చిట్టితల్లి బెల్లాను విజయం వరించింది. 'ఒక ప్రధానిగా.. ప్రతి ఒక్కరికీ ఇల్లు ఉండేలా, అందరూ సురక్షితంగా ఉండేలా చూస్తాను. ప్రతి ఒక్కరినీ నేను ఆప్యాయంగా ఆలింగనం చేసుకుంటాను. మన చుట్టూ ఉండే జంతువులు, ప్రపంచం క్షేమంగా ఉండేలా పనిచేస్తాను. ప్రతి కెనడియన్ ఆరోగ్యంగా ఉండేలా చూస్తాను' అని చెప్పి ఒకరోజు ప్రధానిగా ఎంపికైంది బుడత.

## గుహావాసాలు

ఇప్పుడైతే పెద్దపెద్ద మేడలు, మిద్దెలు కనబడుతున్నాయి గానీ ఒకప్పుడు మనిషి జీవితం ప్రారంభ మైంది గుహల్లోనే కదా! అయితే ఇప్పటికీ కొన్ని ప్రాంతాల్లో ప్రజలు గుహల్లోనే నివసిస్తు న్నారు. సహజసిద్ధంగా ఏర్పడిన గుహల్లో ఉండే మాట అటుంచి, కృత్రిమంగా గుహలు తొలిచి మరీ అందులో నివసించేవారు ఉన్నారు.

దక్షిణ ట్యునీషియాలోని మట్‌మటాలో ఎండనుంచి రక్షణకు గుహావాసాలు నిర్మించుకు న్నారు. ఈ గుహల ఏర్పాటుకు ముందుగా



పెద్ద బావిలాంటి గొయ్యితవ్వి, దాని లోపలి నుంచి చుట్టూ సొరంగంలా తవ్వి తమకు నచ్చి నట్టు ఇళ్ళు ఏర్పాటు చేసుకుంటారు. అందులోనే పెరడు ఏర్పాటు చేసుకుని చెట్లు కూడా పెంచు తారు. ఈ నివాసాలు నిన్నామొన్నా ఏర్పడినవి కావు. వీటికి వేల సంవత్సరాల చరిత్ర ఉంది. ఈ గుహావాసాలు పర్యాటకులను ఎంత గానో ఆకట్టుకుంటున్నాయి. దాంతో అక్కడి ప్రజలకు జీవనోపాధి కూడా దొరుకుతోంది.

## ప్రేమ గుడ్డిదంటే ఇదే కాబోలు

ఐఫోన్‌తో పెళ్ళి, చెట్టుతో వివాహం... ఇలా ఎన్నో వెరైటీ పెళ్ళిళ్ళు అక్కడక్కడా జరుగుతూనే ఉన్నాయి. అలాంటి మరో వెరైటీ వింత పెళ్ళి కాలిఫోర్నియాలో జరిగింది. ఓ వనితా మణి ఏకంగా రైల్వేస్టేషన్‌నే పెళ్ళి చేసుకుంది.

కాలిఫోర్నియాకు చెందిన కరోల్ శాంటా ఫే చేసిన ఘనకార్యమిది. 45 సంవత్సరాల ఈ మహిళామణి తన తొమ్మిదేళ్ళ వయసునుంచీ ఈ రైల్వే స్టేషన్‌పై ఇష్టం పెంచుకుందట. ఆ ఇష్టం క్రమంగా ప్రేమగా మారిందం టోంది. ప్రతిరోజూ కాలిఫోర్నియానుంచి 45 నిమిషాలు బస్సులో ప్రయా ణంచేసి, ఈ స్టేషన్‌కి వచ్చి, స్టేషన్ గోడలతో కాసేపు ఊసులాడుతుం దట. ముద్దుముచ్చట్లతో చక్కగా కాలక్షేపంచేసి తిరిగి వెళుతుందట. పెళ్ళి చేసుకోవటంతో మాత్రమే ఈ తతంగం పూర్తైపోయిందనుకుంటే పొరపాటే, మానసికంగా ఆ రైల్వే స్టేషన్‌తో సెక్స్ కూడా చేస్తుందట సదరు మహిళామణి! అంతేకాదు, ఈ రైల్వేస్టేషన్ పేరుని తన పేరుకు జతచేసుకుంది. దాంతో కరోల్ అనే పేరు కాస్తా కరోల్ శాంటాఫేగా మారిపోయింది. ఇంతకూ ఈ ఉదం తాన్ని, 'ప్రేమ గుడ్డిది' అనాలా? 'వెర్రి వేయి విధాలు' అనాలా? 'పిచ్చి కుదిరినవాడి తలకి రోకలి చుట్టడం' అనాలో మీరే చెప్పండి!

## రియల్ ట్రాన్స్‌ఫార్మర్

రోడ్డుమీద పరుగులుపెట్టే కారు ముందుటైర్లు ఉన్నట్లుండి నెమ్మదిగా పక్కకి జరుగుతాయి. ఆ తరువాత నెమ్మదిగా పైకి లేస్తాయి. కారు బానెట్ కూడా నెమ్మదిగా పైకి లేస్తుంది. ఏంటీ ట్రాన్స్‌ఫార్మర్ సినిమా గురించి చెబుతున్నారు అనుకుంటున్నారు కదూ. కాదండీ...రియల్‌లైఫ్‌లో రియల్‌గా తయారుచేసిన ట్రాన్స్‌ఫా ర్మర్! మరి ఇలాంటి క్రేజీ ట్రాన్సఫార్మర్‌ని తయారుచేసింది ఎవరో తెలుసా? గెన్నెడీ కోచెర్గా, సర్జీ కోచెర్గా. రష్యాకు చెందిన ఈ తండ్రీకొడుకులు ఆర్నెల్లు కష్టపడి, పాత లాడాకారును ట్రాన్స్‌ఫార్మర్‌గా



మార్చారు. ఆర్యోల్ స్టంట్ షోలో ఈ ట్రాన్స్‌ఫార్మర్‌ను ప్రదర్శించారు. ట్రాన్స్‌ఫార్మర్స్ సినిమాలో ఏలియన్ రోబోలు తమ రూపం ఎలా మార్చుకుంటాయో అచ్చు అలాగే చేస్తుంది ఈ కారు కూడా! అంతేకాదు ఇది షూట్ చేస్తుంది కూడా! దీనికితోడుగా మరో రెండు ట్రాన్స్‌ఫార్మర్లను తయారుచేయ డానికి సమాయత్తమవుతు న్నారు ఈ తండ్రీకొడు కులు.

## వాటికోసమే ప్రత్యేకంగా...

చిన్నపిల్లలు మారాం చేస్తుంటే ఐస్ క్రీమ్ కొనిస్తారు తల్లిదండ్రులు. పిల్లలకేకాదు పెద్దలకి కూడా ఐస్‌క్రీం చూస్తే నోరూరాల్సిందే! మీరు ఐస్‌క్రీం తింటుంటే 'మీకేనా ఐస్‌క్రీమ్‌లు... మాకొద్దా?' అంటూ నాలుక బయటపెట్టి మీవంకే చూస్తుంటాయి మీ పెంపుడు శునకాలు. సరిగ్గా ఈ ఆలోచననే బిజినెస్‌గా మార్చుకుంది ఓ కంపెనీ. ఎంచక్కా శునకాల కోసమే ప్రత్యేకంగా ఐస్‌క్రీమ్‌లు తయారుచేసి అందిస్తోంది మెక్సికోలోని డాన్ పాలెట్టో ఐస్‌క్రీమ్ పార్లర్!



దాంతో ఈ ఐస్‌క్రీమ్ పార్లర్ దగ్గర డాగ్‌లవర్స్ తమ పెంపుడు శునకాలతో క్యూ కడు తున్నారు. వాటి కోసం ప్రత్యేకంగా ఫ్రోజెన్ కోన్‌లు, లాలీపాప్ ట్రీట్స్ అందిస్తోంది పార్లర్. మామూ లుగా సాధారణ ఐస్‌క్రీమ్‌వల్ల జంతువుల్లో డయేరియా ఇతరత్రా సమస్యలు వస్తాయి. కానీ ఈ స్పెషల్ ఐస్‌క్రీమ్ వల్ల జీర్ణక్రియ సక్రమంగా ఉంటుందని, ఎటువంటి సమస్యలురావని పార్లర్ నిర్వాహకులు చెబుతున్నారు. భలే భలే! కుక్కలకూ ఓ ఐస్‌క్రీం పార్లర్.

# కొత్త చిగురు

-డా.నీరజ అమరవాది

**ఏమే మంగా! ఎక్కడికి హడావిడిగా వెళ్తున్నావు?**

**ఈరోజు శ్రీరామనవమి కదా! వేణుగోపాలుని కోవెలకి వెళ్తున్నానమ్మగారు.**

**రామనవమికి రామాలయానికి కదా వెళ్ళాలి.**

**రాములోరిగుడి సానాదూరం. నాకు మీ ఇంట్లో పని, నా ఇంట్లో పని చాలా ఉంది. కృష్ణుడు, రాముడు పేర్లు వేరైనా భగవంతుడు ఒకడే, బొమ్మలే వేరు అంటూ మంగ వెళ్ళిపోయింది.**

**కస్తూరొదినా నీ అమెరికా ప్రయాణం ఎంతవరకు వచ్చింది? అంటూ వచ్చింది కావేరి.**



నీకు తెలియంది ఏవుంది కావేరీ! తప్పక వెళ్తున్నానుగానీ, నాకు వెళ్ళటం ఇష్టంలేందే!

ఆ....అన్నీ పైపై మాటలే మనవడు పిలుస్తుంటే వెళ్ళకుండా ఎలా ఉంటావు?

అవునే కావేరీ! మొన్న కోడలు 'ఫోన్' చేసి రండి అత్తయ్యగారు అని పిలిచింది. మీరే రావచ్చుకదా అంటే.. మేము వస్తే 'నెల'కన్నా ఎక్కువ ఉండలేం. మీరు వస్తే ఐదారు నెలలు మాతో, మీ మనవడితో కలిసి ఉండొచ్చు అంది. నా మనవడితో ఆడుకోవాలనే నా మనసు చెప్పినమాట కాదనలేక బయలు దేరుతున్నాను.



అంతలో అక్కడికి వచ్చిన మంగ, రఘుబాబుగారు పిలిస్తే ఇన్నిరోజులు వెళ్ళ లేదు. కోడలమ్మ గారు రమ్మనగానే బయలు దేరుతున్నారు. కూతు రైనా, కోడలైనా 'రమ్యమ్మ' గారే కదా! మీకు అంటూ పనిలో పడింది.

అమ్మగారూ! అంటూ పిలిచాడు రామాచారి.

రామాచారీ రా!

ఇదిగోండి మనవడిగారి కోసం మీరు చేయమన్న పులిగోరు గొలుసు, కడియాలు, ఉంగరాలు లెక్క చూసుకోండి.

నువ్వు చెప్పిందే లెక్క. డబ్బులు తెస్తానంటూ లోపలికి వెళ్ళింది.

మనవడికి ఏడువారాల నగలు చేయించినట్లుందే మా కస్తూరి అంటూ మనోరమ లోపలికి వచ్చింది.

స్నేహితురాలిని చూడగానే కస్తూరికి ప్రాణం లేచొచ్చినట్లయింది. నీలాగా నాకు ఈ ప్రయాణాలు అలవాటులేవు. బరువు ప్రకారం పెట్టెలు సర్దుకోవటమెలాగో తెలియదు నీలాగా.

రాత్రికి కదా! నీ ప్రయాణం... గంటలో సర్దుతాను అంటూ సరంజామా సర్దే పనిలో పడింది మనోరమ.

కస్తూరి ఏకైక సంతానం రఘు. పై చదువులకోసం ఉన్న ఊరు, మంచి ఉద్యోగం అంటూ దేశం విడిచిపెట్టాడు. నాలుగేళ్ళక్రితం తండ్రి లక్ష్మణ రావుకి ఆరోగ్యం బాలేదని రఘు వచ్చినప్పుడే వివాహం చేసి పంపారు. లక్ష్మణరావుగారు కాలం చేసిన తర్వాత కస్తూరి ఒక్కతే మిగిలింది ఆ ఇంట్లో. ఆస్తిపాస్తులకి కొదవలేదు. నా అన్నవాళ్ళు దగ్గర లేరనే బాధ తప్పితే, డబ్బుతో కొనలేని ఆప్యాయతకి కరువు లేదు. అమెరికా నుండి కొడుకు ఎప్పుడు ఫోన్ చేసినా తల్లి క్షేమసమాచారాలు కనుక్కొని, ఆరోగ్యం గురించి ఆరాతీసి జాగ్రత్తలుచెప్పి ఫోన్ పెట్టేసేవాడు. మనవడు పుట్టిన వేళావిశేషం కోడలు ప్రేమగా రమ్మని పిలిచింది.

స్నేహితురాలు 'మనోహరి'కి ఈ విషయం చెబితే, పిల్లల ప్రేమ అర్థం చేసుకోవాలని, వాళ్ళు రమ్మని పిలిచినప్పుడు ఆ మాత్రం నాలుగురోజులు వెళ్ళి ఉండవా' అని మనసుకు అర్థమయ్యేటట్లుచెప్పి ఈ ప్రయాణానికి ఒప్పించింది.

రఘు స్నేహితుడు 'మురారి'తో కలిసి కస్తూరి అమెరికాలో కాలు పెట్టింది. కొడుకు, కోడలు, మనవడిని చూసుకుని మురిసిపోయింది. రెండురోజులపాటు మనవడిని క్షణం కూడా దింపకుండా ఎత్తుకునే ఉంది. చూసిచూసి కోడలే, వాడికి 'ఎత్తుడు' అలవాటైపోతుంది, పడుకోబెట్టినా ఉండడు. అది మనకే కష్టం అంటూ కస్తూరిని హెచ్చరించింది. వారాంతం గడిచి సోమవారం రానే వచ్చింది. ఉదయం ఎనిమిదికల్లా ఎవరి ఉద్యో

గాలకు వాళ్ళు వెళ్ళిపోయారు. పిల్లాడికి ఏ సమయానికి ఏం పెట్టాలో, ఎలా పెట్టాలో, అవసరమైన జాగ్రత్తలు అన్నీ అత్తగారికి చెప్పి మరీ వెళ్లింది రమ్య.

కస్తూరి మనవడిని చూసుకొని, కొడుకు బాల్యాన్ని మధుర స్మృతులను గుర్తు చేసుకుంటూ, ఆయన లేని లోటు తప్ప భగవంతుడు తనకు తక్కువేమీ చేయలేదనుకుంది. కోడలు ఆఫీసు కెళ్తూ బాబుకి పాలతోపాటు సీసాలో ఉన్న జిగురులాంటి పదార్థం పెట్టమంది. చంటివాడికి పెడ్తే తిన్నది తక్కువ. ఉమ్మింది ఎక్కువ. తాను ఊరి నుండి తీసికొచ్చిన ఉగ్గు పెట్టింది. వాడు లొట్టలేసుకుంటూ ఇష్టంగా తిన్నాడు. నాలుగు రోజులు ఈ తిండి తిన్నాడో లేదో ఒళ్ళు కూడా చేశాడు. ఈ విషయం కోడలికి చెప్పినా వినకుండా, సీసాలో ఉన్న ఆహారమే పెట్టండి ఆరోగ్యానికి మంచిదని చెప్పింది. కస్తూరి ఎవరూ చూడకుండా ఆ సీసాలు చెత్తకుండీలో వేసి ఉగ్గునే పిల్లాడికి పెడుతోంది. సాయంత్రాలు పిల్లాడిని దగ్గరలో ఉన్న పార్కుకి తీసుకెళ్ళేది. అమెరికాలో తెలుగువాళ్ళు చాలామంది ఉన్నారనిపించింది. పార్కులో ఆడుకుంటున్న సుమారు పదేళ్ళపిల్లాడు కస్తూరి దగ్గరకు వచ్చి నువ్వు నానీవా! లేక నాయనమ్మవా! అని అడిగాడు.

నేను వాడి నాయనమ్మను నీ పేరేంటి? అని అడిగింది.

చైతన్య  అంటే చేతూ

వీడిపేరు లాగా నాయనమ్మను 'నానీ' అని పిలుస్తారేమో! అనుకుంది కస్తూరి.

అత్తయ్యా రేపు శుక్రవారం సాయంత్రం మా స్నేహితులు మన ఇంటికి భోజనానికి వస్తారు.

మనఊరు వంటలు వాళ్ళకు రుచి చూపిద్దువు గాని అంది.

రమ్య స్నేహితులు కస్తూరిని చూడగానే లాక్ వాళ్ళ  నానీ మీరేనా అని అడిగారు. వీడిపేరు లాక్ కాదు. లక్ష్మణరావు. 'లక్ష్మణరావు' నాయనమ్మను నేను. ఇండియాలో నాయనమ్మలు, అమెరికాలో 'నానీ'లు. లక్ష్మణరావే 'లాక్' కస్తూరికి వాళ్ళ మాట తీరు తెన్నులు నచ్చక లోపలికి వెళ్ళింది.

మీ అత్తగారు ఆయా పనికి, వంటపనికి బాగానే ఉపయోగపడుతోంది. అదృష్టవంతురాలివే రమ్యా అన్నారు స్నేహితులు.

మా అమ్మాయి పుట్టినప్పుడే మా అత్తగారిని రమ్మన్నాం. కానీ ఈ పని చేయాలనే ఆవిడ రాలేదు. పెద్దవాళ్ళకి కూడా బద్దకాలు పెరిగిపోతున్నాయి. ఇక్కడ మనం సుఖపడి పోతున్నామని ఏడుపు అంది. వారి సంభాషణ అలా సాగిపోయింది.

'లాక్'కి ఇప్పుడు తొమ్మిదోనెల. ఊ, ఆ... లతో పాటు అమ్మ, అత్త, తాత అంటున్నాడు. పాకుతున్నాడు. పట్టుకుని నిలబడుతున్నాడు. కస్తూరి ఇప్పుడు లాక్‌కి పదాలు, పద్యాలు, జానపదాలు, కథలు చెబుతూ ఊ... ఆ... అనిపించుకుంటూ సమయం తెలియకుండా గడిపేస్తోంది.

అత్తయ్యా! మీరు వాడికి ఇలా తెలుగు పాటలు, మాటలు నేర్పిస్తే ఎలా?

ఇక్కడ అందరూ ఇంగ్లీషులోనే మాట్లాడతారు. వాడు బడికివెళ్ళినా, బయటికి ఎక్కడికైనా వెళ్ళినా ఆ భాషే మాట్లాడాలి. మేము ఆఫీసులకు వెళ్ళిన తర్వాత టి.వి.లో వచ్చే ఇంగ్లీషు సినిమాలు, ఆటలు, పాటలు మీరు చూడండి. వాడు భాష వింటాడు. మీకు నాలుగు ఇంగ్లీషు ముక్కలు వంటబడతాయి

**తలుపులు బిగించుకుని మనవడితో పాటు నాయనమ్మ ఒక్కర్తే ఉంటుంది ఆ ఇంట్లో. తెలుగు పద్యాలు నేర్పుతూ, చక్కటి ఆహారం పెడుతూ మనవణ్ణి పెంచుతోంది. ఒళ్ళుచేసిన మనవడు కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నాడు. అత్తగారితీరు కోడలికి నచ్చలేదు. నిలదీసింది ఆమె. నాలుగ్గోడల మధ్య జరిగేది కోడలికెలా తెలిసింది? సందేహంలో పడింది అత్తగారు. ఆమె సందేహం తీరిందా? కోడలు దారికొచ్చిందా?**

అంది రమ్య ఒకరోజు.

అర్థం కానట్లు కస్తూరి కొడుకువైపు చూసింది.

రమ్య చెప్పినట్లే చేయి. అయినా ఈ పిల్లల పెంపకం గురించి నాకు తెలియదంటూ 'రఘు' అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

రోజూలాగే రమ్య, రఘు ఉద్యోగాలకి వెళ్ళిపోయారు. కస్తూరికి ఆటవిడుపు.

ఉదయం పది గంటల సమయం.

టింగ్ టింగ్ మంటూ కాలింగ్ బెల్ పిలుపు.

ఎవరా అనుకుంటూ కస్తూరి తలుపు తీసింది.

పార్క్‌లో కనిపించిన చిన్న నేస్తం 'చేతూ' (చైతన్య).

నాయనమ్మా, ఈరోజు నా పుట్టినరోజు. మా నాయనమ్మతో ఫోన్‌లో మాట్లాడాను. చాక్లెట్ ఎలా ఇవ్వను? అని అడిగాను. 'లాక్' నాయనమ్మ ఇక్కడే ఉన్నారని చెబితే ఆవిడకి చాక్లెట్ ఇవ్వు, నాకిచ్చినట్లే అంది. ఎలా అంటే. అందరి నాయనమ్మల మనసు ఒకటే అంది. ఇదిగో అంటూ నాలుగు చాక్లెట్లు చేతిలో పెట్టాడు.

బడి లేదా?

ఉంది. కాని మా నాయనమ్మతో మాట్లాడాలి. 'బర్త్‌డే విషెష్' చెప్పించుకోవాలనుకున్నాను. బడి నుంచి వచ్చేసరికి సాయంత్రం అవుతుంది. అప్పుడు వాళ్ళకి 'తేదీ' మారిపోతుంది కదా! అందుకని నాకు కడుపునొప్పి వచ్చినట్టు నటించా. అప్పుడు అమ్మ నాకు టాబ్లెట్ ఇచ్చి రెస్ట్ తీసుకోమంటుంది కదా!

అమ్మకి అబద్ధం చెప్పావా?

మరి నాయనమ్మతో మాట్లాడాలి కదా! అయినా డాడీకి ఈ ప్లాన్ చెప్పాను. సరే అన్నాడు.

మరి ఇంట్లో ఒక్కడివే ఉన్నావా?

తమ్ముణ్ణి చూడటానికి 'నానీ' వస్తుంది కదా! ఆవిడతో ఉంటాను.

అమ్మ ఆఫీసుకు వెళ్ళేటప్పుడు నానీ వస్తుంది. అమ్మ వచ్చిన తర్వాత నానీ వెళ్ళిపోతుంది. నాయనమ్మలైతే నీలాగా ఇంట్లో ఉండిపోతారు.

***

శనివారం అందరూ ఇంట్లోనే ఉన్నారు.

అమ్మా! అని పిలిచాడు రఘు.

ఏంటి రఘూ!

రమ్య నీతో ఏదో చెప్పాలనుకుంటోంది అన్నాడు.

చెప్పు రమ్యా! నా దగ్గర మొహమాటమెందుకు? అడిగింది కస్తూరి.

మీరు పెద్దవారు. అనుభవమున్నవారని, మా అబ్బాయిని చూస్తారని ఇక్కడికి తీసుకువచ్చాం. మీరు మీ ఇష్టం వచ్చినట్లు వాడికి తిండిపెడుతూ, మాకు అబద్ధాలు చెబుతున్నారు.

నీకెందుకు ఆ అనుమానం వచ్చింది. బాబుకి సుస్తీ చేసిందా? లేక వయసు ప్రకారం పెరగడం లేదా?

అనుమానం కాదు. నిజాలు. సాక్ష్యాలతో సహా నా దగ్గర ఉన్నాయి.

అంటే!

నేను వద్దన్నా వాడికి రోజూ మీరు ఉగ్గు పెడుతున్నారు. ఎప్పుడూ ఎత్తుకుని తిప్పద్దన్నా వాడిని ఉయ్యాలలో ఒక్క నిముషం కూడా ఉంచకుండా ఎత్తుకుని తిరుగుతూ ఉంటారు. వద్దన్నాగానీ ఆ పాతచింతకాయ తెలుగుపద్యాలే పాడుతూ వాటితోనే బాబుని నిద్రపుచ్చుతారు. మీరు ఇక్కడ ఉన్నది కేవలం వాడి అవసరాలు చూడటానికి, అదీ



# భవిష్యత్తులో అవుతుందట!

ఒక్కటంటే ఒక్క హిట్టు పడితే చాలు దూసుకుపోయే హీరోయిన్లు చాలా మందే ఉన్నారు. మరికొందరేమో వచ్చిన విజయాన్ని కూడా క్యాష్ చేసుకోలేరు. అలాంటి వారిలో బాపు బొమ్మ ప్రణీత పేరు చెప్పుకోవలసిందే! 'అత్తారింటికి దారేది' ద్వారా ఘన విజయాన్ని అందుకున్న తరువాత కూడా దాన్ని క్యాష్ చేసుకోలేకపోయిన ఈ చిన్నది నటన తనవల్లకాదనుకొని వ్యాపారం వైపు అడుగులు వేసింది. ముందు ఓ రెస్టారెంట్ వ్యాపారం ప్రారంభించి ఆ తరువాత దాన్ని బార్ అండ్ రెస్టారెంట్‌గా మార్చింది. ఇప్పుడిప్పుడే లాభాలు కళ్ళజూస్తున్న ప్రణీతను 'సినీ నిర్మాతగా మారే ఉద్దేశం ఉందా?' అని అడిగారు. దానికి బదులుగా 'ఇప్పటికిప్పుడు అంటే కుదరదు. భవిష్యత్తులో నిర్మాతగా మారతాను' అని చెప్పింది! ఇంకేముంది? నిర్మాతగా ప్రణీత అంటూ వార్తలు హల్‌చల్ చేస్తున్నాయి. అంతేకాకుండా కొందరు ఔత్సాహికులు కథలు చెబుతామంటూ ఆమె వెంట పడడం మొదలెట్టారట కూడా!

మేము చెప్పినట్లు. అంతేకాని అనవసరపు పెద్దరికాలు, ప్రేమలు నాకు నచ్చవు.

రఘు ఏం మాట్లాడకుండా భార్య చెప్పిందే సరైనదన్న సందేశం ఇస్తూ మౌనంగా ఉండిపోయాడు.

వీళ్ళిద్దరూ ఇంట్లో లేనప్పుడు బాబుని నేను ఎలా చూసుకుంటున్నాను అనే విషయం ఎలా తెలిసింది అని కస్తూరి ఆలోచిస్తూ ఉండిపోయింది. మర్నాడు పార్క్‌కి వెళ్ళింది. 'చేతూ' కనిపించాడు.

నాయనమ్మా బాగున్నావా? అలా ఉన్నావేంటి? మూడ్ బాగాలేదా?

ఆ మాటలు విన్న కస్తూరికి 'చేతూ' వామనావతారంలోని 'విష్ణువు'లా కనిపించాడు.

తన మనసులో ఉన్న సందేహాన్ని చైతూకి చెప్పింది కస్తూరి.

ఓ అదా! మా ఇంట్లో తమ్ముణ్ణి చూసుకోవడానికి నానీ ఉంటుంది కదా!

ఎలా చూస్తోందో తెలుసుకోవడానికి గదిలో కెమెరాలు పెడతాం. అలాగే మీ ఇంట్లో కూడా పెట్టారేమో!

దుకాణాల్లో దొంగల కోసం పెడతారు కెమేరాలు..!

అంటే! ఇంట్లో ఇంటి దొంగలకోసం ఈ కెమెరాలు పెట్టారన్న మాట! కస్తూరికి ఒక్క క్షణం కూడా ఆ దేశంలో, ఆ ఇంట్లో ఉండబుద్ధికాలేదు. వెంటనే నాయనమ్మతో మాట్లాడటానికి కడుపు నొప్పి అని అబద్ధం చెప్పిన 'చేతూ' ఆదర్శంగా కనిపించాడు. ఇంటికివచ్చి తలనొప్పి అని చెప్పి పడుకుంది. రెండురోజులు రమ్య సెలవుపెట్టి కొడుకుని చూసుకుంది.

కస్తూరి కావాలనే వాళ్ళిద్దరికీ వినబడేటట్లు కొంచెం దగ్గటం మొదలుపెట్టింది. బాబుకోసం రఘు కూడా రెండురోజులు సెలవు పెట్టాడు.

ఏమండీ! మీ అమ్మగారు ఆరోగ్యంగానే ఉన్నారని మనం 'హెల్త్ఇన్స్యూరెన్స్' కూడా చేయించలేదు. డాక్టర్ల ఫీజు భరించలేం. ఏదోఒకటి ఆలోచించి మీ అమ్మని పంపించేయండి. ఆ మాత్రం డబ్బుపడేస్తే ఇక్కడ 'నానీ'లకి కొదవలేదు.

అమ్మా!

చెప్పు రఘూ!

నువ్వు వచ్చి నాలుగు నెలలు అవుతోందికదా! ఎప్పుడూ ఇల్లు వదిలిపెట్టి రాలేదు. నీకు ఇంటిమీద బెంగవల్ల ఆరోగ్యం పాడైపోయిందేమో అనిపిస్తోంది. ఊరికి పంపించనా!

"రోగీ పాలే కోరాడు, వైద్యుడూ పాలే తాగమన్నాడు" అన్నట్లు తన పథకం పారినందుకు కస్తూరి లోపల అనందపడింది. పైకి నీ ఇష్టం వచ్చినట్లు చేయి అంది.

రెండు రోజుల్లో కస్తూరి తిరుగు ప్రయాణం ఖరారైంది.

సొంత ఊళ్ళో, తన ఇంట్లో అడుగుపెట్టింది కస్తూరి.

ఆమెను చూడగానే మంగ ఎదురువచ్చి చేతిలోని సామాన్లను తీసుకుంది. మంగ చంకలో ఉన్న దాని కూతురిని చూసి ముచ్చటగా చేతులు జాపింది కస్తూరి. నవ్వుతూ ఆమె దగ్గరకు వచ్చింది పాప. 'పేరు ఏదైనా దేవుడు ఒక్కడే... బొమ్మలే వేరు' అన్న మంగ మాటలు, నాయనమ్మల మనసులు ఒక్కటే అని చెప్పిన 'చేతూ' పలుకులు ఆ క్షణంలో కస్తూరికి గుర్తుకు వచ్చాయి.

విద్యాగంధం లేని మంగ, బాలవాక్కు బ్రహ్మవాక్కు అన్నచందంగా 'చేతూ' తనకు అనుసరణీయం అని మనసులోనే అనుకుంది కస్తూరి.

మంగా! నీ కూతురికి నేనే నాయనమ్మను అంది.

అంతకన్నా ఏం కావాలి మాకు. మీ మనసు ఆ భగవంతుడిలాగా గొప్పది అంది మంగ ఆనందంగా.

రాలిన 'ఆకు' స్థానంలో కొత్తచిగురు వచ్చినట్లు, ఆయాగా మార్చిన నాయనమ్మను, నువ్వు మళ్ళీ నాయనమ్మగా మార్చావు మంగా! నీదే గొప్ప మనసు అంది కస్తూరి.

ఆమె మాటలు అర్థం కాకపోయినా కస్తూరివైపు నవ్వుతూ చూసింది మంగ.

ఎన్నో రోజుల తర్వాత కస్తూరి కూడా హాయిగా నవ్వింది.

***ఫోన్: 040-27661900***

## సంక్షోభంలోనూ లవ్ హార్మోన్ పాత్ర

ప్రతి మనిషికీ, జంతువుకీ లవ్ హార్మోన్ ఉంటుంది. రిలేషన్‌షిప్‌కిది దోహదపడుతుంది. మన రక్తంలో విడుదలయ్యే OXYTOCINనే లవ్ హార్మోన్ అంటాం. కానీ సరికొత్త కోణంలో చేసిన ఒక పరిశోధన ప్రకారం సంక్షోభ సమయంలోనూ ఈ హార్మోన్ భారీగా విడుదలై మన నాడీ కణాలను ప్రభావితం చేస్తుంది. భార్యాభర్తల మధ్య అనుబంధం సమస్యల్లో పడినప్పుడు దాన్నెలా పరిష్కరించుకోవాలనే ఆలోచనలో పడినప్పుడు ఆక్సిటోసిన్ రక్తంలో విడుదలై రోల్ ప్లే చేస్తుందని కనుగొన్నారు. నార్వేజియన్ సైన్స్ అండ్ టెక్నాలజీ యూనివర్సిటీ నాయకత్వంలో ఒక అంతర్జాతీయ పరిశోధకుల బృందం ఈ అధ్యయనం చేసింది. స్థలకాలాదుల ప్రభావం, సంస్కృతి, ప్రాంతాల ప్రభావం దీని పనితీరుపై ఎలా ఉంటుందో కూడా వారు పరిశీలించి పెద్ద తేడా లేదని వెల్లడించారు. ఈ అధ్యయనంలో పనిచేసిన డాక్టర్ ఆండ్రియాస్ ఆర్నెట్ క్రిస్టోఫెర్సెన్ మాట్లాడుతూ, 75 అమెరికా జంటలు, 148 నార్వే జంటలపైన అధ్యయనం చేసినట్లు చెప్పారు.



ఈ జంటలను విడివిడిగా రిలేషన్‌షిప్‌కు సంబంధించిన ఆలోచనలు చెయ్యమని చెప్పి ఆక్సిటోసిన్ లెవెల్స్ గమనించారు. గాఢమైన భావాలున్నవారిలో ఇది భారీగా విడుదలైంది. తన జీవితభాగస్వామికి తనపట్ల ఆసక్తి తగ్గిందనీ, తనపట్ల ప్రేమ చూపించడంలేదనీ తెలుసుకున్నప్పుడు కూడా శరీరంలో ఆక్సిటోసిన్ గణనీయంగా విడుదల అవుతుందన్నారు. దీనివల్ల వచ్చే యాంగ్జైటీని తగ్గించడానికి ఆక్సిటోసిన్ ఉపయోగపడటమే కాదు, ఎక్కువ పరిమాణంలో ఇది రక్తంలో విడుదలై భాగస్వామిపట్ల మరింత ప్రేమ పూర్వకంగా వ్యవహరించడానికి మనల్ని ప్రేరేపిస్తుంది! ఇందులో రెండు ప్రధాన సిద్ధాంతాలున్నట్లు ఆయన చెప్పారు. ఒకటి ఏంటంటే, మనం ఎవరిప్రేమలోనైనా ఉన్నప్పుడు వారిని గాఢంగా ప్రేమించి ఆ బంధాన్ని బలోపేతం చేసుకోవడానికి దోహదం చేస్తుందని కొందరు సైంటిస్టులు నమ్ముతున్నారు. మనం కష్టాల్లో ఉన్నప్పుడు, రిలేషన్ ప్రమాదంలో పడిందని గ్రహించినప్పుడు కూడా ఆక్సిటోసిన్ భారీగా రక్తంలో విడుదలవుతుందని మరికొందరు సైంటిస్టులు నమ్ముతున్నారు. ఇలాంటి సందర్భాల్లో సరికొత్త సంబంధాలను కోరుకోవడానికి, సమస్యను టాకిల్ చేయడానికి దోహదపడుతుందని గట్టిగా నమ్ముతున్నారు. భాగస్వాముల రిలేషన్స్ కాపాడటంలో ఇదొక పెట్టుబడిగా దోహదం చేస్తుందన్నమాట. భాగస్వాములిద్దరిలో ఈ హార్మోన్ హై లెవెల్‌లో ఉన్నప్పుడు వారు తమ అనుబంధం ఎంతో శక్తిమంతమైనదని విశ్వసించారు. ప్రసవ సమయంలో కూడా ఆక్సిటోసిన్ విడుదలై బిడ్డతో తల్లి అనుబంధం పెంచుకోవడానికి, పాలు విడుదల కావడానికి దోహదం చేస్తుంది.

నవ్య






**దాశరథి సినిమా పాటల పందిరి**

కె.ప్రభాకర్

**ధర:** 350 రూపాయలు

**పేజీలు:** 326

**ప్రతులకు:** కె.విమలారాణి, డా.ప్రభాకర్‌రెడ్డి చిత్రపురి కాలనీ, మణికొండ జాగీర్, హైదరాబాద్-08.

**సెల్:** 90009 38291

'నా తెలంగాణ కోటి రతనాల వీణ...' అంటూ అగ్నివీణ మోగించిన ఆధునిక తెలుగు సాహిత్య అగ్రగణ్యుడు, స్వాతంత్ర్య సమరయోధుడు, అభ్యుదయవాది కళాప్రపూర్ణ దాశరథి కృష్ణమాచార్యులు. పీడిత ప్రజల సమస్యలను గొంతెత్తి చెప్పిన కవివాణి. సినీ గీత రచయితగా పద్దెనిమిదేళ్ళ ఆయన సమగ్ర సినీ సాహిత్యంపై 80 మంది రచయితలు రాసిన వ్యాసాల సంకలనమే ఈ 'పాటల పందిరి'. దాశరథి సాహిత్యం, బహుముఖీనమైన ఆయన వ్యక్తిత్వం, అభ్యుదయ భావాలు, ఆయన గీతాల గొప్పదనం వంటి అనేక పార్శ్వాలను ఈ పుస్తకంలో విశ్లేషించారు.

---

**మెతుకు కతలు**

**సంపాదకులు:** వేముగంటి మురళీకృష్ణ, బెల్లంకొండ సంపత్ కుమార్

**ధర:** 200 రూపాయలు, **పేజీలు:** 442

**ప్రతులకు:** నవోదయ, నవచేతన, నవ తెలంగాణ , నవయుగ, దిశ, సహచర బుక్‌హౌస్‌లు



థింక్ గ్లోబల్లీ యాక్ట్ లోకల్లీ అన్నారు. అందుకే ఇప్పుడు ప్రాంతీయ సాహిత్యానికే పెద్దపీట. పోరుగడ్డ తెలంగాణలో దీనికి మరీ ప్రాధాన్యం ఎక్కువ. తెలంగాణ ప్రతి మట్టిరేణువులోనూ ఎన్నో కథలు దాగుంటాయి. అందుకే మెదక్‌జిల్లా రచయితల సంఘం (మరసం) 'మెతుకు కతలు' పేరిట ఆ జిల్లా కథలను సంకలనంగా తెచ్చింది. గత శతాబ్దం నుండి ఈనాటి వరకు జిల్లా ప్రస్థానంలోని జీవన స్థితిగతులను, కొత్త మార్పులను కళ్ళకు కట్టిన కథలివి.

---



**ఒక విజేత**

**(అబ్దుల్ కలామ్‌కు తెలుగువారి కవితా నివాళి)**

**సంపాదకులు:** మాడభూషి సంపత్‌కుమార్

**ధర:** 250 రూపాయలు

**పేజీలు:** 256

**ప్రతులకు:** పాలపిట్ట బుక్స్, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట, హైదరాబాద్-36

**ఫోన్:** 040-27678430

దేశం మొత్తాన్ని ఒక ఉన్నతమార్గంలో నడిపించడానికి ప్రయత్నం చేసిన మహనీయుడు అబ్దుల్‌కలామ్. ఆయన మరణానంతరం ఎందరో స్వచ్ఛంగా వీధుల్లోకి వచ్చి నివాళులు అర్పించారు. ఎందరో కవితా నివాళులు అర్పించారు. తెలుగువారు రాసిన అలాంటి కవితలన్నింటినీ ఒకచోటచేర్చి ఎంపిక చేసి వెలువరించిన 256 కవితల సంకలనమే ఈ పుస్తకం.

## స్వీకారాలు

**మా గ్రామం రామరాజ్యం**

**కథా సంపుటి**

రచన: కాచెగోరి మధుసూదన్

**ధర:** 100 రూపాయలు, **పేజీలు:** 84

**ప్రతులకు:** రచయిత, 6-4-38, బ్రాహ్మణవాడ, హనుమకొండ, వరంగల్ అర్బన్ జిల్లా

**సెల్:** 83740 84396

**2017 సంఖ్యాశాస్త్ర ఫలాలు**

**రాశిఫలాలు**

**సంకలనం:** డా.రైజల్ చౌదరి, డా.కొండవీటి మురళి

**ధర:** 50 రూపాయలు, **పేజీలు:** 104

**ప్రతులకు:** జె.పి.పబ్లికేషన్స్, గోగావారి వీధి, ఏలూరు రోడ్, విజయవాడ-02.

**ఫోన్:** 0866-2439464

**ఒక వేసవిరోజు**

మాధురి పురందరే

**అనువాదం:** కె.సురేష్

**ధర:** 50 రూపాయలు, **పేజీలు:** 86

**ప్రతులకు:** మంచిపుస్తకం, 12-13-439 వీధి నెం 1, తార్నాక, సికింద్రాబాద్-17.

**సెల్:** 9490746614

**శ్రీచక్ర సంచారిణి**

**సంకలనకర్త:** శ్రీమతి పోలంరాజు శారద

**ధర:** 60 రూపాయలు,

**పేజీలు:** 72

**ప్రతులకు:** జ్యోతి వల్లబోజు,

**సెల్:** 8096310140, అన్ని ప్రధాన పుస్తక విక్రయ కేంద్రాలు

**-లలితాత్రిపురసుందరి**




జూన్ 7 నుంచి
జూన్ 13 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, విద్యా విషయాలు, సమావేశాలు, వేడుకలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం అందుకుంటారు. పెట్టుబడులు లాభిస్తాయి. 8, 9, 10 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు, చర్చల్లో నిదానం అవసరం. ఉన్నత విద్యా ప్రవేశాల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 11, 12 తేదీల్లో ప్రముఖులతో చర్చలు ఫలిస్తాయి. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 13న బృందకార్యక్రమాల్లో ఉల్లాసంగా పాల్గొంటారు. ఖర్చులు అంచనాలు మించుతాయి.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, ఉన్నత విద్యావిషయాలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం స్పెక్యులేషన్లు లాభిస్తాయి. షాపింగ్ ఉల్లాసం కలిగిస్తుంది. 8, 9, 10 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఖర్చులు అధికం. 11, 12 తేదీల్లో ఆర్థిక విషయాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 13న ప్రమోషన్లు, ఇంక్రిమెంట్ల విషయంలో కొంత నిరుత్సాహం కలుగుతుంది. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

వేడుకలు, వృత్తి, వ్యాపారాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం కృషి రంగంలో పట్టుదలతో లక్ష్యాలు సాధిస్తారు. 8, 9, 10 తేదీల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి. స్పెక్యులేషన్‌లలో ఆచితూచి వ్యవహరించాలి. 11, 12 తేదీల్లో పన్నులు, బీమా, పెన్షన్ వ్యవహారాలపై దృష్టి సారిస్తారు. రుణాలు మంజూరవుతాయి. పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక పరిస్థితిని సమీక్షించుకుంటారు. 13న బంధుమిత్రులవైఖరి ఆవేదన కలిగిస్తుంది. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, ఆరోగ్యం, విద్యా విషయాలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం దూరంలో ఉన్న ప్రియతముల కలయిక ఆనందం కలిగిస్తుంది. విద్యార్థులకు శుభప్రదం. 8, 9, 10 తేదీల్లో విందు వినోదాల్లో పాల్గొంటారు. వృత్తి, వ్యాపారాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. 11, 12 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. భాగస్వామికి సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. న్యాయ, రక్షణ, విదేశీ వ్యవహారాల రంగాల వారికి శుభప్రదం. ప్రియతములతో ప్రయాణాలు, చర్చలు ఉల్లాసం కలిగిస్తాయి. 13న ఆర్థిక విషయాల కారణంగా మనశ్శాంతి లోపిస్తుంది.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

ప్రేమానుబంధాలు, పెట్టుబడులు, బృంద కార్యక్రమాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ప్రియతముల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. 8, 9, 10 తేదీల్లో వేడుకలు, శుభకార్యాల్లో పాల్గొంటారు. బంధుమిత్రుల కలయిక ఆనందం కలిగిస్తుంది. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. ప్రేమానుబంధాలు బలపడతాయి. 11, 12 తేదీల్లో బంధుమిత్రులతో విందు వినోదాల్లో పాల్గొంటారు. కొత్త పరిచయాలు లక్ష్య సాధనకు ఉపకరిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. 13న ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఖర్చులు అంచనాలు మించుతాయి.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, చిన్నారుల విషయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. విద్యార్థులకు ప్రోత్సాహకరం. 8, 9, 10 తేదీల్లో బదిలీలు, మార్పులు కొంత నిరుత్సాహం కలిగిస్తాయి. పెద్దలు, పైఅధికారుల వైఖరిలో సానుకూలమైన మార్పు గమనిస్తారు. కుటుంబ విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 11, 12 తేదీల్లో వృత్తి వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. పెద్దల సహకారంతో చేపట్టిన పనులు పూర్తి చేస్తారు. 13న ఉద్యోగ వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

శుభకార్యాలు, విద్య, ఆర్థిక వ్యూహాలు, సమావేశాలకు ఈ వారం అనుకూలం. బుధవారం ఆర్థిక వ్యవహారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 8, 9, 10 తేదీల్లో అడ్మిషన్ల విషయంలో అంచనాలు తప్పే అవకాశం ఉంది. విద్యార్థులకు శుభప్రదం. చర్చలు, సమావేశాలు, ప్రయాణాలు ఆనందం కలిగిస్తాయి. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 11, 12 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ప్రోత్సాహకరం. వేడుకలు, సమావేశాలకు ఏర్పాట్లు చేస్తారు. బంధుమిత్రులతో ఇల్లు సందడిగా ఉంటుంది. 13న ఉన్నత విద్యా విషయాల్లో ప్రోత్సాహకరం. పెట్టుబడుల్లో నిదానం అవసరం.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

రుణప్రయత్నాలు, పెట్టుబడులు, చిన్నారుల విషయాలు దూరప్రయాణాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధవారం రుణప్రయత్నాలు ఫలిస్తాయి. గత స్మృతులు నెమరువేసుకుంటారు. 8, 9, 10 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. తొందరపాటు నిర్ణయాల వల్ల కొంత నష్టపోయే ప్రమాదం ఉంది. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. పెట్టుబడులు లాభిస్తాయి. 11, 12 తేదీల్లో విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఆర్థికపరమైన చర్చలు, ప్రయాణాలు ఫలిస్తాయి. సన్నిహితుల ఆంతరంగిక విషయాల్లో జోక్యం చేసుకోవాల్సి రావచ్చు. వేడుకలు ఉల్లాసం కలిగిస్తాయి. 13న ఇంటి కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఖర్చులు అధికం.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, కాంట్రాక్టులు, భాగస్వామి విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. బంధుమిత్రుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. 8, 9, 10 తేదీల్లో పందాలు, పోటీల్లో విజయం సాధిస్తారు. వివాహ నిర్ణయాలకు అనుకూలం. జనసంబంధాలు విస్తరిస్తాయి. ఖర్చులు అధికం. 11, 12 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. షేర్లు, మ్యూచువల్ ఫండ్ లావాదేవీలకు అనుకూలం. 13న చర్చలు, సమావేశాల్లో తొందరపాటు తగదు. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

ప్రమోషన్లు, ఇంక్రిమెంట్లు, ఉద్యోగ ప్రయత్నాలు, ఆరోగ్య విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం వృత్తిపరమైన సమావేశాలు సత్ఫలితాలనిస్తాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 8, 9, 10 తేదీల్లో సినీ రాజకీయ రంగాల వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. వైద్యం, పరిశ్రమల రంగాల వారికి ఆర్థికంగా లాభిస్తుంది. లక్ష్య సాధనలో గత అనుభవం తోడ్పడుతుంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. 11, 12 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. విందు వినోదాల్లో పాల్గొంటారు. పరిశ్రమలు, హోటల్, వైద్య రంగాల వారు కీలక నిర్ణయాలు తీసుకుంటారు. 13న అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలకు ఆటంకాలు ఎదురవుతాయి.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, చిన్నారులు, ప్రియతములు, విద్యావిషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. 8, 9, 10 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. చిన్నారులు, ప్రియతముల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. ఖర్చులు అధికం. 11, 12 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. సినీ, రాజకీయరంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ప్రియతములకు సంబంధించి రహస్య సమాచారం అందుకుంటారు. బ్యాంకింగ్, ఉన్నత విద్య, ఫొటోగ్రఫీ, గ్రనైట్ రంగాల వారికి ప్రోత్సాహకరం. 13న చిన్నారుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

గృహారంభ, ప్రవేశాలు, వేడుకలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వేడుకలతో ఇల్లు సందడిగా ఉంటుంది. బదిలీలకు అనుకూలం. 8, 9, 10 తేదీల్లో పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. బదిలీలు, మార్పులకు, గృహారంభ, ప్రవేశాలకు అనుకూలం. రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల్లోని వారు పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 11, 12 తేదీల్లో సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. బంధుమిత్రులతో విందుల్లో పాల్గొంటారు. బ్యాంకులు, ఆస్పత్రులు, హోటల్ రంగాల వారికి ఆర్థికంగా లాభదాయం. 13న కుటుంబ వ్యవహారాల కారణంగా మనశ్శాంతి లోపిస్తుంది.




## తండ్రిని చంపమంటున్న తనయుడు!



ఇదేదో సినిమాలో జరిగిన సన్నివేశం కాదు. నిజజీవితంలో జరుగుతున్నదే! నటుడు చలపతి రావు స్త్రీల మీద చేసిన వ్యాఖ్యలపై పెద్ద ఎత్తున దుమారం రేగిన సంగతి తెలిసిందే! ఈ విష యంలో చలపతిరావు అందరినీ క్షమాపణలు కోరినా ఆయన మీద విమర్శలు వస్తూనే ఉన్నాయి. ఈ నేపథ్యంలో ఆయన కొడుకు, నటుడు, దర్శకుడు అయిన రవిబాబు బాధతో పైవిధంగా వ్యాఖ్యా నించాడు. తన తండ్రి జరిగిన తప్పు తెలుసుకుని క్షమాపణ అడిగినా కూడా కొన్ని సంఘాల వారు ఆయన్ని వదలడం లేదనీ, వారి మాటలతో ఆయన్ని మానసికంగా మరింతగా హింసిస్తున్నా రనీ దీని కన్నా కూడా ఆయనను శారీరకంగా చంపేస్తే ఆయనకు మనశ్శాంతి లభిస్తుంది అంటూ ఆవేదన వ్యక్తం చేశాడు.

## పడకు...పడకు...అమ్మాయి వెంట పడకు

అంటున్నాడు ఓ అన్న తన తమ్ముడితో. సామాన్యులకు ఇది తప్పేమో కానీ, సినీరంగంలో ఇవన్నీ మామూలే! ఆ అమ్మాయి వెంట పడకు అంటూ తన తమ్ముడికి క్లాసు తీసుకుంది షాహిద్‌కపూర్. అలనాటి అందాల తార శ్రీదేవి కూతురు జాహ్న వితో షాహిద్‌కపూర్ తమ్ముడు ఇషాన్ డేటింగ్‌లో ఉన్నాడన్న వార్తలు బాలీ వుడ్‌లో షికారు చేస్తున్నాయి. ఈ ఇద్దరూ కూడా త్వరలోనే బాలీవు డ్‌లో సినీరంగ ప్రవేశానికి సిద్ధమ వుతున్నారు. ఇలాంటప్పుడు ఈ పుకార్లు కెరీర్‌ను దెబ్బతీస్తాయని షాహిద్ భయపడుతున్నాడట! అదే విషయం తమ్ముడికి చెప్పి, అన్నిటికీ ఫుల్‌స్టాప్ పెట్టమన్నాడట! అవతల శ్రీదేవి కూడా కూతురికి ఇంచుమించు ఇలాంటి క్లాసే తీసుకున్నదంటున్నారు. కాకపోతే ఈ పిల్లలిద్దరూ దేశముదుర్లు కనుక పెద్దల మాట వినకపోవచ్చు అంటున్నారు బాలీవుడ్ జనాలు.



## రిస్క్ చేస్తున్న క్రిష్

రిస్క్ చేయకపోతే కిక్ లేదంటుంటారు కొందరు. సరిగ్గా ఇలా అనుకునే ఇబ్బందుల్లో పడ్డాడు టాలీవుడ్ దర్శకుడు క్రిష్. ఈ దర్శకుడు 'గౌతమిపుత్ర శాతకర్ణి' తరువాత బాలీవుడ్ సినిమా మీద దృష్టి పెట్టాడు. అక్కడ కంగనాతో 'మణికర్ణిక' అనే సినిమా చేస్తున్నాడు. ఈ సినిమా విషయంలో ఇప్పటికే కంగనా బోలె డన్ని విమర్శలు ఎదుర్కొంటోంది. దీనికి తోడు ఈ సినిమా కథాంశంతోనే మరో సినిమా బాలీవుడ్‌లో రూపొందుతోంది. ఈ సినిమాను క్రిష్ కన్నా ముందే ప్రారంభించారు. క్రిష్ తన సినిమా అనౌన్స్ చేయగానే స్పీడు పెంచి 'మణికర్ణిక' కన్నా ముందు విడుదలకు ప్లాన్ చేస్తున్నారట ఆ సినిమా దర్శకనిర్మాతలు! ఓ పక్క కంగనా ఇష్యూ, మరో పక్క తన సినిమాలాంటి సినిమానే మరొకటి ముందుగా వస్తే తన సినిమాను ఎవరు చూస్తారు? అన్నది క్రిష్ సందేహమట! టాలీవుడ్‌లో ఎందరు నిర్మాతలు వెంటపడినా కన్నెత్తి చూడకుండా బాలీవుడ్‌కి వచ్చినందుకు ఇప్పుడు క్రిష్ బాధపడుతున్నాడు అంటున్నారు అతని సన్నిహి తులు. కాకపోతే క్రిష్ టాలెంట్ మీద తమకు నమ్మకం ఉందనీ, ఎన్ని సినిమాలు ముందు వచ్చినా క్రిష్ సినిమా బాలీవుడ్‌లో దుమ్మురేపడం ఖాయమనీ వారు ధీమా వ్యక్తం చేస్తున్నారు.



## నేనా....డైరెక్షనా?



నేనా...హీరోయిన్‌గానా? అన్నట్టు ఉంది నిత్య డైలాగు అంటున్నారు సినీ జనాలు. ఇటీవలి కాలంలో నిత్య సినిమాల్లో కనిపించడం లేదు. ఈ మధ్య కాలంలో ఆమె డైరెక్షన్ మీద మనసు పెట్టిందనీ, కొన్ని కథలు కూడా వింటోందనీ అన్నారు. అయితే అవన్నీ గాలి కబుర్లేనట! తనకు దర్శ కత్వం అంటే ఇష్టమున్నా, దర్శకురా లిగా మారే ఆలోచన ఇప్పట్లో లేదట! కథలు వింటూ కాలక్షేపం చేస్తున్నా నని కహానీలు వినిపిస్తోంది. అయితే నిత్య ఏ సినిమానూ అంత త్వరగా ఒప్పుకోదు కనుక ఆమె చెప్పే మాటలు నిజమే కావచ్చు అన్న వారూ లేకపోలేదు.

## వ్యాపారంలోకి డార్లింగ్ హీరోయిన్!

డార్లింగ్ అంటే ఎవరో అర్థమైపోయే ఉంటుంది. ఇంకెవరు..? ప్రపంచవ్యాప్తంగా అందరి దృష్టిని తన వైపు తిప్పుకున్న ప్రభాస్! ఇంతకీ ఎవరా హీరోయిన్? అన్న అను మానం వస్తోందా.....? 'మిర్చి' సినిమాలో ప్రభాస్‌తో నటించిన రిచా గంగో పాధ్యాయ గుర్తుందా? గత కొన్ని సంవ త్సరాలుగా మన దేశంలోనే లేకుండాపో యింది ఈ హీరోయిన్. చదువు కోసం అమెరికా వెళ్ళిన రిచా అక్కడ యూని వర్సిటీ నుంచి ఎంబీఏ పట్టా తీసుకుంది. ఇప్పుడు తన చదువుకు తగిన వ్యాపారంలో స్థిరపడాలని ఆలోచిస్తోందట! మరో పక్క తిరిగి సినిమాల్లోకి వెడితే ఎలా ఉంటుందన్నది రిచా ఆలోచన అని అంటున్నారు కొందరు.





# అది నా గొప్ప కాదు

## -ప్రియాంక చోప్రా

**రోమ్‌లో ఉన్నప్పుడు రోమన్‌లాగే ఉండాలన్న సూక్తిని నూటికి నూరుపాళ్ళూ పాటించేస్తోంది బాలీవుడ్ భామ ప్రియాంకా చోప్రా. బాలీవుడ్‌లో టాప్ హీరోయిన్ స్థాయికి చేరుకుని ఆ తరువాత హాలీవుడ్‌లో పాదం మోపింది ప్రియాంక. ఇక్కడ ఉన్నప్పుడు కొద్దిగా పద్ధతిగా ఉన్నట్టు కనిపించినా, హాలీవుడ్‌కి వెళ్ళిన తరువాత బికినీలో అదరగొట్టేస్తోంది. అంతేకాకుండా తన బికినీ ఫొటోలు సోషల్ మీడియాలో పెట్టేస్తోంది. అదేమంటే వాతావరణం బాగుంటే బికినీ వేసుకోవాలనిపిస్తుంది అంటున్న ప్రియాంకతో....**

**'బేవాచ్' విడుదల సందర్భంగా ఒత్తిడికి లోనయ్యారా?**

ఈ సినిమా నాకు మొదటి సినిమా కాదు. గత కొన్ని సంవత్సరాలుగా నటిస్తూనే ఉన్నాను. హాలీవుడ్‌లో నా మొదటి సినిమా కావడంతో చాలామంది ఇలాంటి ప్రశ్నలే అడుగుతున్నారు. అందరూ అనుకుంటున్నట్టుగా నా మీద ఎలాంటి ఒత్తిడీ లేదు. నేను నా శక్తిని నమ్ముకుని సినిమాలు చేశాను... చేస్తున్నాను. నా కెరీర్ మొత్తంలో నేను ఎవరిమీదా ఆధారపడలేదు. సక్సెస్‌ను ఎలా ఎంజాయ్ చేశానో, ఫ్లాప్‌నీ అలాగే తీసుకుంటాను. ఒక సినిమా ఫ్లాప్ అయితే చాలా విషయాలు నేర్చుకునే అవకాశం ఉంటుంది. ఇక్కడికి వచ్చిన తరువాత చాలా విషయాలు నేర్చుకున్నాను. ఈ రోజు ఈ స్థాయికి చేరుకోవడానికి అదే కారణం. ఈ సినిమా జయాపజయాల గురించి పక్కన పెడితే ఈ సినిమాలో నా నటనకి మంచి మార్కులే పడ్డాయి. బాగా చేశావని చాలామంది ప్రశంసిస్తున్నారు.

**ఈ సినిమాలో బికినీ సన్నివేశాలు కొద్దిగా ఎక్కువైయినట్టున్నాయి?**

బికినీ నాకేమీ కొత్తకాదే! గతంలో బాలీవుడ్‌లో కొన్ని సినిమాల్లో బికినీలో కనిపించాను, ఇపుడు ఈ సినిమాలోనూ వేసుకున్నాను. తెర మీద వాటిని వేసుకోవాలంటే సిగ్గుగా అనిపించదు కానీ, బాహాటంగా బీచ్‌లో తిరగాలంటే సిగ్గుగా ఉంటుంది. ఆ ఫీలింగ్ ఏమిటో నాకు ఇప్పటికీ అర్థం కాదు.

**అందరూ చూస్తున్నారని భయమా?**

అది పూర్తిగా నిజం కాదు. వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటే చుట్టూ ఉన్నవారి గురించి పట్టించుకోం. అలాంటి వాతావరణం నాకు ఇంత వరకూ ఎదురుకాలేదు.

**తొలి సినిమాలోనే నెగెటివ్ రోల్ చేయడానికి కారణం?**

ఇక్కడ మనకు అలాంటి ఫీలింగ్స్ ఉంటాయి కానీ, హాలీవుడ్‌లో పాజిటివ్, నెగెటివ్ అన్న ఫీలింగ్స్ ఉండవు. నా పాత్రకీ, నా నటనకీ మంచి మార్కులే పడ్డాయి. అదే సంతోషంగా ఉంది. ఈ సినిమాలో నా క్యారెక్టర్ వినగానే వెంటనే ఒప్పుకున్నాను. పేరుకి నెగెటివ్ రోల్ కానీ, నటనకు అవకాశం ఉన్న పాత్ర అది. నిజానికి 'క్వాంటికో' సిరీస్ తరువాత నాకు చాలా ఆఫర్లు వచ్చాయి. అవేవీ నాకు నచ్చలేదు. నచ్చిన పాత్ర వస్తేనే చేద్దామని ఆగిపోయాను. నేను ఎలాంటి పాత్ర గురించి వెయిట్ చేస్తున్నానో సరిగ్గా అలాంటి క్యారెక్టర్ నాకు 'బేవాచ్'లో దొరికింది. గతంలో బాలీవుడ్‌లో ఇలాంటి క్యారెక్టర్లు రెండు మూడు సినిమాల్లో చేశాను. అవి నాకు అంత పేరును తీసుకురాలేదు. ఇక్కడ ఓ విషయం స్పష్టం చేయాలి. భారతీయ సినిమాల్లో హీరోయిన్‌కి యాక్షన్ సన్నివేశాలు కానీ, నటన కనబరిచే అవకాశం కానీ తక్కువగా ఉంటుంది. హీరోయిన్‌ని పాటలు, డ్యాన్సులకే పరిమితం చేస్తారు. హాలీవుడ్‌లో ఈ పరిస్థితి లేదు.

**ఈ సినిమాలో మీరు చేసిన పాత్రను మేల్ ఆర్టిస్ట్‌తో చేయించాలనుకున్నారట?**

నిజమే! ఈ పాత్రను ముందు ఓ పెద్ద నటుడితో చేయించాలని అనుకున్నారు. కానీ మేల్ కన్నా ఫిమేల్ ఆర్టిస్ట్‌తో చేయించాలని భావించారు. దానికి అనుగుణంగా కథలో కొద్దిపాటి మార్పులు చేర్పులు చేశారట!

**'బేవాచ్' తరువాత మరో హాలీవుడ్ సినిమా అంగీకరించారా?**

ఓ సినిమా ఒప్పుకున్నాను. దాని షూటింగ్ ఇంకా మొదలుకాలేదు.

**ఇక్కడ నుంచి హాలీవుడ్‌కి వెళ్ళిన మిగతా నటీనటులతో పోల్చుకుంటే మీకే అవకాశాలు ఎక్కువ అంటున్నారు. ఎందుకలా?**

కష్టపడితేనే ఎవరికైనా, ఎక్కడైనా అవకాశాలు వస్తాయి. ఈ మాటలు నాదాకా వచ్చాయి కూడా! ప్రతి హీరోయిన్‌కీ పిఆర్ టీం ఉంటుంది. ఈ టీం వలన కొన్ని అవకాశాలు మాత్రమే వస్తాయి. వచ్చిన వాటిని నిలబెట్టుకుంటూ, మన ప్రతిభను నిరూపించుకోవాల్సింది మనమే! ఇక మిగతా వారితో నన్ను పోలుస్తున్నారు. వారి గురించి నాకు తెలియదు. నాకు తెలిసిందల్లా కష్టపడి పనిచేయడం ఒక్కటే! ఆ తత్త్వమే నన్ను ఈ స్థాయికి తీసుకొచ్చింది. ఎంతో కొంత



**'క్వాంటికో 3' సిరీస్ చేసే అవకాశం ఉందా?**

క్వాంటికో సిరీస్ ఉంటుందో లేదో నాకు తెలియదు. ఒకవేళ ఉన్నా నేను చేస్తానో లేదో అంతకన్నా తెలియదు. ప్రస్తుతం బాలీవుడ్‌లో నేను అంగీకరించిన సినిమాలు ఉన్నాయి. ముందు వాటిని పూర్తి చేయాలి. ఆ తరువాతే 'క్వాంటికో 3' గురించి ఆలోచిస్తాను.

పేరు వచ్చాక మనం ఎలా నటించినా ఏం చేసినా ప్రేక్షకులు చూస్తారు. ఎలాంటి సినిమాలు చేసినా ఫర్వాలేదు అనుకుంటే మన సక్సెస్ రేట్ పడిపోయినట్టే!

**హాలీవుడ్‌లో భాష ఇబ్బంది పెట్టలేదా?**

ఇబ్బంది అని కాదు. యాసతోనే ఇబ్బంది పడ్డాను. మనం కొన్ని అక్షరాలు వత్తి పలుకుతాం. అక్కడ ఉండదు. 'క్వాంటికో'లో నటించే సమయంలో ఈ ఇబ్బంది ఎదురైంది. అక్కడివారు ఎంతో ఓపికగా సరిదిద్దేవారు. 'బేవాచ్'లో ఆ ఇబ్బందిని కొద్దిగా అధిగమించాను.

**హాలీవుడ్‌కి వెళ్ళిన తరువాత ప్రియాంకలో మార్పు వచ్చింది అంటున్నారు. ఎంతవరకు నిజం?**

నాలో ఏ మార్పు రాలేదు. బాలీవుడ్‌లో ఉన్నప్పుడు ఎలా ఉన్నానో ఇప్పుడూ అలాగే ఉన్నాను. ఈ విషయం ఇక్కడ నాతో పనిచేసే వారందరికీ తెలుసు.

**అంతర్జాతీయ డిజైనర్ల దుస్తులకే ప్రాధాన్యం ఇస్తున్నారట?**

మన డిజైనర్లకే నా మొదటి ప్రాధాన్యం. ఆ తరువాతే అంతర్జాతీయ డిజైనర్లు. నేనే కాదు. బాలీవుడ్ హీరోయిన్లలో చాలామంది ముందు మన వారికే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. హీరోయిన్ అన్న తరువాత రకరకాల ఈవెంట్లలో పాల్గొనవలసి వస్తుంది. అలాంటి సందర్భాలలో కొన్నిసార్లు మన డిజైనర్లు రూపొందించిన డిజైన్లు కాకుండా అంతర్జాతీయ డిజైనర్లు రూపొందించిన డిజైన్ల మీద ఆధారపడతాను. దానికే నేను మన డిజైనర్లను పట్టించుకోవడం లేదు అనడం ఎంతవరకూ సబబు? నేను ఒక్కదాన్నే కాదు అంతర్జాతీయ వేదికల మీద సోనమ్, దీపిక, అనుష్క ఇలా చాలామంది హీరోయిన్లు అంతర్జాతీయ డిజైనర్లు రూపొందించిన దుస్తులనే ధరిస్తున్నారు. వారి విషయంలో లేని అభ్యంతరం నా విషయంలో ఎందుకు వస్తోంది?

**నటించడం కష్టమా?**
**సినిమాలు నిర్మించడం కష్టమా?**

రెండూ కష్టమైన పనులే! రెండు పనులూ ప్రేక్షకుల అభిరుచిని దృష్టిలో పెట్టుకుని చేయాల్సినవే! నటిగా నాకు కొన్ని పరిమితులు ఉండవచ్చు. నిర్మాతగా అలాంటి పరిమితులు తక్కువగా ఉంటాయి. నా మనసుకు నచ్చిన సినిమాలు అన్ని భాషలలో నిర్మిస్తున్నాను. అందులో కొన్ని మంచి విజయాన్ని సొంతం చేసుకున్నాయి.

**అన్ని భాషలలో అంటున్నారు...దక్షిణాది భాషలలో కూడా సినిమాలు నిర్మిస్తారా?**

అవకాశం ఉంటే తప్పకుండా నిర్మిస్తాను. ప్రస్తుతానికి ఆ ఆలోచన లేదు.

**కొత్త అవార్డు ఒకటి మీకోసమే సృష్టించారట, నిజమేనా?**

కొత్త అవార్డు కాదు. కొత్త కేటగిరి. అత్యంత ప్రతిష్ఠాత్మకమైన దాదాసాహెబ్ ఫాల్కే అవార్డులో 'అంతర్జాతీయ సెక్షన్' అని ఒక విభాగాన్ని పెట్టారు. ఆ కేటగిరీ కింద నా పేరు నామినేట్ అయింది. అంతే తప్ప నాకంటే గొప్పవాళ్ళు లేరని ఆ అవార్డు నా కోసమే సృష్టించలేదు. ప్రతి సంవత్సరం అర్హులైన వారికి ఈ అవార్డు ఇస్తారు. అందులో నా గొప్పతనమేమీ లేదు.

**పెళ్ళెప్పుడు?**

ఇక్కడే ఇలాంటి ప్రశ్నలు తరచూ ఎదురవుతూ ఉంటాయి. నాకేమీ వయస్సు అయిపోలేదు. బాలీవుడ్‌లో చాలా క్యారెక్టర్లు చేసేశాను. హాలీవుడ్‌లో చేయాల్సినవి ఉన్నాయి. వాటి తరువాతే పెళ్ళి గురించి ఆలోచిస్తాను. దానికి ఇంకా సమయముంది.

—స్పందన రెడ్డి

**బాలీవుడ్‌లో మరో బయోపిక్‌లో నటించబోతున్నారట?**

'మేరీకోమ్' తరువాత అలాంటి బయోపిక్ మరొకటి చేయాలని అనుకునే దాన్ని. ఇప్పటికి నా కోరిక నెరవేరింది. 'కల్పనాచావ్లా' జీవితకథ ఆధారంగా తెరకెక్కబోతున్న సినిమాలో లీడ్ రోల్ చేయబోతున్నా. ఈ సినిమా ద్వారా కొత్త మహిళా దర్శకురాలు పరిచయం కాబోతున్నారు. 'మేరీకోమ్' నాకు ఎంత పేరు తీసుకు వచ్చిందో ఈ సినిమా కూడా అంతే పేరు తెస్తుందన్న నమ్మకం నాకుంది.



ఇంటర్వ్యూ

# తెలుగు తెర ప్రతిష్ఠ రాజమౌళి ఘనతే!

-బెనర్జీ

**మంచి నటుడుగా గుర్తింపు తెచ్చుకున్నారు బెనర్జీ. మూడున్నర దశాబ్దాలుగా సహదర్శకుడు, నిర్మాత, నటుడుగా బహుముఖంగా రాణించిన 300 చిత్రాల నటుడు. తెలుగు చిత్ర పరిశ్రమను హాలీవుడ్ స్థాయికి తీసుకెళ్ళిన ప్రతిష్ఠ రాజమౌళి ఘనతే అంటున్న బెనర్జీ ఇంటర్వ్యూ....**

మా నాన్నగారు రాఘవయ్య. అమ్మ సుశీల. నేను విజయవాడలో పుట్టాను. ఆరవ తరగతి వరకు నా చదువంతా ఢిల్లీలోనే. హైస్కూలు చదువు విజయవాడ చిల్డ్రన్స్ మాంటిస్సోరిలో, డిగ్రీ గుంటూరు ఎ.సి. కాలేజీలో పూర్తి చేశాను.

### ప్రేరణ

ఢిల్లీ సప్రూహౌస్ ఆడిటోరియంలో ప్రతి ఆదివారం సినిమాలు ప్రదర్శించేవారు. రెగ్యులర్‌గా ఆ సినిమాలు చూసేవాణ్ణి. సౌండ్ ఆఫ్ మ్యూజిక్, మెకన్నాస్‌గోల్డ్, బెన్‌హర్, వేర్ ఈగల్స్ డేర్, డా.జివాగో, సెవెన్‌టైమ్స్ సెవెన్ లాంటి అద్భుతమైన చిత్రాలు అక్కడ నేను చూస్తూ ఉండేవాణ్ణి. మనమూ సినిమా తీస్తే బాగుంటుంది కదా అనిపించేది. ఒక బలమైన ఎయిమ్ లేదుగానీ ఆ తపన మాత్రం నాలో ఉండేది.

### మంచి కల్చర్

నాకు జన్మనిచ్చిన ఆ భగవంతుడు నాకు ఏ గోల్ నిర్దేశించలేదు. నా తల్లిదండ్రులు నన్ను మంచి వాతావరణంలో పెంచారు. మంచి సంస్కారం, మంచి సంస్కృతి రెంటినీ ఇచ్చారు. జీవితంలో అన్ని పనులూ క్రమశిక్షణతో చేస్తూ వచ్చాను. ఆ రోజుల్లో ఎక్కువమంది బ్యాంక్ జాబ్ ప్రిఫర్ చేసేవారు. నాన్నగారికి కూడా అలాంటి కోరిక ఉండేది నా విషయంలో. ప్రయత్నం చేస్తే ఏదో ఒక మంచి ఉద్యోగం నాక్కూడా తప్పకుండా వచ్చేది. కానీ ఉద్యోగం చెయ్యాలనే కోరిక నాకు ఉండేదికాదు. సినిమా ఇండస్ట్రీలో చేరాలనే కోరిక ఎక్కడో నాలో ఉండేది. బాల్యంలో నేను చూసిన ఇంగ్లీషు చిత్రాల ప్రభావమే దానికి కారణం.

### సహదర్శకునిగా

1980లో ఒక శుభదినాన మా నాన్నగారు నన్ను ప్రముఖ కెమెరామెన్ వి.ఎస్.ఆర్.స్వామిగారి దగ్గరకు తీసుకెళ్ళారు. ఆ సమయంలో ఆయన ఇంట్లో లేరు. కానీ ఇక్కడ ఒక చిన్న విషయం చెప్పాలి. ఆ రోజు ఎలాగైనా ఒక కెమేరామెన్, ఒక దర్శకుడు లేదా ఒక నిర్మాత దగ్గరకు వెళ్ళాలని బలంగా నిర్ణయించుకుని బయలుదేరాం. మొదట స్వామిగారి ఇంటికి వెళ్ళాం. ఆయన లేకపోవడంతో ప్రముఖ దర్శకుడు యు.విశ్వేశ్వరరావుగారి దగ్గరకు తీసుకెళ్ళారు నాన్నగారు. మా వాడు సినిమా దర్శకుడు కావాలనుకుంటున్నాడు, మీ దగ్గర అసిస్టెంట్ డైరెక్టర్‌గా తీసుకోండి అని అడిగారు. 'ఓ దాందేముంది, ఈరోజే వచ్చేయమనండి' అని ఆయన అనడం, ఆ రోజే నేను ఆయన దగ్గర అసిస్టెంట్ డైరెక్టర్‌గా చేరడం ఒకేసారి జరిగిపోయాయి.

### హరిశ్చంద్రుడు

ఆ సమయంలో విశ్వేశ్వరరావుగారు 'హరిశ్చంద్రుడు' సినిమా నిర్మాణ సన్నాహాల్లో ఉన్నారు. బహుశా సావిత్రిగారి చివరి చిత్రం అదే అనుకుంటాను. విశ్వేశ్వరరావుగారు దర్శకుడే కాదు, నిర్మాత కూడా. ఆయన దగ్గర పనిచేయడం నా అదృష్టం. నేను పనిచేసిన మొదటి చిత్రానికే జాతీయ అవార్డు రావడం నాకెంతో సంతోషం కలిగించింది. ప్రభాకరరెడ్డి, సావిత్రి, జయచిత్ర నటించిన ఈ చిత్రం నా సినీ కెరీర్‌లో ఒక మైలురాయి.

### నటదిగ్గజాల చిత్రాలకు సహదర్శకునిగా

ప్రముఖ దర్శకుడు తాతినేని రామారావుగారి దగ్గర సహదర్శకునిగా చేరాను. జితేంద్ర, రేఖలతో ఆయన తీసిన హిందీ చిత్రం 'ఏక్ హి భూల్' 1981లో విడుదలై ఎంతో విజయవంతంగా ప్రదర్శితమైంది. నేను అడుగుపెట్టిన వేళావిశేషం అని రామారావుగారు నన్ను కొనియాడటం నేను మరువలేను.

ఇలా లక్ష్మీ ప్రొడక్షన్స్ బ్యానర్‌పై నిర్మించిన వీరి చిత్రాలు 'అంధాఖానూన్', జాన్ జానీ జనార్ధన్, మైన్ ఇంతెకామ్ లూంగా...ఇలా అమితాబ్ బచ్చన్, రజనీకాంత్, ధర్మేంద్ర, జితేంద్ర లాంటి నటదిగ్గజాల చిత్రాలకు సహదర్శకునిగా పని చేశాను.

### నటుడుగా తొలిచిత్రం 'న్యాయం మీరే చెప్పాలి'

నేను సహదర్శకునిగా, దర్శకునిగా ఉన్నప్పుడు చాలా మోడ్రన్‌గా ఉండేవాణ్ణి. గడ్డం, టీషర్టులు, లేటెస్ట్ జీన్స్‌లో ఉండేవాణ్ణి. గుళ్ళపల్లి రామ్మోహన్‌రావుగారు నన్ను చూసి, 'చూస్తే హీరోలా నానాపాటేకర్‌లా ఉన్నావు, నా చిత్రం 'న్యాయం మీరే చెప్పాలి'లో విలన్‌పాత్ర ఇస్తాను, చేస్తావా' అని అడిగారు. వెంటనే ఒప్పుకున్నాను. ఆ విధంగా నటుడిగా తెలుగు చిత్రరంగంలో ప్రవేశించాను.

హిందీలో సూపర్‌హిట్ చిత్రం 'ఆజ్ కా ఆవాజ్' చిత్రాన్ని తెలుగులో 'న్యాయం మీరే చెప్పాలి' అనే టైటిల్‌తో తీశారు. ఆజ్ కా ఆవాజ్‌లో రాజ్‌బబ్బర్,

స్మితాపాటిల్ నటించారు. నానాపాటేకర్ పాత్ర తెలుగులో నేను చేశాను. తెలుగులో జి.రామ్మోహన రావు దర్శకత్వంలో 1985లో విడుదలై సూపర్‌హిట్ కావడం, నా పాత్రకు మంచి పేరు రావడంతో నటుడుగా నా కెరీర్‌కు ప్లస్ పాయింట్ అయింది. కన్నడంలో 'మహాత్మా'గా తీసిన ఈ చిత్రంలో సాయికుమార్ హీరో.

తమిళంలో 'నాన్‌సిగప్పు మనిదన్'గా తీశారు. తమిళ చిత్రంలో కూడా నేను నటించాను. అన్ని భాషల్లోనూ ఈ చిత్రం వందరోజులు పైగా ఆడింది. ఇందులో సత్యరాజ్ నాకు మేనల్లుడుగా నటించారు. ఈ రోజు ఆయనే కట్టప్పగా పేరు ప్రతిష్ఠలు సంపాదించారు. ముఖ్య విశేషం ఏమిటంటే, చార్లెస్ బ్రోన్‌సన్ హీరోగా నటించిన ఆంగ్ల చిత్రం 'డెత్‌విష్' నే హిందీలోకి ఆజ్‌కా ఆవాజ్‌గా తీశారు.

## నిర్మాతగా

నిర్మాతగా నా చిత్రం 'ధర్మయుద్ధం'. ప్రముఖ రచయిత మల్లాది వెంకటకృష్ణమూర్తి నాకు బాగా మిత్రులు. పూర్ణచంద్రరావుగారు స్వంత సినిమాకు దర్శకత్వం వహించమని ప్రోత్సహించడంతో మల్లాదిగారి నవల తీసుకున్నాను. భానుచందర్ హీరో. సీనియర్ దర్శకుడు నందకుమార్ ముఖ్యదర్శకత్వం వహించారు. నాది సహదర్శకత్వం. నేను మరో ఇద్దరు కలిసి నిర్మాతలుగా వ్యవహరించాం. 1986లో విడుదలైన ఈ చిత్రం విజయవంతంగా ఆడింది. మరో సినిమా తీద్దాం అనుకునేలోపు నాకు నటుడుగా మంచి ఆఫర్లు రావడం ఆరంభమైంది. అంటే విలన్ వేషాలు రావడం మొదలైంది.

నల్లతాచు, రాక్షస సంహారం చిత్రాలకు కూడా సహదర్శకునిగా వ్యవహరించాను. ఆ చిత్రాల్లో నటించాను కూడా. ఒక మలయాళ హిట్ చిత్రం తీసుకుని రాజేంద్రప్రసాద్‌గారితో 'మాస్టారి కాపురం' తెలుగులో నేనే నిర్మించాను. అందులో నటించాను కూడా. చాలా చిత్రాల్లో విలన్‌గా నటించాను. అలా చేశాక మళ్ళీ ఒక సినిమా నిర్మించాలని అనిపించి 1995లో శ్రీకాంత్ హీరోగా శివనాగేశ్వరరావుగారి దర్శకత్వంలో 'వన్స్‌మోర్' చిత్రం నిర్మించాను. సినిమా విడుదల సమయంలో ఏవో గొడవలు, సమ్మె రావడంతో ఎక్కువ రోజులు ఆడలేదు. ఇక దాంతో నిర్మాతగా నేను అన్‌ఫిట్ అనిపించి పూర్తిగా నటనకే పరిమితమై జీవనయాత్ర సాగిస్తూ వచ్చాను.

నేను ఎన్నో పాత్రలు చేశాను. అవన్నీ ప్రేక్షకులు మెచ్చినవే. అప్పట్లో మాఫియా, డాన్ పాత్రల్లో నా నటన ప్రత్యేకంగా ఉండేదని దర్శకులు ప్రశంసించేవారు.

## హైదరాబాద్‌కి

కృష్ణవంశీగారి చిత్రం 'గులాబీ'లో పోలీస్ ఆఫీసర్‌గా చేశాను. రాంగోపాల్‌వర్మ ప్రొడ్యూస్ చేశారు. రాంగోపాల్‌వర్మగారి 'గాయం–1'లో నన్ను మెయిన్ క్యారెక్టర్‌గా ఎన్నుకున్నారు. విజయవాడలో జరిగిన ఒక యదార్థగాథ ఈ చిత్రం. ఉదయ్‌కిరణ్ నటించిన రామోజీరావుగారి 'చిత్రం' లో హీరోయిన్ మేనమామగా మంచి గుర్తింపు నిచ్చిన పాత్ర చేశాను. 'నువ్వు నేను'లో నేను చేసిన కిల్లర్ పాత్ర బాగా హైలైట్ అయింది. శతదినోత్సవం సందర్భంగా వాల్‌పోస్టర్స్‌పై కూడా తేజగారు శ్రద్ధ తీసుకుని నా పాత్రను హైలైట్ చేయించడం నాకెంతో కలిసొచ్చింది. నా మంచితనమో, దర్శకుల మంచితనమో, ప్రేక్షకుల ఆదరణోగానీ మొత్తానికి పరిశ్రమలో నేను నిలదొక్కుకున్నాను.

## ఇండియన్ మూవీ అంటే 'టాలీవుడ్'

బాహుబలితో రాజమౌళిగారు ఇండస్ట్రీని మలుపు తిప్పారు. తెలుగు చిత్రాన్ని ప్రపంచస్థాయికి తీసుకెళ్ళిన ఘనత ఆయనకే దక్కింది. అమెరికన్ న్యూస్ ఛానల్స్ నేను చూశాను. వారు ఏం చెబుతున్నారంటే, 'ఇండియన్ మూవీ అంటే బాలీవుడ్ సినిమా అనుకున్నాం. ఈరోజు బాహుబలి వచ్చింది, ఇండియన్ మూవీస్ అంటే కేవలం బాలీవుడ్ మాత్రమే కాదు, టాలీవుడ్ సినిమా మేడ్ ఇన్ హైదరాబాద్' అని క్లియర్‌గా చెబుతున్నారు. అందువల్ల ఫస్ట్‌టైమ్ హాలీవుడ్ స్థాయిలో తెలుగు పరిశ్రమకు పేరు వచ్చిందంటే అది రాజమౌళి 'బాహుబలి' ఘనతే.

## చిన్న సినిమాలు పుంజుకున్నాయి

ఆ మధ్య సినిమా ఫ్లాపులు కామన్ అయిపోయి, సినిమాలు ఆడక అవస్థలపాలై అన్నీ అమ్ముకున్న నిర్మాతలు ఎంతోమంది ఉన్నారు. కానీ బాహుబలి వచ్చాక రెవెన్యూలు ప్రతి సినిమాకీ బాగా పెరిగాయి. బాహుబలి–2తో సినిమాకు ఆదరణ విపరీతంగా పెరిగింది. చిన్న సినిమాలు కూడా బాగా పుంజుకుని సూపర్‌హిట్ అవుతున్నాయి. తెలుగు పరిశ్రమలో ఇది ఒక మంచి పరిణామానికి దారితీసిందనే చెప్పాలి. ఇండియన్ సినిమా తప్పకుండా ఏదో ఒకరోజు 1000 కోట్లు దాటుతుందని నేను రెండేళ్ళ క్రితం ప్రెస్‌లో చెప్పాను. లక్కీగా అది టాలీవుడ్ సినిమా కావడం మనందరి అదృష్టం. ఇన్ని వందలకోట్లు బాహుబలి–2 ఆర్జించడం మనకు గర్వకారణం.





## సీరియల్స్

ఇరవైయేళ్ళ క్రితం టీవీసీరియల్స్‌లో చేశాను. యండమూరిగారి తులసీదళంలో మెయిన్ హీరో నేనే. అది సూపర్‌హిట్ సీరియల్. తర్వాత ఐదేళ్ళ క్రితం ఒక సీరియల్ చేశాను, అంతే. తగిన పాత్రలు వస్తే తప్పకుండా సీరియల్స్‌లో నటిస్తాను.

నాగచైతన్య, రకుల్ 'రారండోయ్ వేడుకచూద్దాం' లో చేశాను. గీతా ఆర్ట్స్ ప్రభాకర్ దర్శకత్వంలో ఒక చిత్రం, భవ్య క్రియేషన్స్ వారి శమంతకమణి, శ్రీరామ్ దర్శకత్వంలో ఒక చిత్రం, అమ్మ రాజశేఖర్ దర్శకత్వంలో జె.డి.చక్రవర్తి చిత్రం, మరో ఇద్దరు ముగ్గురు కొత్త దర్శకుల చిత్రాలు చేస్తున్నాను. జనతా గ్యారేజ్, మిస్టర్ సినిమాల్లో మంచి గుర్తింపు వచ్చింది. అందరితో కలుపుగోలుగా ఉంటూ ముందుకు సాగిపోతున్నాను.

ఇండస్ట్రీలో ఎందరో గొప్ప నటులకు అవకాశాలు రాక ఎంతో కష్టపడుతున్నారు. వాళ్ళందరికీ మంచి భవిష్యత్తు ఉండాలని మనసారా కోరుకుంటున్నాను.

## ఆ రోజుల్లో...

ఆ రోజుల్లో నటులు, దర్శకులు, సంగీత దర్శకులు ఎవరైనా సబ్జెక్టుపై మంచి అవగాహనతో ఉండేవారు. కె.వి.రెడ్డి, ఆదుర్తి సుబ్బారావు, నాగిరెడ్డి, చక్రపాణి, కమలాకర కామేశ్వరరావుగారు లాంటి మహామహులెందరో ఉండేవారు. ఎంతో ఉన్నత భావాలున్న దర్శక నిర్మాతలుండేవారు. ఆ చిత్రాలు ఎప్పటికీ మరువలేనివి. ఇప్పుడు మళ్ళీ రాజమౌళి ప్రపంచస్థాయిలో తెలుగు పరిశ్రమను హైరేంజ్‌లోకి తీసుకెళ్ళారు.

–కె.హరనాథ్

సెల్: 97035 42598

# ఇవన్నీ నిజాలే!

### అదీ గొప్ప

- కూచిపూడి నాట్యంలో ప్రపంచకీర్తిని ఆర్జించారు ఆదిలాబాద్ జిల్లాకు చెందిన రాజారెడ్డి, రాధారెడ్డి. క్యూబా దేశాధ్యక్షుడు ఫైడల్ కాస్ట్రో 70వ దశకంలో వీరి నాట్యం చూసి ముగ్ధుడై నాటి ప్రధాని ఇందిరాగాంధీకి లేఖరాయడంతో ప్రభుత్వం ఈ జంటకు పద్మశ్రీ ప్రకటించింది. మీకు పద్మశ్రీ ఎలా వచ్చిందో తెలుసా? అని ఇందిరా గాంధీ స్వయంగా ఈ విషయం రాజారెడ్డి దంపతులకు వివరించారు.
- దుబాయ్‌లో బంగారు కడ్డీలను ఎటిఎంల నుండి డ్రా చేసుకోవచ్చు!
- హేలీ తోకచుక్క 2062లో కనిపిస్తుంది. ఈ తోకచుక్క సూర్యుడు చుట్టూ దీర్ఘవృత్తాకార కక్ష్యలో ప్రయాణిస్తుందని బ్రిటన్‌కు చెందిన ఎడ్మండ్ హేలీ కనుగొన్నాడు.
- ఎడ్మండ్ హేలీ ఖగోళ పరిశోధనలకే జీవితం అంకితం చేశాడు. అబ్జర్వేటరీలో పరిశోధన చేస్తూనే ఆయన 1742లో మరణించాడు.
- రాణి చీమ 30 ఏళ్ళు బతుకుతుంది. జీవితకాలంలో అది లక్షలాది గుడ్లు పెడుతుంది.
- 1525–1866 మధ్యకాలంలో దాదాపు కోటీ 25 లక్షలమంది నీగ్రోలను కిడ్నాప్‌చేసి యునైటెడ్ స్టేట్స్, కరీబియన్, దక్షిణ అమెరికా దేశాల్లో బానిసలుగా విక్రయించారు. 340 ఏళ్ళ పాటు ఇలా కొనసాగింది.
- 19వ శతాబ్దంలో పిల్లలకోసం ఉపయోగించిన పాపులర్ సిరప్ పేరు 'మిసెస్ విన్స్లో సూథింగ్ సిరప్'. ఈ సిరప్‌లో మార్ఫిన్ కూడా ఒక మిశ్రమ పదార్థంగా ఉండేది.
- కుటుంబ సభ్యుల్లో ఎవరినైనా చంపే చట్టపరమైన అధికారం రోమన్ సామ్రాజ్యం ఏర్పడిన ఆరంభకాలంలో తండ్రులకు ఉండేది.
- నాలుగేళ్ళ వయసుగల సగటు తెలివైన పిల్లాడు లోకాన్ని అర్థం చేసుకోవడానికి రోజుకు కనీసం 400 ప్రశ్నలు అడుగుతాడు.
- 160 ఏళ్ళ క్రితం పొటాటో ఫామిన్ వచ్చినప్పటి ఐర్లాండ్ జనాభా కంటే ఇప్పటికీ ఆ దేశంలో 20 లక్షలు తక్కువగానే ఉన్నారు.
- నీటి గుర్రాలు (సీహార్స్) ఏకపత్నీవ్రతం చేస్తాయి. జీవితాంతం అవి ఒకరితోనే జతకడతాయి. అవి తమ తోకల్ని ముడివేసుకుని ప్రయాణిస్తూ ఉంటాయి.
- ఉత్తర అమెరికాలోని హోండూరాస్ దేశంలో ఉన్న యోరో నగరంలో ప్రతి వర్షాకాలంలోనూ చేపలవర్షం కురుస్తుంది. వందలాది చేపలు పైనుంచి పడతాయి. చేపలవర్షం అక్కడ సహజసిద్ధమైన దిగా చలామణి అవుతోంది.

### చాకరు!

- చాకిరీ చేసే రోబోను చాకరు అంటారు. రూపాయి ఖర్చు లేకుండా, సెలవులు అడగకుండా ధర్నాలు, డిమాండ్లు చేయకుండా చాకిరీ చేసేదే రోబో.
- ఒకవేళ మనిషి మెదడే గనుక కంప్యూటరై ఉండి వుంటే, అది ఒక సెకనుకు 38 వేల ట్రిలియన్ల కార్యక్రమాలు నిర్వహించగలదు.

—చిన్నారి

## సుధామ పదగారడి-317

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ❖ | 3 | 4 | | 5 |
| | ❖ | | ❖ | 6 | ❖ | | ❖ | |
| 7 | | | ❖ | | ❖ | 8 | | |
| | ❖ | ❖ | 9 | | | | ❖ | |
| ❖ | 10 | 11 | ❖ | ❖ | ❖ | 12 | | ❖ |
| 13 | ❖ | 14 | | 15 | | ❖ | ❖ | 16 |
| 17 | | | ❖ | | ❖ | 18 | | |
| | ❖ | | ❖ | | ❖ | | ❖ | |
| 19 | | | | ❖ | 20 | | | |

### ఆధారాలు

**అడ్డం**

1. కృష్ణుని సందర్శించడానికి వెడుతూ కుచేలుడు పట్టుకెళ్ళినవి (4)
3. మంట పెట్టడానికి పేర్చేవి (4)
7. కనిష్ఠభ్రాత (3)
8. మామిడిలో రకాలు.. కొత్తపల్లి కొబ్బరి, పంచదార కలశ వంటివి (3)
9. కాయలేకుండా గుటకాయస్వాహా (4)
10. పిల్లవాడు (2)
12. తోలును కోసే సాధనం (2)
14. గుడిలాంటి బడి మరి! (4)
17. శ్రీశ్రీ అధ్యక్షత వహించిన తీవ్రవాద రచయితల సంఘం (3)
18. కుండ (3)
19. హిందీలో వేదిక (4)
20. అన్నం ఉడికిందీ లేదో తెలియడానికి ఇవి కొన్ని చాలవా? (4)

**నిలువు**

1. అబద్ధం (4)
2. కుమ్మివేయుట (3)
4. మంచుదండ (5)
5. బహువచనం లేని ఉలుకులు (4)
6. పెద్దసుత్తి (3)
11. ఫేస్‌బుక్‌లో ప్రసిద్ధ కవిత్వపు గ్రూపు.. యాఖూబ్! (5)
13. నెక్స్ట్ జనరేషన్ (4)
15. ఉప్పు (3)
16. జడ పొడుగ్గా వున్నట్లు భ్రమకొల్పేవి (4)
18. విన్యాసము, సైనికులు చేసేది (3)

### పదగారడి-316 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 పో | ■ | 2 ఉ | 3 పా | యం | ■ | 4 బ | ■ |
| 5 పో | ట్ల | ము | ■ | సె | ■ | 6 అ | లు | సు |
| ■ | గ | ■ | 7 ని | యం | 8 త | ■ | సో | ■ |
| 9 మ | త్త | 10 గ | జం | ■ | 11 ల | 12 వ | కు | 13 శ |
| క్కా | ■ | ర్వం | ■ | 14 ఐ | ■ | స్త్రం | ■ | స్త్రం |
| ■ | 15 ర | ■ | 16 పై | క | ము | ■ | 17 చం | ■ |
| 18 ఆ | వి | రి | ■ | మ | ■ | 19 ఉ | ద | కం |
| ■ | బిం | ■ | 20 పై | త్య | ము | ■ | మా | ■ |
| 21 పూ | బం | తి | ■ | ము | ■ | 22 ద్యు | మ | ణి |

Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**

**హీ**రోయిన్‌గా రాణించాలంటే అందం, అభినయం ఒక్కటే సరిపోదు. వాటికి అదృష్టం కూడా తోడవ్వాలి. అలాంటి అదృష్టం దర్శకుడు వంశీ రూపంలో మనాలి రాథోడ్ ఇంటి తలుపు తట్టింది. ఈ సినిమాతో తన లక్ మారిపోతుంది అని చెబుతోంది మనాలి రాథోడ్. వంశీగారి దర్శకత్వంలో నటించడం తన కల అనీ, అది ఇంత త్వరలో నెరవేరు తుందని అనుకోలేదనీ అంటున్న మనాలి రాథోడ్‌తో.....

# హద్దులు దాటను

## -మనాలి రాథోడ్



**'ఫ్యాషన్ డిజైనర్ సన్ ఆఫ్ లేడీస్ టైలర్' సినిమాలో అవకాశం ఎలా వచ్చింది?**

ఒకరోజు ఈ సినిమా నిర్మాత శ్రీధర్‌గారు నాకు ఫోన్‌చేసి మామూలు డ్రస్‌లో డైరెక్టర్ వంశీగారికి కనిపించమని చెప్పారు. సినిమాలో ఓ పాత్ర కోసం ఆయన నాతో చెప్పలేదు. ఎందుకు కలవమన్నారో అర్థం కాలేదు. అయినా శ్రీధర్ గారి మాట గౌరవించి ఆయన చెప్పినట్టే వంశీగారి దగ్గరకు వెళ్ళాను. ఆయన నన్ను కొద్దిసేపు పరిశీలనగా చూసి ఈ సినిమాలో అమ్ములు నువ్వే అన్నారు. ఆ మాట విన్న వెంటనే నా ఆనందానికి హద్దులు లేవు. కొద్దిసేపు నోట మాటరాలేదు.

**వంశీగారితో చేయడం గురించి.....**

నేను హైదరాబాద్ అమ్మాయిని. ఈ సినిమా కన్నా ముందు నాలుగు సినిమాలు చేశాను. ఈ రంగంలోకి రాక ముందు నుంచే నేను వంశీగారికి వీరాభిమానిని. ఈ రంగంలోకి వచ్చిన తరువాత ఆయన దర్శకత్వంలో పనిచేయాలని కలలు కనేదాన్ని. ఆ కల ఇంత త్వరగా నెరవేరుతుందని అనుకోలేదు. వంశీగారి సినిమాలో నటించడం అనేది నాకు దక్కిన అరుదైన వరం. ఆయన తన సినిమాల్లో హీరోయిన్ని ఎంత బాగా చూపిస్తారో మాటల్లో చెప్పలేను. ఈ సినిమాలో నేను చేసిన అమ్ములు పాత్ర నుంచి ఇంత వరకూ బయటకు రాలేకపోతున్నానంటే...ఈ సినిమా నా మీద ఎంత ప్రభావం చూపిందో అర్థం చేసుకోండి. వంశీగారితో చేయడం చాలా కష్టం అంటూ చాలా మంది నన్ను ముందు భయపెట్టారు. మొదటి రోజు నేను కూడా అదే ఫీలింగ్‌తో ఉన్నాను. ఒకరోజు గడిచేసరికి అందరూ చెప్పినవి అబద్ధాలని అర్థమైపోయింది. కొన్నిసార్లు కళ్ళతో చూసినవి, చెవులతో విన్నవి కూడా నిజాలు కావంటారు. వంశీగారి విషయంలో ఇదే జరిగింది. ఇక నుంచి ఎవరేం చెప్పినా నమ్మకూడదని నిర్ణయించుకున్నాను.

**బయట కూడా అమ్ములు లాగానే ఉంటారా?**

సినిమాలో నాది బయటకు కాలు పెట్టని అమ్ములు పాత్ర. బయట అలా ఉంటానని చెప్పడం కష్టం. అనవస రంగా బయట తిరగడం నాకు ఇష్టం ఉండదు. లేట్‌నైట్ పార్టీలకు నేను దూరం. నైట్ పార్టీకి వెళ్ళినా త్వరగానే ఇంటికి వచ్చేస్తాను.



**అందాల ఆరబోత గురించి...**

ఈ రంగానికి గ్లామర్ అనేది తప్పనిసరి. దాన్నే కొందరు అందాల ఆరబోత అంటున్నారు. ఎక్స్‌పోజింగ్ అంటారు. తెర మీద అందంగా కనిపించడానికి నాకు ఎలాంటి అభ్యంతరం లేదు. హద్దులు దాటని అందాల ప్రదర్శనకు నేను ఎప్పుడూ రెడీనే! విపరీతమైన ఎక్స్‌పోజింగ్‌కి మాత్రం దూరంగా ఉంటాను.

**కల్యాణ్‌రామ్‌తో చేయబోతున్నారట కదా?**

అవును! ఆయన సినిమాలో ఒక పాత్రకు నన్ను అప్రోచ్ అయ్యారు. కథ నచ్చింది. దానికితోడు అంత పెద్ద ప్రాజెక్టును వదులుకోవాలని అనిపించలేదు. వెంటనే ఓకే చెప్పేశాను. ఈ సినిమాలో నాది పూర్తిస్థాయి పాత్ర. మంచి ప్రాముఖ్యం ఉంటుంది. దీనికి సంబంధించి ఇంతకన్నా వివరాలు ఇప్పుడు చెప్పలేను.

**ఎలాంటి సినిమాలు చేయాలని అనుకుంటున్నారు?**

ఇప్పుడిప్పుడే ఈ రంగంలో నిలదొక్కుకుంటున్నాను. అప్పుడే నాకు ఇష్టమైన సినిమాలు అంటే చెప్పడం కష్టం. వచ్చిన అవకాశాల్లో మంచివి, నచ్చినవి చేస్తున్నాను. సినిమాలో నా పాత్ర నిడివి గురించి పట్టించుకోను. చిన్న పాత్ర అయినా సరే ప్రాముఖ్యం ఉన్నదైతే చాలు చేస్తాను. ఏ భాషలో అయినా చేస్తాను.

**టాలీవుడ్‌లో చేస్తున్న సినిమాలు?**

కల్యాణ్‌రామ్ గారితో చేస్తున్నానని చెప్పాను కదా. అది కాకుండా 'హౌరా బ్రిడ్జి' సినిమా పూర్తి కావచ్చింది.

–చిన్ని

